
దర్శకురాలిగా నా తొలి ప్రయత్నాన్ని దిగ్విజయం చేసిన
ప్రేక్షకలోకానికి హృదయపూర్వక కృతజ్ఞతలు.
సూపర్‌హిట్ ఫ్రెండ్స్
110
THANKS
వ.రోజు
చంటిగాడు
చిక్కడు... దొరకడు....
DIGITAL dts SOUND
నిర్మాత
బి.ఎ.రాజు
రచన-దర్శకత్వం
జయ
మరుధూరి రాజా - వందేమాతరం శ్రీనివాస్ - పూర్ణ.కె - రామ్‌లక్ష్మణ్ - ఆవుల వెంకటేష్

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

60

**Also available on net: www.haasam.com**

**ముఖచిత్రం**
'శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్' చిత్రంలో చిరంజీవి



## హాస్యం













## సంగీతం



'సెంటర్ స్ప్రెడ్' లో



సినిమా పాటల ప్రత్యేకం

పాటల ప్రత్యేకం








ఎడిటర్ గారికి,
మీ 'హాసం' పత్రిక ద్వారా ఈ మధ్య రూ.1000- సంపాదించాను! ఎలాగంటే మీ పత్రికలో - ఎడిషన్‌లో శుద్ధ ధన్యాసి రాగం ఆధారంగా తయారైన పాటల లిస్టు ఇచ్చారు! యథాలాపంగా చదివిన నాకు ఆవిషయం ఎందుకో గుర్తుండిపోయింది! 'సిరివెన్నెల'లోని "విరించినై" అనే పాట రాగం గురించి ఇద్దరు వర్ధమాన సంగీత దర్శకులు వాదించుకుంటుంటే అది విన్న నేను యధాలాపంగా ఆ పాట ధన్యాసి రాగం ఆధారంగా స్వరపరచారని చెప్పాను! వాళ్ళిద్దరూ అది విని నవ్వటంతో వారిద్దరిలో ఓ సంగీత దర్శకుడు పంతానికి పోయి రూ1000/- పందెం కాసాడు. అసలు శుద్ధ ధన్యాసి రాగమేలేదని! నేను మన "హాసం" మీద, మీ మీద నమ్మకంతో సరేనని 'హాసం' పత్రిక చూపించాను. అతను ఓటమిని ఒప్పుకుని అన్నమాట ప్రకారం రూ1000/- ఇచ్చాడు! మీకు, మన 'హాసం' పత్రికకు నా మనఃపూర్వక కృతజ్ఞతలు! సంగీతంలో ఓనమాలు తెలియని నేనే సంగీతం గురించి మాట్లాడే స్థాయికి ఎదిగానంటే "హాసం" పవరేంటో తెలుస్తుంది! మీరు, మన "హాసం" పదికాలాలు వర్ధిల్లాలని కోరుతూ...

**- డి. మురళీకృష్ణ, సబ్‌ఎడిటర్, తెలుగుపన్.కామ్, హైదరాబాద్**

**నే** పంపుతున్న జోక్స్, కొంటె కొశ్చన్లు, తుంటరి జవాబుల్ని సముచితంగా సవరించి ప్రచురిస్తున్న మీకు నా కృతజ్ఞతలు.

హాసం 16-29 ఫిబ్రవరి. 2004లో ప్రచురితమైన నా జోక్స్‌కు గాను పంపిన 'సంబరం' ఆడియో సి.డి.ని 'సంబరంగా' అందుకున్నాను. మీ సంతకంతో ఉన్న ఉత్తరం మరింత 'సంబరం' కల్గించింది. అలాగే 1-15 మార్చి 2004 సంచికలో ప్రచురించిన నా జోక్స్‌కు మీరు పంపిన 'ఐయామ్ ఇన్ లవ్ విత్ యు' సి.డి. కూడా అందినది. చాలా సంతోషంగా ఉంది. హాసం పత్రిక కోసం నెలకి రెండుసార్లు చకోరాన్ని అవుతున్నానంటే నమ్మండి.

**-రమణశాస్త్రి, సంగారెడ్డి.**

'హాసం' ఫిబ్రవరి 16-29 సంచిక చాలా బాగుంది. ముఖ్యంగా శ్రీ చిత్తరంజన్‌గారి కంట్రిబ్యూషన్ గొప్పగా వుంది. ప్రస్తుతతరం వాళ్ళకి తెలియని 50 సంవత్సరముల క్రిందటి పాటలు అందిస్తున్నారు.

నేను1964లో కాకినాడలో చదువుతున్నపుడు శ్రీమతి శ్రీరంగం గోపాలరత్నం గారు సరస్వతీ గానసభ హాలులో సంగీత కార్యక్రమం చేశారు. నేను స్టేజి మీదకు వెళ్ళి "శివ శివ శివ అనరాదా" అనే పాటను పాడమని కోరాను. ఆమె నా కోరికను మన్నించి వెంటనే పాడారు. యిప్పటికీ ఆ మధురానుభూతి మిగిలింది.

1957 -60 మధ్యలో విజయవాడ ఆకాశవాణి కేంద్రం లలిత సంగీత కార్యక్రమంలో ఈ పాట ఎక్కడా వినపడలేదు.

**-కె.యస్.కె. భగవాన్, విశాఖపట్నం.**

'హాసం' తొలి సంచిక నుంచీ ఫాలో అవుతూన్న పాఠకుల్లో నేనూ ఒకణ్ణి. మీ ప్రయత్నాలకి హాసాభినందనలు. పోతే 1-15మార్చి 2004 సంచిక 23వ పేజీలో రవిహిట్స్‌లో 'జబ్ చలీ ఠండి హవా' పాటను 'వక్త్' చిత్రం లోనిదిగా పేర్కొనడం జరిగింది. వాస్తవానికీ ఆ పాట మనోజ్‌కుమార్, ఆశాపారేఖ్ నటించిన 'దోబదన్' చిత్రంలోనిది.

**-పిసుపాటి ఉమామహేశ్వరమ్, హైదరాబాద్**

1-15 మార్చి 2004 సంచికలో "పేరడీ పెరేడ్" శీర్షికకు నేను పంపిన పాట ప్రచురించినందులకు, "అయామ్ ఇన్ లవ్ విత్ యూ" ఆడియో సి.డి.ని పంపినందులకు కృతజ్ఞతలు. పాటలో మీరు చేసిన చిన్నపాటి సవరణలు బాగున్నాయి. రావి కొండలరావు గారి 'హ్యూమరథం' (ఒళ్ళంతా)కుదుపులతో (నవ్వడంవలన) సాగుతోంది. అలనాటి మేటి చిత్రాల,నటుల గూర్చిన విశేషాలతో మమ్మల్ని తీయని అనుభూతులకు గురి చేస్తోంది. 'భయంకరంగారావు' అంటూ యస్వీ.రంగారావు గారిని వర్ణించడం వారి హ్యూమరిజానికి దర్పణం,

**-యం.అంజిరెడ్డి. ఒంగోలు.**

మార్చి 1-15,2004 సంచిక చాలా అద్భుతంగా ఉంది. భువనచంద్ర గారు రాస్తున్న కథలు చాలా బాగున్నాయి. నాటి రత్నం నేటి విత్తనంలా మళ్లీ మా ముందుకు నాటి చిత్రాల గురించి వ్రాయటం మాకు ఎంతో ఆనందంగా ఉన్నది.

**-శ్రీనివాస్ పవార్, ఆర్మూర్**

మనోల్లాసం కలిగించే 'హాసం' మా ఇంటిల్లిపాదికి నవ్వానం. ప్రతివక్షం ఎదురుచూడటమే! చదివి తీరడమే! భద్రపరచడమే! పత్రికలోని అన్ని శీర్షికలు గొప్పవే! సంపాదకీయం అద్భుతం. లతగారి గురించి పి.బి.శ్రీనివాస్ గారి ఉల్లేఖనం అద్భుతంగా సాగింది. పత్రిక చివరి రెండు పేజీల్లో పాత సినిమా బొమ్మలు, పాటలు, తారాగణం, కథ సంగ్రహం ఇస్తున్నారు బాగుంటున్నాయి. చిత్తరంజన్‌గారి లలితసంగీతంలో ఓలలాడుతున్నాం. వారికి కోటి కోటి ధన్యవాదాలు.

**-శుభశ్రీ, గుంటూరు**

గత 2సం॥ముల నుండి మీ పత్రిక చదువుచున్నాను. సంగీతం అన్నా, పాటలు అన్నా చాలా అభిమానం.

ఏఏ పాటలు ఏఏ సందర్భాలలో స్ఫురించినవో వాటి విషయాలు మమ్మల్ని ఎంతో అలరిస్తున్నాయి. అంతేగాక మర్చిపోయిన పాటల్ని గుర్తుకు తెస్తున్న హాసం అభినందనీయం. ఇకపోతే "సరిగమపదమని" శీర్షిక ఎంతోబాగుంది. వాటిలో లోపం ఏమిటంటే పజిల్ విజేతల పేర్లు పజిల్ వెనుకే ప్రచురించడంవల్ల మేము వాటిని కలెక్ట్ చేసుకోలేకపోతున్నాము. దయచేసి విజేతల పేర్లు మరోక పేజీలో ప్రచురిస్తే బాగుంటుంది. మా విజ్ఞప్తి. ఇకపోతే పాతపాట కెజె.ఏసుదాసు గారు పాడిన "ఓ రామచక్కని బంగారు బొమ్మా నీ రాత రంపపుకోత ఆయెనా" "చందన" సినిమా అది. వాటిని పూర్తిగా ప్రచురించాలని మా విన్నపం. వాటి వివరాలు తెలుపుతారని ఆశిస్తూ.

**-విరివింటి జయప్రకాష్ శాస్త్రి,వనపర్తి.**

'హాసం' పత్రిక ఫిబ్రవరి 2004 ద్వితీయార్థపు సంచిక, మార్చి 2004 ప్రథమార్థపు సంచికలు నిన్నందే హాంగా పదికాలాలపాటు పదిలపరచుకోతగ్గవి అంటే అతిశయోక్తి కాదు. ఎందుకంటే ఈ రెండు సంచికల్లో ఎన్.ఎ.టి.వారి "సీతారామకళ్యాణం" చిత్రానికి సంబంధించిన సంగీత, సాహిత్య అభినయ చిత్రీకరణలపై విశ్లేషణ, ఒక మనోహర దృష్టికి, ఒక అపురూప అనుభూతికి అవిష్కరణ.

**-పెరుమాళ్ళ వేంకటస్వామి, హైదరాబాద్**

హాసం ఎడిటర్ రాజాగార్కి నమస్కారాలు. నేను చదివే కొద్ది పత్రికలలో 'హాసం' ముఖ్యమైనది. ఈ మధ్యకాలంలో నా కిష్టమైన శీర్షికలు' నిలువటద్దాలు' భరణిగారి వాగ్గేయ కారుల విషయాలు మొదలైనవి రావడంలేదు. మాది మారుమూల ప్రాంతమయ్యేసరికి 'సరిగమపజిల్' పంపుట ఆలస్యమవుతుంది. ఈసారి అయినా పజిల్ పూర్తి చేయాలని తలంపుతో 5వతేది కొన్న 'హాసం' నుండి పజిల్ పూర్తి చేసి పంపుతున్నాము.

**-యమ్.కె.వర్ధని, పొన్నలూరు**

ఫిబ్రవరి 16-29 సంచిక మల్లీశ్వరి పాటల పుస్తకం. దాగుడుమూతలు పాటల పుస్తకం. దేవులపల్లి కృష్ణశాస్త్రి పాటలు, టి.వి.రాజు పాటలు ఇచ్చినందుకు చాలా సంతోషంగా వుంది.

మా, మీ పత్రిక ఇంకా ఉన్నత స్థాయికి ఎదగాలని హాసం పాఠకుడిగా నా అభినందనలు తెలుపుకుంటున్నాను.

**-జి. స్వాతి కార్తీక్ సాగర్ . వనపర్తి**

సంపుటి: 3 సంచిక: 12

**16-31 మార్చి 2004**

**పేజీలు: 76**

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా॥ కె.వి.రావు**
**జె.మధుసూదన శర్మ**

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P.Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P.Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music

# హాసం

హాస్య-సంగీత పత్రిక

60



లోకంలో తెలియని సంగతులెన్నో తెలుసుకోవడానికి ప్రపంచభాషగా ఎదిగిన ఇంగ్లీషును కాస్తయినా వంటబట్టించుకుందామని ప్రయత్నిస్తూ ఉంటాం. ఇతరభాషలలోని గొప్పరచనలను కూడా తమభాషలో తర్జుమా చేయించుకునే సంప్రదాయం ఉంది వారికి. తెలుగువాళ్లందరికీ ఇంగ్లీషు బాగా - అంటే నవలలలో సారం అర్థమయ్యేటంత బాగా - రాదు కాబట్టి ఆంధ్రపత్రిక వీక్లీ వారు అర్థశతాబ్ది క్రిందనే ఇంగ్లీషు భాషలో వెలువడిన గొప్పరచనలను తెలుగులోకి అనువదించి పాఠకులకు అందించారు. ఆ విధంగా 'కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో' వంటి గొప్పనవలలు, 'టామ్ సాయర్' 'హకల్ బెరీఫిన్' వంటి పిల్లల నవలలు తెలుగు మాత్రమే తెలిసినవారు కూడా చదివి ఆనందించే వీలు కలిగింది.

సినిమాల విషయానికొస్తే ప్రపంచవ్యాప్తంగావున్న అనేక దేశాల మేధావులు తమ ప్రజ్ఞను ప్రదర్శించడానికి హాలీవుడ్ సినిమాలను వేదికగా ఎంచుకోవడం జరిగింది. దృశ్యాలను చూసి కథ ను ఊహించుకోవడం కంటె కథ తెలిస్తే ఇంకా బాగా ఎంజాయ్ చేస్తామని తెలిసిన ఆంధ్రపత్రికవారు 'బెన్‌హర్' వంటి సినిమాల కథలు కూడా ఇచ్చేవారు.

పోను పోను 'అనువాద సాహిత్యం' తగ్గింది. ఈనాడు ఎంత గొప్ప నవల ఇంగ్లీషులో వచ్చినా కేవలం 'పరిచయా'లతో సరిపెట్టుకుంటున్నాం. అంటే మనవాళ్ల ఇంగ్లీషు స్థాయి పెరిగిపోయిందని కాదు. డైరక్టు ఇంగ్లీషు నవలలు చదివేవారి సంఖ్య పెరిగినా ఇంగ్లీషు అర్థం కాని వారి సంఖ్య కూడా గణనీయంగా పెరుగుతూనే ఉంది. అర్థమవడమంటే ఆఫీసుల్లో ఉపయోగించే ఇంగ్లీషని కాదు. శబ్దార్థ భావసౌందర్యాలను ఆస్వాదించగలిగే కళ.

హాలీవుడ్‌లో లారెల్‌హార్డీ టైపు హాస్యం రోజులు వెళ్లిపోయి కొత్త కొత్త ఆలోచనలతో అనేకానేక హాస్య చిత్రాలు విరివిగా తీస్తున్నారు. డైలాగ్ ఓరియెంటెడ్ హాస్యం బోల్డంత వస్తోంది. వాటిని ఆస్వాదించడానికి మనకు భాష అవరోధ మవుతోంది. ఆ అవరోధాన్ని అధిగమించడానికే ఈ సంచికనుండి 'చిత్రపరిచయం' ప్రారంభిస్తున్నాం. విదేశీకథలను తెలుగు నుడికారంతో ఎలా చెప్పవచ్చో ముళ్లపూడి వెంకటరమణ, నండూరి రామ్మోహనరావులు ఎప్పుడో చేసి చూపించారు. ప్రపంచంలో హాస్యం ఏ రూపంలో ఉన్నా 'హాసం' పాఠకులకు పరిచయం చేయాలనే తపనే మమ్మల్నీ కష్టసాధ్యమైన ప్రయత్నానికి పురికొల్పింది. ఈ శీర్షిక వల్ల 'హాసం'లో పిల్లలకు ఒక ప్రత్యేక శీర్షిక లేదన్న లోటు పూరింపబడుతుందని ఆశిస్తున్నాం.

ఉగాదికానుకలలో మరో కానుక - కళాభినేత్రి జమున సినిమా పాటలపై వెలిబుచ్చుతున్న మనోగతం. పాటలను రక్తికట్టించడానికి తెరవెనుకనుండే గీత, సంగీతకారులు, గాయకులు ఎంత కారకులో తెరపై అభినయించిన నటీనటులు కూడా అంతే అభినందనీయులు! ప్రేక్షకశ్రోతలు పాటలను విని ఆనందించాలంటే ముందు నటీనటులు ఆ పాటలను ఆస్వాదించి, ఆనందించి, తాదాత్మ్యం చెందినట్టు అభినయించాలి. వందలాది సినిమాలలో నటించిన అభిరుచిగల నటీమణిగా శ్రీమతి జమున తనకు నచ్చిన, తాను అభినయించిన పాటలను గుర్తు చేసుకుంటూ ఈ శీర్షిక ద్వారా తన అనుభవాలను 'హాసం' పాఠకులతో పంచుకుంటారు. తార పరంగానైనా, సంగీత సాహిత్యపరంగానైనా - ఏదో ఒక రూపంలో పాటలను 'హాసం' పాఠకులకు దగ్గరకు చేయడమే మా లక్ష్యం.

గేయాల గురించే కాక గాయనీమణుల గురించిన శీర్షికనూ మరొక ఉగాది కానుకగా ప్రారంభిస్తున్నాం. ప్రసిద్ధ రచయిత్రి ఇంద్రగంటి జానకీబాల సినీనేపథ్యగాయనీమణుల గురించి వ్రాస్తున్న వ్యాసపరంపరలో కెరియర్ వివరాలతో బాటు వారి గాననైపుణ్యం గురించి తమ అభిప్రాయాలను ఖచ్చితంగా వెల్లడించారు. అంతేకాదు ఒక స్త్రీగా వారి ఆంతరంగిక జీవితాలను స్పృశించి, విశ్లేషించి సాధ్యమైనంత మేరకు వెల్లడించారు.

తక్కిన శీర్షికలలాగే ఈ శీర్షికలూ పాఠకుల అభిమానాన్ని చూరగొంటాయని ఆశిస్తూ 'హాసం' పాఠకులకు తారణనామ సంవత్సర శుభాకాంక్ష లందిస్తున్నాం.

# కాదేదీ కథకి అనర్హం

ప్రముఖ సినీ గీత రచయిత
**శ్రీ భువనచంద్ర**
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

**మా ఆవిడ ఇంతే మరి మీ ఆవిడ?-5**






'కథలు వ్రాయడం అంటే అల్లాటప్పా వ్యవహారం కాదనీ ...చాలా'విషయం' వుండాలనీ కాళీపట్నం రామారావుగారు అప్పుడెప్పుడో' అన్నట్టు మా సుబ్బారావు మామయ్య నాతో చెప్పాడు. ఆ మాట ముమ్మాటికీ నిజమేనని నాకు తెలిసేటప్పటికే జరగాల్సిన 'డామేజి' జరిగి పోయింది.

'నేనూ మా ఆవిడా' అంటూ పోచుకోలు కబుర్లన్నీ పేపరు మీద పెట్టి...ఇది 'కథ'..మీరు యీ 'కథారాజాన్ని' చదివి మీ అభిప్రాయం తెలుపగలరు-అంటూ చంకలెగరెయ్యడమూ- 'హాసం'పుస్తకాలు బోల్డన్ని కొని చుట్టాలకీ స్నేహితులకీ పంపి 'నాకథ అచ్చయ్యింది చదవండహో' అని బలవంతం చేసి చదివించడమూ ఎంత 'డేంజరస్ విషయమో' 'ఫేన్ మెయిల్' వస్తే గానీ అర్థం కాలేదు. ఆ'సుజ్ఞానం'ఎలా కలిగె నంటే...

పోస్టుమేన్ 'బక్షీస్'తీసికెళ్ళిపోయాక 'గర్వంగా' మా ఆవిడ వంక చూస్తూ కవర్ల 'బొత్తి' విప్పాను.

ఫస్టులెటరు వైజాగునుంచి, గట్టిగా -వంటింట్లోకి వెళ్ళబోతున్న మా ఆవిడకి వినిపించేట్టు - చదవటం మెదలెట్టా.

"శ్రీ బి.సి.గారికి-మీరు వ్రాసిన కథ మీ(మా) 'హాసం'లో చదివాను. (వంటింట్లోకి పోతున్న మా ఆవిడ మొదటలైను చదవగానే తిరిగొచ్చింది).

నేను గత ఆరేళ్ళనించీ అర్థంకాని కడుపు నొప్పితో బాధపడుతున్నాను. ఎంత మంది వైద్యులకి చూపించినా ఏమాత్రం నయం చేయలేకపోయారు. అసలెప్పుడూ కథలూ కాకరకాయలూ చదవనివాడ్ని ఎందుకో 'హాసం'లో మీకథ చదివాను. చదివిన వెంటనే ముచ్చటగా మూడే మూడు వాంతులయ్యాయి. కడుపు నెప్పి మంత్రం వేసినట్టు మాయమైంది. మీ అద్భుతమైన కథతో నా ఆరోగ్యాన్ని పరిరక్షించినందుకు సర్వదా కృతజ్ఞుడను.

ఇట్లు సూది సన్యాసిరావు వ్రాలు".

నేను లెటర్ పూర్తి చెయ్యగానే కిసుక్కుమని మా ఆవిడ నవ్వింది 'దూషణ భూషణ తిరస్కారాల్ని' కవి కాదల్చుకున్నవాడు పట్టించుకో

కూడదుగదా! రెండో లెటరు తీశాను. అది మా చింతలపూడినించి.

"బి.సి.కి-బండి విశ్వనాథం వ్రాయునది. మీరు మన చింతలపూడి వారై వుండి కూడా మనవూరి పరువు తియ్యటం ఏమీ బాగాలేదు. చింతలపూళ్ళో పుట్టిన 'మగా' డెవ్వడూ ఇంతవరకూ 'పెళ్ళాన్నీ, పెళ్ళాం తెలివినీ' కీర్తిస్తూ కథలు వా్రయలేదు. మరోసారి ఇలాంటి కథలు రాస్తే- మనవూరి 'సంప్రదాయం' ప్రకారం మీకు 'సన్మానం' చేయవలసి ఉంటుంది. గ్రహించవలెను-

ఇట్లు బండి విశ్వనాథ్,ఆశ్రమంవీధి. చింతల పూడి,ప॥గో॥జి."

నాగుండె 'గుభేల్'మంది. రౌరవాది నరకాలైనా భరించగలిమేమో కానీ మా వూరి 'సాంప్రదాయక' సన్మానాన్ని భరించడం ఎవరి వల్లా కాదు. 'పేకా' వారమ్మాయిని పెళ్ళి చేసుకుంటావా? 'చింతా' వారమ్మాయిని పెళ్ళి చేసుకుంటావా? అంటే ఏం చెప్పగలం!

మూడోవుత్తరం తీశాను. స్వచ్ఛ హైద్రాబాదీ తెలుగులో వుంది. సంబోధనా కార్యక్రమం ఏమీ లేకుండా డైరెక్టుగా లెటర్ మొదలైంది.

"ఎందిబే...షర్మైతల్లా? పెండ్లాన్కి భయపడి పప్పురుబ్బుతావు బే? ధూత్..గసుమంటి...జల్మ ఎందుకే..! గండిపేట్లో దూకరాదే? నేన్జూడు...! డైలీ గుడుంబా ఏస్కొని పెండ్లాన్ని మంచిగా తంతా. మొగోడంటే నామాదిరుండాల! గంతేగానీ పప్పురుబ్బే సాలెగాడు ఏం జేస్తడు? గీసారి హైద్రాబాద్ కొచ్చినప్పుడు నన్ను గల్వు. పెండ్లాన్ని ఎట్ల తన్నాలో మస్తుగ ఐడియాలు జెప్తా...నాపేరు యాద్గిరి.భూల్‌నానై..."

విని మా ఆవిడ పకా పకా నవ్వుతోంది. నా మొహం పెసరట్టు మాడినట్టు మాడిందంటే మాడదామరి! ఉత్తరాలన్నీ పక్కకి నెట్టేసి ఊగుడు ఛైర్లోకి షిఫ్టయిపోయా...

"వొద్దన్నా విన్నారా? హాయిగా పాటలు రాసుకోక యీ కథల పిచ్చేమిటీ? సరే..! అయిం దేదో అయింది. మిగతావి కూడా చదవండి" కవర్లన్నీ మళ్ళీ తెచ్చిచ్చింది మా ఆవిడ.

"నావల్లకాదే!"చేతులెత్తేశాన్నేను. మనని తిట్టిన తిట్లు మనమే చదువుకోవాల్సొంటే 'ఇలాకాక' ఇంకెలా వుంటుందీ! నాలుగో ఉత్తరం తీసింది మాఆవిడ.

"ఇదేంటండీ...వెయ్యినూటపదహార్లకి చెక్కుంది"ఆశ్చర్యంగా అడిగింది.

"నాకేం తెలుసూ ఉత్తరం చదువు..అదే తెలుస్తుంది". మామూలుగా అన్నానే గానీ నాలో ఉత్సాహం పరుగులు తీసింది. పాపం ఈయనెవరో నా కథ చదివి ఆ ఆనందంలో చెక్కుపంపి ఉంటాడనిపించింది.

"శ్రీయుత బి.సి.గారికి-తొలి'పేమెంటు' శుభ

## సాంగుతే బంగారు రాజా




ప్రదంగా వుండాలని 'వెయ్యినూటపదహార్లు' మాత్రమే పంపుతున్నాము. నెక్ట్స్ చెక్కు పెద్ద మొత్తంలోనే వస్తుంది.

మీరు కథలు వ్రాసి మా 'మహాపెయిన్ బామ్' తలనొప్పి అంజనానికి ఎంతో 'మార్కెట్' తెచ్చారు. మీ కథలు చదివిన వాళ్ళందరూ గుంపులు గుంపులుగా వచ్చి మామూలు 'బామ్'లు చాలవనీ మా'మహాపెయిన్‌బామ్'నే కొనుక్కెడుతున్నారు. దాంతో మా ప్రాడక్టు సూపర్ హిట్టై, మెగాహిట్ రేంజికి చేరింది.

మీరిలాగే తామరతంపరగా కథలు వ్రాస్తూ-మాకు హెల్ప్ చేస్తే 'మిమ్మల్ని మా బ్రాండ్ అంబాసిడర్‌గా' నియమించుకుని గౌరవించుకుంటామని తెలియజేస్తూ

జి.యమ్.

మహా పెయిన్‌బామ్ కం॥లి॥

విజయవాడ

ఉత్తరం పూర్తిగా వినగానే నా కళ్ళల్లో గంగా గోదావరీ ఏకకాలంలో ప్రత్యక్షమయ్యాయి.

మా ఆవిడ అనునయంగా, "డోంట్ వర్రీ మగడా.. పాజిటివ్‌గా తీస్కో!.... చూడు...! నీకథలు అందరూ చదువుతున్నారని వీళ్ళ వుత్తరాల ద్వారా తెలిసింది గదా..! ఎవ్వరూ మొదటి సినిమాతోనే మెగాస్టారూ-మొదటి కథతోనే మెగాస్టోరీ రైటరూ అయిపోరు. టేకిటీజీ"అంటూ అయిదో వుత్తరం తీసింది.

"యావండోయ్..ఇది మా కూచిపూడి నుంచి వచ్చింది.."ఉత్సాహంగా కవరు చించి చదవడం మొదలెట్టింది.

"గౌరవనీయులలైన మావూరి అల్లుడు గారికి-కూచిపూడి వాస్తవ్యులైన వేదాంతం రాధాకృష్ణమూర్తి మరియూ అగ్రహారీకులూ సంయుక్తంగా వ్రాయు లేఖావిశేషములు- (మా ఆవిడ నావంక గర్వంగా ఓ లుక్కు పడేసింది... ఎంతయినా సొంతవూరి ఉత్తరంగదా)

"మేమంతా ఇక్కడ క్షేమం. మీరు క్షేమంగా వుండదలచుకుంటే మావూరిని ఎకసెక్కం చెయ్యడం మానుకోవాలి. మీఊళ్ళో ఏ పండక్కి ఏమి వండుతారో మీ యిష్టం,మీ వూరివాళ్ళ ఇష్టం! ఆ విషయంలో మాకేమీ సంబంధంలేదు. అయితే మావూళ్ళో ఏపండుగవచ్చినా 'పులిహోర,పెరుగువడ, అల్లంచెట్నీ' మాత్రమే' చేస్తారనిన్నూ, అవి తప్ప ఏఇంటికి వెళ్ళినా మరే






'పిండివంటా' కనిపించదనిన్నూ వ్రాయడం మహాఘోరమూ అవమానకరమూ!

మావూరి 'ఆడబడుచుని' మీరు మీ కథల్లో ఎంత మెచ్చుకుంటున్నా...పైన ఉదహరించిన విషయంలో మాత్రం మీరు మమ్మల్ని 'తగ్గిం'చారనే అనుమానపడవలసి వస్తోంది. 'మావూరి అమ్మాయిని' పెండ్లిచేసుకున్నారనే ఒక్కకారణంతో మీ ప్రథమ తప్పిదాన్ని మన్నిస్తున్నాం. అంతేగాక -యీసారి మీరు మావూరు వేంచేసినపుడు- పులిహోర, పెరుగువడా, అల్లంపచ్చడీ, 'మాత్రమే' గాక అనేకానేక శాకపాకములను వడ్డించి, మా పాక నైపుణ్యముపై మీకున్న 'అపోహని' తొలగిస్తామని తెలియజేసుకుంటూ-

కిందపదహారున్నర సంతకాలున్నై" ఉత్తరం చదవటం పూర్తి చేసింది మా ఆవిడ.

మాట్లాడటానికేవుందీ! తగుదునమ్మా అని కథలు వ్రాయడం ఎందుకూ? 'కింకర్త్యం'అని బుర్రగోక్కోడమెందుకూ!

మా ఆవిడకీ ఉత్సాహం నశించిందనుకుంటా....ఉత్తరాలు పక్కనపారేసి చక్కా వంటింట్లోకి పోయింది.

కథలు వ్రాయడం మాని మూడు రోజులు అయ్యేసరికి మళ్ళీ చేతులు దురదపెట్టినై. అదీగాక మాబావమరిది ఏదో ఇంటర్వ్యూకని మావూరొచ్చి -"భలేగా వ్రాశావు బావా కథలు..! మా బేంకు వాళ్ళంతా తెగమెచ్చుకున్నారనుకో...!" అంటూ ఎంకరేజ్ చేశాడు.

ఏదైతే అదైంది అనే ధైర్యంతో మళ్ళీ పేపర్లు, కలాలు ముందేసుకుని కథ మొదలు పెట్టేంతలో ఓ దోమ 'కసుక్కున' కుట్టింది. ఫటాల్న దాన్ని స్వర్గలోకానికి పంపించి-మా బావమరిదితో

"ఇదిగో శీనూ...! ఇది మీ కూచిపూడి దోమే!" అని సరదాగా సరసమాడాను.

"ఏం? మీ చింతలపూడి దోమ ఎందుగ్గాకూడదూ" కాఫీ తీసుకొస్తూ మా ఆవిడ చిరుకోపంగా అంది.

"మా చింతలపూడి దోమలు కేవలం నిద్రపోయేటప్పుడే కుడతై! అదీ నాజూగ్గా! ఇది చూడు ....ఎంతలా కుట్టిందో...! గ్యారంటీగా ఇది కూచిపూడి దోమే...!"నేను పట్టు బిగించాను.

"ఓహో కూచిపూడి దోమ మద్రాసుకెలా వచ్చిందీ? మీ చింతలపూడి దోమ రెక్కలమీద ఎక్కి ఎగిరొచ్చిందా?" వేళాకోళంగా చేతులాడించింది మా ఆవిడ.

"మీవూరి దోమకి మావూరి దోమల




నపోర్టెందుకూ? హాయిగా అదే వచ్చుండాలి...!" నేనూ కాళ్ళాడించా.

"అబ్బబ్బా...ఊరుకోవే! బావ ఏదో సరదాగా అంటే దాన్నే పట్టుకుని నిలదీస్తే ఎలాగా" వాళ్ళక్కయ్యకి సర్దిచెప్పబోయాడు మా బావమరిది.

"సరదాగానా..! ఒరేయ్ తమ్ముడూ...ఏదో ఒకసారంటే ఎవరైనా ఊరుకుంటారు. ఇప్పటికి ఎన్నిసార్లు ఎన్నెన్ని మాటలన్నారో తెలుసా?"

"ఏమన్నానేమిటి?" దీర్ఘంతీస్తూ అడిగా.

"ఏమన్నావా? గుర్తుతెచ్చుకో కొంచెం.." టైమిచ్చింది మాఆవిడ. ఎంత బుర్ర గోక్కున్నా ఏమన్నానో ఎప్పుడన్నానో ఏమీ గుర్తుకురాలా.

"గుర్తురాలేదుకదా! ఎందుకు గుర్తువస్తుందీ"! వెటకారంగా అంది మళ్ళీ.

"అబ్బ..! ఊరుకుందూ..!" రాబోయే యుద్ధాన్ని మధ్యలోనే ఆపటానికి ట్రై చేశాడు శీను. (తనకీ పెళ్ళయిందిగా..! అనుభవం..!)

"ఊరుకున్నాన్రా..! మనవూరి సంగతి ఎన్నిసార్లెత్తినా ఊరుకున్నాను. ఏవన్నారో తెలుసా? మనవూరి దోమలు 'హైటెక్' దోమలట! ఏనుక్కి అక్కలూ, డైనోసార్‌కి చెల్లెళ్ళూట! వాటి సంగీతం పావ్‌ర్యావ్ మిక్సట..అవి ఎగురుతున్న ఫ్లైయింగ్ సాసర్లుట.... అప్పటికీ ఊరుకున్నా!

అవతల చుట్టాలూ పక్కాలు బోల్డంత మంది వున్నా యీయన మహాజోరుగా 'ఆగదు ఏ దోమా నీకోసమూ... ఆగితే ప్రాణాలకు మోసమూ' అంటూ పేరడీలు కూడా కట్టి పాడారు. పైగా శ్రీశ్రీగారు 'అగణిత వైజాగ్ దోమలశ్వత్థామల్' అని అన్నారు. అదే అనుభవం మీఊరి దోమల్తో గనుక అయివుంటే 'అగణిత కూచిపూడి దోమలశ్వత్థామల్' అని వుండేవారు అంటూ పద్యాలెత్తుకున్నారు.

అలా పద్యాలు లంకించుకోకోయ్ లంకేశ్వరా అని ఇమ్మీడియట్‌గా అందామనుకున్నా గానీ పదిమందిలో గొడవ ఎందుకులే అని అప్పటికీ సైలెంటుగానే వున్నా. చివరికి ఏమన్నారో తెలుసా? మనవూరి దోమలతో 'దోమాకలాపం' ఆడిస్తే కోట్లు కురుస్తాయన్నారు..." విషయం తమ్ముడికి వివరించింది మా ఆవిడ.

"అవునే..! నీవు మాత్రం మా చింతలపూడి దోమలు మాయలమరాఠీలనీ, కుట్టినచోట కుట్టకుండా రక్తం మొత్తాన్నీ లాగేసే మాయ కిలాడీలనీ, అన్లేదూ? అంతటితో ఆగావా? బ్లడ్‌బ్యాంక్ వాళ్ళందరూ బ్లడ్ కోసం మనుషుల్ని వెతకఖ్ఖర్లేదనీ- మావూరి దోమల్నించి గనక రక్తం తీస్తే బ్లడ్డు ఫ్లడ్డై పొంగుతుందనీ అన్లేదూ?" నేనూ రెట్టించా..

"ఎప్పుడన్నానూ? ప్రపంచంలో దోమల

పోటీలు పెడితే మీ కూచిపూడి దోమే ఫస్టు ప్రయిజు కొట్టేస్తుందని నువ్వు అన్న తరవాతేగా?" తనూ రెట్టించింది.

"ఇదిగో శీనూ.. మీ అక్క తప్పు చెపుతోంది. అసలు తను మొదట ఏమందో తెలుసా..? మా వూరి దోమల్ని జేబుల్లో పెట్టి కుట్టించబట్టే వి.వి .యస్. లక్ష్మణూ, రాహుల్ ద్రవిడూ సెంచరీలు చేశారంది... మైకేల్‌జాక్సను కూడా డాన్సు చేసేముందు చింతలపూడి దోమల్ని పేంటు జేబుల్లోనూ షర్టు జేబుల్లోనూ వేసుకుని జిప్పులు బిగిస్తాడంది...! అలా అనటం తప్పుకాదా?" కోపంగా నా వాదన మా బ్రదరిన్లాకి వినిపించా..

"అవునోయ్..! మావూరి దోమల్ని నువ్వు తిట్టొచ్చుగానీ మీవూరి దోమల్ని నేను తిట్టకూడదా? ఇదేం న్యాయం..? సరే- నేను అన్నానే అనుకో.. నువ్వేం అన్నావూ? ఒరే శీనూ..'ఫలానా' పిక్చరు ఫస్టుడేనే ఫ్లాప్ అవడానికి కారణం మనవూరి దోమల్ని ఆ సినిమా రిలీజయ్యే ప్రతీ థియేటర్లోనూ- ప్రత్యేకంగా కొనుగోలు చేసి మరీ -వదిలి పెట్టారంట! లేకపోతే ఆ పిక్చరు సూపర్ హిట్టయ్యేదిట!"

"ఆమాట ఇప్పటికీ అంటాను. సూపర్ కథా,ఫైట్సు, సాంగ్సూ, డైలాగ్సూ, సూపర్ సూపర్ హీరో, డైరెక్టరూ వున్న ఆ పిక్చర్ ఫ్లాప్ కావడానికి ముమ్మాటికీ మీవూరి దోమలే కారణం. ఆ ప్రొడ్యూసరుగారు సి.బి.ఐ. వాళ్ళని రిక్వెస్టు చేసి అసలు విషయం కూపీ తీయించారు...ఈ ప్రొడ్యూసరు సినిమా ఫ్లాప్ కావాలని మరో ప్రొడ్యూసర్ ప్రత్యేకంగా జమాజెట్టీల్లాంటి దోమల్ని మీ వూరి నించే తెప్పించి థియేటర్సులో వదిలాడని పేపర్లో కూడా వేశారు..! కావాలంటే చదువుకో..రిపోర్టు తెప్పిస్తా.." ఛాలెంజ్‌గా అన్నాను.

"ఊళ్ళన్నీ తిరిగి పెత్తనాలు చేసేవి మీవూరి దోమలే..!" కచ్చగా అంది మాఆవిడ.

"ఒసేయ్ అక్కయ్యా...! మా హైద్రాబాద్ దోమల్నించి ఒక్కరోజైనా 'సెలవు' తీసుకుందామని ఇంటర్వ్యూ పేరు మీదవస్తే మీరిద్దరూ ఇలా నన్ను మధ్యలో ఇరికించి 'తమాషా' చేస్తారుటే!" దీనంగా అన్నాడు శీను.

"ఓకే...ఓకే.. ఇక మీవూరి దోమ సంగతి ఎత్తనే ఎత్తను..అవి చాలామంచివి సాధు జంతువులూను...ఎప్పుడో తప్ప కుట్టనే కుట్టవు..! ఒకవేళ కుట్టినా నెప్పితగలకుండా కుడతయ్యే తప్ప నిద్రాభంగం కలిగించవు! ..సరేనా!" మా ఆవిడ్ని ప్లీజ్ చేసే ప్రయత్నంచేశా! (కేవలం మా బావమరిదిని తృప్తి పరచడంకోసం)

"మీరు మావూరి దోమల సంగతి ఎత్తకపోతే నేను మాత్రం ఎందుకు అరుస్తాను. మీవూరి దోమలూ మంచివే నుమండీ...! కుట్టినా,వెంటనే నెప్పితెలియకుండా యుడిక్‌లోనో, గంధమో పూస్తాయి!" ఆవిడా సన్నగా అని వంటింట్లోకి పోయిం ది.

ఇంతకీ ఆవిడనన్ను ప్లీజ్‌చేసినట్టా, వెక్కిరించినట్టా?

పి.యస్.

అయ్యా....కథలో దోమల సంగతి ఎందుకొచ్చిందనా? కథ రాయటం అంటే అల్లాటప్పా వ్యవహారం కాదనీ ఏదన్నా మాంఛి 'బేస్' వుండాలనీ మా సుబ్బారావు మావయ్య నాతో చెప్పాడని చెప్పానుగదా! 'బేస్' అంటే ఏమిటని అడిగా!

"బ్రహ్మచారులకైతే ప్రేమా-మొగుడూ పెళ్ళాలకైతే ఫైటూ" అని సెలవిచ్చాడు. ఫైట్ చెయ్యాలని ప్రయత్నించానుగానీ పూర్తిగా కుదర్లా. మరోసారి మరో విధంగా ట్రై చెయ్యాలి.....అదీ 'ఫేన్ మెయిల్'ని దృష్టిలో పెట్టుకుని!




# నవ్వొస్తే - నవ్వొచ్చు

కర్లపాలెం హనుమంతరావు



మన తెలుగు సినిమా హీరోయిన్లందరిదీ ఒకటే మాట (అందరికీ డబ్బింగిచ్చేది ఒకళ్ళో... ఇద్దరోనే గదా)

'దాస్ కాపిటల్' రాసిన కారల్ మార్క్స్ షేర్‌మార్కెట్లో చాలా పోగొట్టు కున్నాడు!



గాంధీగారు ఎప్పుడు రైల్లో ప్రయాణం చేసినా అప్పట్లో మూడో తరగతిలోనే కూర్చునేవారు. సెక్యూరిటీ కారణాల వల్ల ఆ బోగికి అటూ ఇటూ ఉన్న బోగీలు కూడా ఖాళీగా ప్రయాణం చేయాల్సొచ్చేవి. అందుకని సరోజినీదేవి నాయుడు గారు 'ఈ పెద్దాయన్ని బీదవాడుగా మెయింటైన్ చేయటానికి పాపం రైల్వే వాళ్ళకి బోలెడంత ఖర్చువుతుంది బాబో' అని అస్తమానం ఎగతాళి చేసేవారుట.

పుట్టపర్తి నారాయణ చార్యులు గారు వ్రాసిన గ్రంథమే ఆయన ఎమ్మే పరీక్షలు రాసినప్పుడు పాఠ్యగ్రంథంగా ఉండేది తీరా పరీక్ష రాయాల్సి వచ్చినప్పుడు ఆయన అందులోనే తప్పాడు!



1953 మార్చి 5 న స్టాలిన్ మరణించాడు. ఆ రోజు భారత ప్రభుత్వం పార్లమెంట్ సమావేశాలను రద్దుచేసి సెలవు ప్రకటించింది. సోవియట్ యూనియన్లో మాత్రం సెలవు లేదు.

పోలీసులకు యూనీఫాం ప్రమాదం. గుర్తుపడితే నక్సలైట్లు కిడ్నాప్ చేసేయొచ్చు.

హైదరాబాదు జిల్లా ఎడిషన్ పేపర్లో ఈ మధ్య ఒక పోలీసు అధికారి పోస్టుమార్టం వివరణ తమాషాగా ఉంది. సైనిక్‌పురి క్రాస్‌రోడ్స్ ఏక్సిడెంట్‌లో దుర్మరణం పాలైన యువకుడి మృతికి అతను తగిలించుకున్న హెల్మేట్టే కారణం అని తేలింది. హెల్మేట్ బెల్ట్ మెడకు బిగిసి మరణించాడు.



ఇండియాను కనుక్కోవాలని బయలుదేరిన కొలంబస్ దారి తప్పి అమెరికాకు వెళ్ళాడు. ఎందుకో తెలుసా? అతని పేరులో 'బస్' ఉంది గనక. బస్‌లెప్పుడూ సరైన గమ్యం చేరవు గదా!



# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## నరసదాసు కీర్తన

**గానం, సంగీతం:** చిత్తరంజన్
**రాగం:** అభేరి
- రాగ్ భీంపలాస్ (హిందుస్తాని సం॥)
22వ మేళకర్త ఖరహరప్రియజన్యం
**తాళం:** మిశ్రచాపు (కర్ణాటక సం॥)
రూపక్‌తాల్ (హిందుస్తాని సం॥)
**ఆరోహణ:** స గ మ ప ని స
**అవరోహణ:** స ని ద ప మ గ రి స

## రామా నాముందు నిలిచి

ప: రామ శ్రీరామా
రామా నా ముందు నిలిచి ప్రేమతో మాటాడవేమి
నా పైని కరుణ ఇంచుక చూపవా ॥రామా॥

అ: కోమలంబగు పాదసేవల కోరియుంటిని
యితర ఫలములనేవియును కోరంగ బోను
ఇనకులేశ్వర జనక జేశ్వర ॥రామా॥

1.చ॥ నీవే తల్లివి నాకు నీవే తండ్రివి నాకు
నీవే దాతయు సఖుడవు నీవే గురుడవు
నీవే నాదగు యిష్ట దైవము నీకన్నను ఎవరు దిక్కు
సేవకుడను నీకు తండ్రి ఏవగింపకు శ్రీరమాపతి ॥రామా॥

2.చ॥ నారు పోసిన నీవే నీరుపోయగ రావే
వారిజాక్ష పసివాడను సంరక్షింపుము
నేరములను ఎంచుచుండిన నేనెంతటి వాడను
శ్రీరామాక్షేత్రవాసా నరసదాసును బ్రోవరారా ॥రామా॥

**షడ్జము, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, కైశికినిషాదం ఆరోహణలోనూ, కైశికినిషాదం, చతుశృతిదైవతం, పంచమం, శుద్ధమధ్యమం, సాధారణ గాంధారం, చతుశృతి రిషభం,షడ్జము అవరోహణలోను వుండే స్వరాలు యీ రాగంలో.**

భక్తికి శృంగారానికి కూడా అనువైన రాగం అభేరి. దేశభక్తి, ప్రభోధగీతాలు కూడా ఎన్నో యీ రాగంలో రూపుదిద్దుకున్నాయి. లలిత సంగీతంలో అధికంగా వాడబడే రాగాలలో అభేరి కూడా ఒకటి. అమిత ప్రాచుర్యాన్ని పొందిన "మా తెనుగు తల్లికి మల్లెపూదండ" (రచన :శంకరంబాడి సుందరాచారి-గానం: టంగుటూరి సూర్యకుమారి),"స్వాతంత్ర్యమె మా జన్మ హక్కని చాటండి "(గానం: ఘంటసాల (1,2 చరణాలు) మొదలగు దేశభక్తి, ప్రభోధ గీతాలు యీరాగంలో కూర్చబడినవే.

"తలుపుతీయునంతలోనె తత్తరమది యేలనోయి' (గానం: రావుబాలసరస్వతీదేవి) వంటి ప్రణయగీతాలు, "పాటపాడుమా కృష్ణా" (గానం: రాజేశ్వరరావు) వంటి భక్తిగీతాలు యిలా అసంఖ్యాకంగా వైవిధ్యం గల యితి వృత్తాలతో సుమారు 60,70 సంవత్సరాలుగా ఎంతోమంది స్వరకర్తలు సృష్టించిన సుమధుర బాణీలు, బేసిక్ కమర్షియల్ రికార్డులుగాను, ఆకాశవాణిలో ప్రసారమైన గీతాలుగాను, చలన చిత్రాలలో అనేక సన్నివేశాలలోని పాటలుగాను వెలువడి తెలుగువారిని పరవశింపజేశాయి.

రామదాసు,అన్నమయ్య నుండి యీ నాటి వరకూ కూడా ఎంతోమంది వాగ్గేయకారుల రచనలు అభేరి రాగంలో కూర్చబడినవి. మనకు తరచుగా వినబడుతున్నవే. 'హాసం' 16-28 ఫిబ్రవరి 2002,16-31 ఆగష్టు 2002 సంచికలలో అభేరి రాగం గురించి వివరంగా ప్రస్తావించాను.

భద్రాచలంలో వెలసివున్న శ్రీరాముడు ఆంధ్రుల కారాధ్య దైవము. రామదాసు రాముడికి గుడిని కట్టించి వేతీరుల స్వామిని స్తుతించిన కీర్తనలు తెలుగువారి హృదయాలలో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నాయి. రామదాసు

తరువాత శ్రీరాముని కొలిచిన వాగ్గేయ కారులలో తూము నరసింహదాసు,నిట్టల ప్రకాశదాసు మొదలగు వారు ప్రసిద్ధులు. తూము నరసింహదాసు త్యాగరాజస్వామి సమకాలికుడు. ఆ తరువాత యింకా మరెందరో మహాభక్తులైన వాగ్గేయకారులు శ్రీరాముని కీర్తించారు. 19,20వ శతాబ్దాలలో మైసూరు వాసుదేవాచార్, ప్రయాగ రంగదాసు మొదలగువారు శ్రీరామ కీర్తనలు రచించారు. ప్రయాగ రంగదాసు గారికి దౌహిత్రుడు శ్రీమంగళంపల్లి బాలమురళీ కృష్ణగారు. 20వ శతాబ్దపు తొలిదశలో గొప్ప రామభక్తుడైన వాగ్గేయకారుడు శ్రీనరసదాసు. ఆయన రచించిన "రామా నా ముందు నిలిచి ప్రేమతో మాటాడవేమి" అనే కీర్తన ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో 1989లో భక్తిరంజని కార్యక్రమానికై నేను స్వరపరచి పాడగా ఆ పాట చాలా ప్రాచుర్యాన్ని పొందింది. శ్రీరామ నవమి పర్వదినాన్ని పురస్కరించుకుని యీ కీర్తనను యీ సంచికలో ప్రస్తావించడం జరిగింది.



## నరసదాసు

నరసదాసు కీర్తనలు (శ్రీరామ భజన కీర్తనలు)అనే గ్రంథాన్ని రచించిన కవి అసలు పేరు కుందుర్తి వేంకట నరసయ్య. బాల్యం నుండి యీయనకు శ్రీకృష్ణునిపై చాలా భక్తి వుండేది. కృష్ణుని స్తుతిస్తూ ఎన్నో పాటలు,సీస పద్యాలు, ఉత్పల చంపకమాలలు వ్రాశారట. కాని తనకు భాషా జ్ఞానము లేదని, ఆ పాటలలోను, పద్యాలలోను తప్పులు ఉన్నాయని తలచి వెంకట నరసయ్యగారు ఆ రచనలన్నిటిని చించి వేశారట.

తరువాత 1926వ సంవత్సరంలో కొందరు స్నేహితులతో కలసి జమ్ములపాలెంలో ఒక గ్రంథాలయం స్థాపించారు. ఆ గ్రంథాలయానికి శాఖలుగా భజనసంఘమొకదానిని, నాటక సంఘమొకదానిని ఏర్పాటు చేశారు. ప్రతి శుక్రవారము భజనలు చేస్తుండేవారు. 1926 ఆగష్టు నెలలో శ్రీవాసుదాసస్వామి ఒంటిమిట్ట శ్రీకోదండరామస్వామి కైంకర్యమునకై ద్రవ్య సేకరణ నిమిత్తం బాపట్లలో శ్రీవంగులూరి శేషతల్పశాయి గారింటికి వచ్చారు. శ్రీవాసుదాస స్వామివారు గొప్ప రామభక్తులు. వీరికి "ఆంధ్రవాల్మీకి" అనే బిరుదు కలదు. వేంకటనరసయ్యగారు మరి కొందరు కలసి వెళ్ళి వాసుదాసస్వామి వారిని జమ్ములపాలెం తీసుకొనివచ్చారు. ఆస్వామి 23 ఆగష్టు1926 నాడు జమ్ములపాలెంలోని రామాలయంలో భక్తిని గురించి ఉపన్యసిస్తూ అందరినీ రామకోటి వ్రాయమని ఆదేశించారు. కృష్ణ భక్తులైన నరసయ్య గారు స్నేహితుల బలవంతముతో రామకోటి వ్రాస్తానని వాసుదాసస్వామి ఎదుట ప్రతిజ్ఞ చేశారు. అది శ్రీరాముని ఆజ్ఞ కావచ్చును. అప్పటి నుండి భక్తితో నియమంతో రామకోటి వ్రాయసాగారు. స్వామివారు ప్రతిదినము భజన చేయవలసినదని ఆదేశించారు కూడా. అచిరకాలంలోనే కృష్ణ భక్తుడైన నరసయ్యగారు రామకృష్ణులకు అభేదమును అనుభవమునకు తెచ్చుకుని అనేక కీర్తనలను 'నరసదాస' ముద్రతో రచించి శ్రీరాముని సేవించారు.

ఆయన కీర్తనలలో కొన్నిటిని నాస్వర రచనతో ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో భక్తిరంజని కార్యక్రమానికై 1989లో రికార్డు చేయగా ఆ కీర్తనలు పలుమార్లు ప్రసారమై శ్రోతలమన్నలను పొందినవి. ఆ గీతాలను విజయవాడ కళాకారులు శ్రీయుతులు తిరుపతి త్యాగరాజు, డి.వి.మోహనకృష్ణ, శ్రీమతులు రంగనాయకి, శివకామేశ్వరి మొదలగువారు గానం చేశారు. "దశరథ నందన రామా ఘన శ్యామా ముని కామా", "కేశవ గోవింద మా భవాయని కీర్తన సేయుట ఎన్నటికో", నన్ను గన్నయ్యా నను గనవయ్యా - పన్నగశాయి నీకన్న దిక్కెవరయ్య","రామా నా ముందు నిలిచి ప్రేమతో మాటడవేమి", మొదలైన చక్కని కీర్తనలు నరసదాసు శైలికి ప్రాచుర్యాన్ని కలిగించాయి.

1947వ సంవత్సరంలో శ్రీవెంకట్రామ&కో వారు వీరి 55 కీర్తనలను 'నరసదాసు కీర్తనలు' అను పేర పుస్తకంగా వెలువరించారు. ఈ గ్రంథంలో రచయితయగు వేంకట నరసయ్య గారిని 'మోక్షసాధని' సంపాదకుడు గా పేర్కొనటం జరిగింది. ■

**అభేరి రాగం ఆధారంగా కొన్ని చిత్ర గీతాలను 'హాసం' 16-28 ఫిబ్రవరి 2002, 16-31 ఆగస్టు 2002 సంచికలలో పేర్కొనడం జరిగింది.**

### రాష్ట్రస్థాయి కర్ణాటక శాస్త్రీయ (గాత్రం), వయొలిన్, లలిత సంగీత పోటీల విజేతలు

**లలిత సంగీత విభాగము**

| | |
|---|---|
| ప్రథమ బహుమతి | : ఎం.వాసంతి, విజయవాడ |
| ద్వితీయ బహుమతి | : బి.వి.ఎస్.సంతోష్‌కిరణ్, విజయనగరం |
| తృతీయ బహుమతి | : కె.జ్యోతిర్మయి, మేదరమెట్ల |
| కన్సోలేషన్ బహుమతులు | : ఎ. అభిరామ్, హైదరాబాద్<br>డి.హారిణి, విజయవాడ |

**శాస్త్రీయ సంగీత విభాగము**

| | |
|---|---|
| ప్రథమ బహుమతి | : టి.కె.సరోజ, విజయవాడ |
| ద్వితీయ బహుమతి | : కళ్యాణ వసంత్, హైదరాబాద్ |
| తృతీయ బహుమతి | : ఆర్.వి.ఎస్.రాగమయూరి, గుంటూరు |
| కన్సోలేషన్ బహుమతి | : మల్లెల తేజస్వి, హైదరాబాద్ |

**వయొలిన్ విభాగము**

| | |
|---|---|
| ప్రథమ బహుమతి | : కె.వి.కృష్ణ, సికింద్రాబాద్ |
| ద్వితీయ బహుమతి | : బి.ఆర్.వి.ఎస్.పవన్‌కుమార్ చరణ్, విజయనగరం |
| తృతీయ బహుమతి | : ఎస్.పార్థివ, విశాఖపట్నం |
| కన్సోలేషన్ బహుమతి | : పి.జయప్రకాష్, తిరుపతి |

| | |
|---|---|
| న్యాయ నిర్ణేతలు | : శ్రీ మహాభాష్యం చిత్తరంజన్ గారు,<br>శ్రీ మల్లాది సూరిబాబు,<br>శ్రీమోదుమూడి సుధాకర్,<br>శ్రీ బి.ఎ.నారాయణలు వ్యవహరించారు. |

పై కార్యక్రమాలను ఆద్యంతం సంగీతాన్ని గూర్చి వివరిస్తూ ఎంకరేజ్ చేస్తూ శ్రీ తిరుపతి త్యాగరాజు యాంకర్‌గా నడిపించినారు.

# పెళ్ళిపుస్తకం

దర్శకత్వం : బాపు

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల **3**

> **జరిగిన కథ**
> కృష్ణమూర్తి, సత్యభామలకు కొత్తగా పెళ్లవుతుంది. మధ్య తరగతి కుటుంబాలలో ఉండే అన్ని బాధలు వీరికీ ఉంటాయి. అందుకే కృష్ణమూర్తి బొంబాయిలో ఉద్యోగం చేస్తుంటే, భామ అని పిలవబడే సత్యభామ కేరళలో ఉద్యోగం చేస్తుంటుంది. హైదరాబాద్‌లోని ఓ కంపెనీలో ఉన్న ఉద్యోగాలకు అప్లయ్ చేయటం కోసం ఇద్దరూ వస్తారు. అక్కడ వారికో చేదు నిజం తెలుస్తుంది. -(ఇక చదవండి)

ఆయన మాటల్లో వాస్తవం పాలు ఉండటంతో భామ కూడా తలవంచుకుని ... ''అబ్బే ...అంటూ'' లోపలికి వెళ్ళింది భామ.



కొడుకు పక్కనే కూర్చున్నాడు రామారావు. ''అబ్బాయ్....అర్నెల్ల దాకా ప్రాణభయం లేదు. నువ్వా ఇరవైవేలు కట్టేస్తే గవర్నమెంటు వాళ్ళు పదీ విడుదల చేస్తారు! నాయనా. కన్నతండ్రిగా ఈ ముసలాడు చేయగలిగింది ఇది. ఇక అన్నగా నీ బాధ్యత నువ్వే చూస్కో. ...'' చెప్పి లేచి వెళ్ళిపోయాడు. రామారావు.

కృష్ణమూర్తి దీర్ఘాలోచనలో పడ్డాడు. బడ్జెట్ జీవితాలలో ఒక్క రూపాయి భారం కూడా పర్వతంలా కనిపిస్తుంది. చెల్లెలి గుండెజబ్బు సంగతేమోకానీ ఈ ఖర్చు తల్చుకుంటే తన తన గుండె ఆగిపోయేట్లుంది. ఎంత ఆలోచించినా ఏమీ తోచడంలేదు.



* * *

హైదరాబాదులో పారిశ్రామికవేత్త శ్రీధరరావు ఆఫీసు. ఆయన నూతనంగా ప్రారంభిస్తున్న బట్టలమిల్లుకు కావలసిన ఉద్యోగులకోసం ఇంటర్వ్యూలు నిర్వహిస్తున్నారు. విశాలమైన హాలులో పదిమంది ఉద్యోగార్థులు కుర్చీలలో కూర్చుని ఉన్నారు. వారిలో కృష్ణమూర్తి ఒకడు.

శ్రీధరం తన ఛేంబర్లో సీట్లో కూర్చుని సత్యభామ సర్టిఫికేట్లు పరిశీలిస్తున్నాడు. ఆయన వెనుక ఆయన 'బాబాయ్' అంటూ భక్తిగా పిలిచే కొండలరావు నిలుచున్నాడు. కొండలరావు ఆఫీసుకు మేనేజర్ కాక శ్రీధరం కుటుంబానికి ఆత్మీయుడు. శ్రీధరం ఈనాడు పెద్ద పారిశ్రామికవేత్తగా ఎదగడానికి ఆయన చేయూత ఎంతో ఉంది. కొండలావు మాటను శ్రీధరం మన్నిస్తాడు. శ్రీధరం ఎవరితో నైనా ఏదైనా మాట్లాడుతుంటే వాటిని అభినయం ద్వారా చూపడం ఈయన అలవాటు. దాన్ని బట్టి శ్రీధరానికి నమ్మినబంటని అర్థమౌతుంది ఎవరికైనా.



వాళ్ళ ఎదురుగా సత్యభామ కూర్చునుంది. ఆయన ఏమంటాడోనని గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయామెకు. శ్రీధరం సర్టిఫికెట్లన్నీ శ్రద్ధగా పరిశీలించి టేబుల్ మీద పెట్టాడు. భామ వైపు చూశాడు.

''నేనూ ....చూడమ్మా... నీకు తెలుసో తెలియదో ఈ కంపెనీలో నేను కొత్తగా రూలు పెట్టాను. ఒక కుటుంబానికి ఒక్కటే ఉద్యోగం ఇవ్వాలని... అది..' అన్నాడు.



''తెలుసనండీ,'' అన్నది భామ పీల స్వరంతో.

''మరి? నీకు పెళ్ళికాలేదా? అయితే నీ భర్తకు ఉద్యోగంలేదా?'' అడిగాడు శ్రీధరం.

"ఆ....అంటూ....." గొణిగింది భామ. భామ గొణుగుడు చూసిన కొండ్రావుకు అనుమానం వచ్చింది. "ఈ ఉళ్ళోనే కాదు, నీ భర్త బొంబాయిలో ఉన్నా సరే.... మీకుటుంబానికి ఒక్కటే ఉద్యోగం." అన్నాడు.

చెమటలు పట్టాయి భామకు, తన ఫైలు మరోసారి చూడమన్నట్లు సైగచేసింది. శ్రీధరం మరో కాగితం చూశారు.

"నేనూ.....ఓ..ఐసీ....ఐసీ..... భర్తకు ప్రమాదంలో వెన్నెముకకు దెబ్బతగిలిందా? మంచం పట్టాడా? అయ్యో పావం! కేరళలో వైద్యం చేయిస్తున్నావా....చాలా టైం పడుతుందనుకుంటాను."



దీనంగా పోజు పెట్టి తల ఊపింది భామ.

"అంటే .......అతని తండ్రీ, చెల్లెలూ, మీ అమ్మా, తమ్ముడూ అందరికీ నువ్వే .... నీ జీతమే ఆధారమన్న మాట!

మళ్ళీ తలూపింది భామ.

"నేనూ...అయామ్ వెరీ సారీ.... ఇంత చిన్న వయసులో ఇలాంటి ఆపద వచ్చినందుకు...బట్ ...అయామ్‌వెరీ హ్యాపీ...వెరీ వెరీ హ్యాపీ..." అన్నాడు శ్రీధరం.

ఆయన ఎందుకు సారీ అంటున్నాడో, ఎందుకు హ్యాపీ అంటున్నాడో అర్థంకాలేదు భామకు. ఎందుకన్నట్లు చూసింది.

"నీలాంటి ఇల్లాలు దొరకడం అతని అదృష్టం. అతను తప్పకుండా కోలుకుంటాడు. హ్యాపీ ఎందుకంటే ఇలాంటి కుటుంబానికి ఒక ఉద్యోగం ఇచ్చే అవకాశం మా కంపెనీకి కలగడం మా అదృష్టం. శుభం. రేపు కూడా మంచిరోజు. రేపు ఉదయమే వచ్చి జాయిన్ కావచ్చు."



భామ ముఖం వెలిగిపోయింది. "థ్యాంక్స్, థాంక్యూ వెరీమచ్'' అన్నది లేనట్టా. ''చూడమ్మా...వైద్యానికి అడ్వాన్స్‌గా ఏదైనా కావాలంటే ..." ఆప్యాయంగా అన్నాడు శ్రీధరం.

"థాంక్యూ సార్. ఇప్పుడు అవసరం లేదు. ఉన్నప్పుడు అడుగుతాను." అన్నది భామ.

"సరే" నవ్వాడు శ్రీధరం.

"ఉన్నపుడు అడగడమేంటి నాబొంద. ఇచ్చినపుడు తీస్కో" అన్నాడు కొండ్రావు.

"బాబాయ్ ...." తలపట్టుకుంటూ 'తగ్గు' అన్నట్టుగా అన్నాడు శ్రీధరం.

"అంతేలే! అఖ్ఖర్లేదంటే మనమేమైనా బతిమ లాడుతామా? " అన్నాడు కొండ్రావు.

"ఆ..చూడమ్మా? నీ పేరేమిటన్నావ్? సత్యభామ.కే.కే. అంటే?"

"కొంగరవారు." ఇంటిపేరు చెప్పింది భామ.

"ఓ! జస్ట్ మినిట్. బయట కె. కృష్ణమూర్తి అనే అతను వెయిట్ చేస్తున్నాడమ్మా. అతన్ని లోపలకు రమ్మని చెప్పు...ఇవాళ మా ఆఫీస్ బోయ్ గారి పెళ్ళిరోజట. వారు సెలవులో ఉన్నారు. అందుకే...." అన్నాడు శ్రీధరం.

భామ నవ్వింది. "అలాగే సార్" అని బయటకుకొచ్చింది. హాల్లో ఐదారుగురున్నారు. "ఇక్కడ మిస్టర్ కె.కృష్ణమూర్తి అంటే ఎవరండీ" అన్నది తెలియనట్లు.

"యస్ మేడమ్... నేనే.. "లేచాడు కృష్ణమూర్తి.

"లోపలకు రమ్మంటున్నారు." చెప్పింది భామ.

భామ దగ్గరకు వచ్చాడు కృష్ణమూర్తి. భామ కావాలనే తనచేతిలోని ఫైలు కింద పడేసింది. దాన్ని తీసుకోవడానికి వంగాడు కృష్ణమూర్తి.



''కాయా... వండా?'' అడిగాడు మెల్లగా.

"కె.....అంటే మా ఇంటి పేరు కొంగర అని చెప్పాను. మీరింకేదైనా చెప్పుకోండి" అంది రహస్యంగా.

"థ్యాంక్స్" లేచాడు.

భామ నవ్వుతూ బయటకు కెళ్ళింది. కృష్ణమూర్తి లోపలకు వెళ్ళాడు.

* * *

ఒక హోటల్లో రూఫ్ టెరైస్ మీద గార్డెన్లో కూర్చున్నారు. సత్యభామ, కృష్ణమూర్తి. తామిద్దరం భార్యభర్తలమని ఎవరికీ తెలియకుండా ఉండాలని చెరో టేబుల్ దగ్గర కూర్చున్నారు.



''కాయా- వండా?'' అడిగింది భామ మెల్లగా

"లేడీస్ ఫస్ట్" అన్నాడు కృష్ణమూర్తి.

"మీకు కాయైతే నాకు పండైనా పచ్చికాయే".

''అయితే వండేనన్న మాట. నాకు పండే"

"జీతం?" అడిగింది భామ ఆనందంగా.

"ఆడదాని వయసు, మగాడి జీతం అడగరాదు."

"నే... చెప్పేస్తాను, నా వయసు ఇరవై రెండు."

"అయితే నా వయసు ఐదు వేలు. నీది"?



"మూడువేలు"

"ఇద్దరిదీ కలిపి....?"

"ఎనిమిది వేలు".

ఇద్దరూ ఆనందాన్ని పంచుకుంటుండగా మరో టేబుల్ మీద సత్యభామ బావ వచ్చికూర్చున్నాడు. టేబుల్ మీద కిరోసిన్ సీసా!

అతను సీరియస్‌గా భామవైపు చూశాడు. ఆ చూపులో భావం అర్థమైంది భామకు.

"జీతం పెరిగింది కదా ఇన్‌స్టాల్‌మెంట్ పెంచమంటున్నాడు.'' మెల్లగా కృష్ణమూర్తికి చెప్పింది.



ఇద్దరి మనసులు పాడయ్యాయి. బేరర్ కాఫీ తెచ్చాడు.

'' అక్కడివ్వు''అన్నది

బేరర్‌తో తన బావను చూపించి.

"బిల్లు?" అడిగాడు బేరర్.

"ఇక్కడివ్వు" అన్నాడు పర్సుతీసి కృష్ణమూర్తి.

* * *



అది శ్రీధరం బంగళా. శ్రీధరం భార్య మంగళ, మరి కొందరు ముత్తయిదువలు కూర్చుని పూజ నిర్వహిస్తున్నారు. ఆమె పరమసాధ్వి. భర్తకు అన్ని విధాల అనుకూలవతి. పతియే ప్రత్యక్షదైవం అని భావించే పాత తరం స్త్రీ. భర్త తన వ్యాపారంలో తాను మునిగి ఉంటే ఈమె భర్త విజయాలను కాంక్షిస్తూ దైవారాధనలో లీనమౌతుంటుంది. ఆమె మంచి గాయని కూడా.

హాలులో త్యాగరాజస్వామి వారికి ఆరాధన జరుగుతున్నది. ముత్తయిదువలందరూ పట్టుచీరలు ధరించి భక్తితో పాటలు పాడుతున్నారు.







ప: జగదానందకారక
జయ జానకీ ప్రాణనాయక ॥జగ॥
అ: గగనాధిప సత్కులజ రాజ రాజేశ్వర
సుగుణాకర సురసేవ్య
భవ్యదాయక సదా సకల ॥జగ॥
ఇంద్రనీలమణి సన్ని భాపఘన -
చంద్ర సూర్య నయనాప్రమేయ వా
గీంద్రజనక సక లేశ శుభ్రనా -
గేంద్రశయన శమనవైరి సన్నుత॥జగ॥
ఓంకార పంజరకీర పురహర
సరోజభవ కేశవాదిరూప
వాసవరిపు జనకాంతక కలాధర
కలాధరాప్త ఘృణాకర
శరణాగతజనపాలన సుమనో
రమణ నిర్వికార నిగమసారతర ॥జగ॥



వీళ్ళు పాడుతుంటే శ్రీధరం - మంగళల ఏకైక సంతానం వసుంధర నవ్వుతూ చూస్తున్నది. వసుంధరలో తల్లి ఆధ్యాత్మిక లక్షణాలు కంటే తండ్రి వ్యాపార లక్షణాలే ఎక్కువ. ఇలాంటి నమ్మకాలు తక్కువ.



వసుంధరను చూసి రమ్మని పిలిచింది మంగళ. శ్రీధరం బావమరిది గిరి కూడా వీరి పూజను చూస్తున్నాడు. పూజ చూస్తున్నాడనే కంటే పూజ చేస్తున్న నారీమణుల అందాలనే చూస్తున్నాడనటం సబబు. స్త్రీ వ్యామోహం ఎక్కువ. ఎలాగైనా వారి మధ్యలోకి వెళ్ళి దూరాలని ప్రయత్నిస్తున్నాడు. అక్క బావలను ఆశ్రయించుకుని బ్రతుకుతుండటం వలన వారంటే కొంచెం భయం, గౌరవం ఉన్నాయి.



పూజ నగంలో ఉండగా శ్రీధరం కారు వస్తున్న చప్పుడైంది. ఎక్కడో ఉన్నాడనుకున్న దేవుడికంటే ఎదురుగా కనిపించే పతిదేవుడే మిన్న అని భావించే ఆ ఇల్లాలు వెంటనే పూజలోంచి లేచి గబగబా బయట కొచ్చి భర్తను సాదరంగా లోపలకు తోడ్కొని వచ్చింది. చేతిలోని బ్రీఫ్‌కేస్ అందుకుని లోనికి తెచ్చింది. ప్రసన్నవదనంతో ఉన్న భర్తను కూర్చోబెట్టి ఆయన అనుమతి తీసుకుని మళ్ళీ పూజలోకి వెళ్ళింది.

భార్య ఆధ్యాత్మిక చింతనను మనసారా గౌరవించే శ్రీధరం భార్యను ఆప్యాయంగా చూస్తూ ఆమె పాడుతుంటే తానూ లీనమైవింటున్నాడు.



పురాణపురుష నృవరాత్మజాశ్రిత
పరాధీన ఖరవిరాధరావణ
విరావణానఘ పరాశర
మనోహరావికృత త్యాగరాజ సన్నుత ॥జగ॥

పూజ ముగిసిన తరువాత ముత్తయిదువలందరికీ తాంబూలాలిచ్చి వారి దీవెనలందుకుంది మంగళ.

* * *

బట్టల మిల్లులో ఆర్ట్‌డైరెక్టర్‌గా జాయినయిన కృష్ణమూర్తి తన



స్టూడియోలో మోడల్ బొమ్మకు చీరకట్టి ఫోటోలు తియ్యడానికి కెమేరా సరిచేసుకుంటున్నాడు. ఎన్ని సార్లు యాంగిల్స్ మార్చినా తానుకొన్న ఎఫెక్ట్ రావడంలేదు. తను చెప్పినట్లు పోజులు పెట్టడానికి అది ప్లాస్టిక్ బొమ్మాయె. తడవకోసారి తానే వెళ్ళి సరిచేయాలి. చేసి చేసి విసుగొచ్చింది.

ఆ రోజు రావలసిన మోడల్ గర్ల్ ఇంకారాలేదు.

బోయ్‌ను పిలిచాడు. "పదిన్నరయింది మోడల్ గర్ల్ ఇంకా రాలేదా?" అడిగాడు విసుగ్గా.

"రాలేదండి" జవాబిచ్చాడు బోయ్

"అయితే నువ్వెళ్ళిపో." అన్నాడు కృష్ణమూర్తి .

ఏం చెయ్యాలా ఆలోచించ సాగాడు. అలా చించగా చించగా ఓ ఐడియా తళుక్కుమెరిసింది. తలుపు తెరుచుకుని ఆఫీసులోకి వచ్చాడు. సిబ్బంది అంతా పనులు చేసుకుంటున్నారు. భామ టైపు చేసుకుంటుంది. ఆమె తన భార్య అని ఎవ్వరికీ తెలియదు. తెలిస్తే ఉద్యోగం ఊడుతుంది.



చాలా జాగ్రత్తగా మేనేజ్ చేసుకొస్తున్నారిద్దరూ.

"ఏవండోయ్ కేరళాంబగారూ. మీరు ఓ మారిలా వస్తారా?" అడిగాడు అందరికీ వినపడేటట్లు.

తమ భాగోతం ఎక్కడ బయటపడిపోతుందోనని ఉలిక్కిపడింది భామ. అటు ఇటు

చూసింది.

"ఏమండోయ్....మిమ్మల్నే....టైపిస్టు భామగారూ." పిలిచాడు మళ్ళీ.

కంగారుగా సీట్లోంచి లేచింది భామ.



"సాయంత్రం నాలుగ్గంటలకే మీటింగు. ఫోటోలు తియ్యాలి. డెవలప్ చెయ్యాలి. ప్రింట్లు వెయ్యాలి. మోడల్ గర్ల్ ఇంకా రాలేదు. అందువల్ల ....ప్లీజ్..."

కృష్ణమూర్తి అంత పెద్దగా, చనువుగా భామ దగ్గరగా వెళ్ళి మాట్లాడుతుంటే అందరూ వింతగా చూడసాగారు.

"మీరోసారి స్టూడియోలోకి వస్తారా? ఏం భయంలేదండీ, మీరు చాలా అందంగా ఉన్నారు. చాలా మంది మోడల్ గర్ల్స్ కన్నా మీరు హండ్రెడ్ టైమ్స్ బెటర్. కమ్.... కమ్..." అన్నాడు.



భామ భయంగా చూడసాగింది. భామ మనోభావాలనేమీ పట్టించుకోవడంలేదు కృష్ణమూర్తి . "అయాం ఆర్ట్‌డైరెక్టర్ స్పీకింగ్. కమాన్. "భామ చెయ్యిపట్టుకుని స్టూడియోలోకి ఆహ్వానించాడు కృష్ణమూర్తి

భామను నుంచో బెట్టి చీర చుట్టాడు. కెమెరా వ్యూ ఫైండర్లోంచి చూసి "వావ్....శభాష్.." అన్నాడు.

భామ సిగ్గుపడుతూ చూస్తున్నది. కెమెరాలోంచి చూస్తున్నాడు కృష్ణమూర్తి.



"క్యాబాత్ హై...లవ్‌లీ.... వన్‌మోర్ మేడం... ఆ మీసం లేకుండా..."అన్నాడు వ్యూ ఫైండర్లోంచి చూస్తూనే.

భామకు ఇంత పెద్ద మీసాలేంటా అని అంతలోనే అనుమానం వచ్చి బయటకు చూశాడు. భయంకరమైన బుర్ర మీసాలతో తీవ్రంగా చూస్తున్నాడు కొండల్రావు భామ పక్కనే నిలబడి. షాకయ్యాడు కృష్ణమూర్తి.

"ఏమయ్యా ఆర్టూ...నిజంగా చెప్పు. ఈ పిల్ల నీకేమౌతుంది?" కోపంగా అడిగాడు కొండల్రావు.

నీళ్ళు నమిలాడు కృష్ణమూర్తి.

భామవంక చూశాడు కొండల్రావు. మిడిగుడ్లేసుకుని నిలబడి ఉంది. "ఏంటా చూపు? నువ్వు చెప్పు," అడిగాడు.



భామ భీతహరిణేక్షణిలా ఉంది.

"చూశావా ఆ పిల్ల ఎలా హడిలి గడగడలాడిపోతున్నదో! ఆపిల్ల ఎవరనుకున్నావ్? ఇక్కడ టైపిస్టు. అంతేగాని సినిమాస్టారు గాదు. నువ్వు ఫోటోలు తియ్యడానికి "కృష్ణమూర్తి మీద ఎగిరి పడ్డాడు కొండల్రావు.

"మోడల్స్ రాలేదు... టైమ్ లేదని..."గొణిగాడు కృష్ణమూర్తి.

"రాకపోతే మానెయ్- అంతేగానీ కీచకుడిలా పరాయిపిల్లను చెంగు పట్టుకుని లాక్కొస్తావా? " ఇంకా కోపంగా అరిచాడు కొండల్రావు.

"పరాయి ఏముందండీ? మనాఫీసులో పనిచేస్తున్నావిడే కదాని..." అన్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి ఎదురు సమాధానం చెబుతుంటే మండింది కొండల్రావుకు. "మళ్ళీ మాట్లాడక. ఆవిడ వివాహిత. ఇంకొకడి పెళ్ళాం. గుర్తుంచుకో. నువ్వు పదమ్మా. పనిచూస్కో.' భామను బయటకు పంపించి కృష్ణమూర్తి వైపు కోపంగా చూస్తూ విసవిసవెళ్ళి పోయాడు.

ఆఫీసులో ఎవరి పనివారు చేసుకుంటున్నారు. ఇంతలో శ్రీధరం తన రూంలోంచి హఠాత్తుగా బయట కొచ్చాడు. అకౌంటెంట్ దగ్గరకెళ్ళాడు. నోటినిండా కారాకిళ్ళీ దట్టంగా పట్టించి సాక్షాత్తూ సరస్వతీదేవే దిగివచ్చి 'నాలుక చూపించుబాబు బీజాక్షరాలు లిఖిస్తాను' అని బతిమలాడినా నోరుతెరిచే స్థితిలో లేడా అకౌంటెంట్ మహాశయుడు.



హఠాత్తుగా తన ఎదురుగా నిలిచిన యజమానిని చూసి షాకై లేవబోయాడు. ''కూర్చో... కూర్చో...'' అన్నాడు శ్రీధరం మామూలుగానే. భయంగా కూర్చున్నాడు అకౌంటెంట్.

''నేనూ...మా ఆవిడ దేవుడికి పువ్వులతోటి పూజచేస్తుంది... ఏవో వరాలు అడుగుతుంది....'' అలవాటుగా ప్రారంభించాడు శ్రీధరం.

అందరూ వీరివంకే చూస్తున్నారు భామ, కృష్ణమూర్తి గుండెలు చిక్కబట్టుకుని చూస్తున్నారు. శ్రీధరం చెబుతున్నాడు. "నేను రూపాయలతో మనిషిని పూజ చేస్తాను. నా రూపాయికి నూరుపైసల పనీ చేసి పెట్టమని.నువ్వు అకౌంట్స్ చూస్తావు..."

అకౌంటెంట్ మిడిగుడ్లేసుకుని చూస్తున్నాడు. ఏదైనా చెబుదామంటే నోటినిండా కిళ్ళీ...నోరు కడుక్కొని వద్దామంటే ధైర్యం రావడంలేదు.

"నువ్వూ...నిన్న నువ్వు ఒక కూడిక తప్పుచేశావ్. ఎనిమిదికి ఒకటి కలిపితే ఎంత? " అడిగాడు శ్రీధరం.



"తొ...తొ....తొమ్మిది." అతి కష్టమ్మీద చెప్పగలిగాడు అకౌంటెంట్.

"కదా! కానీ నువ్వు పది అని లెఖ్ఖ రాశావు. ఈ తప్పు ఎక్కడ జరిగింది? ఒకట్లు,వందలు, వేలు..పదివేలస్థానంలో జరిగింది. అంటే ఒకటి వెళ్ళి లక్షల స్థానంలో పడింది. అవునా?"

తల ఊపాడు అకౌంటెంట్.

"అందువల్ల డబ్బులో ఒక లక్షతేడా వచ్చింది. ఇది నీకు మూడోసారి... రెండవ వార్నింగ్ వారం క్రితమే ఇచ్చాం కదా.!.."

నోరు కడుక్కుని వద్దామని లేవబోయాడు అకౌంటెంట్.

"కూర్చో...నోరూ సీటూ ఒకేసారి ఖాళీ చేద్దువుగాని... నిన్ను డిస్మిస్ చేస్తున్నాను." కఠినంగా చెప్పాడు శ్రీధరం.



అకౌంటెంట్ కూలబడి పోయాడు.

అందరూ ఆ సన్నివేశం చూసి గజగజ వణికిపోయారు. సత్యభామకీ, కృష్ణమూర్తికీ చెమటలు పట్టాయి.

ఏ చిన్న పొరబాటు దొర్లినా ఉద్యోగాలు ఊడిపోతాయని అర్థమైందా ఇద్దరికీ.

(ఇంకావుంది)

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా

- ఇంద్రగంటి జానకీబాల



పాట !
పదమై, కీర్తన అయి, జావళి అయి,
నాటకాలలో ఒదిగి, సినిమాలలో ఎదిగి
నేటికి విశ్వరూపమైంది.
ముక్కోటి అనుభవాలను
మూడు నిమిషాలలో అనుభవంలోకి తెచ్చే
అపురూప సాహిత్య సాధనం
పాట!
తొలి దశలో రంగస్థలం నుంచి
తెలుగు సినిమా తెర మీదకు
తరలివచ్చిన - పాడగలిగిన నటీమణులు,
మలిదశలో రకరకాల నటీమణులకు
తమ గొంతు కలిపి - సన్నివేశాలకు
ప్రాణం పోసిన నేపథ్య గాయనులు
ఎవరెవరు ఎలా పాడారు?
ఎలా జీవించారు?
తెలుగు సినిమా చరిత్రలో
నేపథ్యగాయనుల అపురూపసేవకు
అక్షర నీరాజనమిది

- ఇంద్రగంటి జానకీబాల
రచయిత్రి

## తరలివచ్చిన రంగస్థల నటీమణులు

తెలుగు సినిమాకు కళ్ళు విప్పుతున్న తొలిదశలో, రంగస్థలం నుంచి ఎందరో నటీమణులు సినిమాల్లోకి తరలి వచ్చారు. దానికి కారణం అప్పట్లో ప్రజాదరణ పొందిన ప్రసిద్ధ నాటకాలనే సినిమాలుగా మక్కీకి మక్కీ తీసుకుని రూపొందించారు. తెలిసిన పురాణకథ, తెలిసిన నటీ నటవర్గం - ఎటొచ్చీ రంగస్థలానికి బదులు వెండితెర. క్రమంగా కొత్తగా వచ్చిన సినిమా మీద ప్రజలకు ఎంతో మోజు ఏర్పడి పోయింది. విచిత్రంగా కనిపించే సినిమా ప్రక్రియ మీద అందరికీ ఆసక్తి పెరగడం మొదలైంది.

ఆ తరంలో సినిమాల్లో, నాటకాల్లో నటించాలంటే కాస్తో, కూస్తో రూపురేఖలుండటంతో బాటు పాడగలిగి వుండాలి. రాగయుక్తంగా పద్యం అందుకోగలిగి వుండాలి. సుదీర్ఘమైన సమాసాలతో వున్న సంభాషణలు చెప్పు, శ్రుతీ, రాగం చెడకుండా పాట పాడుతూ వీటితో అభినయం రంగరించి చూపిస్తూ రంగస్థలం మీద నెగ్గుకు రావడం కత్తిమీద సాము. అది చేసినవారికి జనం పట్టేది బ్రహ్మరథమే.

అప్పట్లో నాటకరంగం నుంచి వచ్చినవారూ వున్నారు. విడిగా సినిమా రంగానికి వచ్చినవారు కూడా వున్నారు.

| | |
|---|---|
| దాసరి కోటిరత్నం | (సక్కుబాయి, చిత్రనళీయం) |
| ఋష్యేంద్రమణి | (పత్ని,చెంచులక్ష్మి) |
| శ్రీరంజని | (లవకుశ) |
| సురభి కమలాబాయి | (ప్రహ్లాద, కీచకవధ) |
| మాలతి | (ఉష, సుమంగళి, భాగ్యలక్ష్మి,పోతన) |
| పుష్పవల్లి | (చల్ మోహనరంగా- మోహినీ భస్మాసుర) |
| కాంచనమాల | (మాలపిల్ల, బాలనాగమ్మ) |
| జి.వరలక్ష్మి | (బారిష్టర్ పార్వతీశం, దక్షయజ్ఞం, ద్రోహి) |
| కన్నాంబ | (హరిశ్చంద్ర, ద్రౌపది, కనకతార, చండిక) |
| టి.జి. కమలాదేవి | (సీతారామజననం, చంద్రవంక, పాతాళభైరవి) |
| లక్ష్మీరాజ్యం | (శ్రీకృష్ణతులాభారం, కాలచక్రం. అపవాదు, పంతులమ్మ) |
| శాంతకుమారి | (మాయాబజార్, సారంగధర, రుక్మిణీ కల్యాణం) |
| సి. కృష్ణవేణి | (సతీఅనసూయ , కచదేవయాని, జీవనజ్యోతి) |

వీరు నాటకరంగం నుంచి సినిమాకి వచ్చిన వారిలో ముఖ్యులుగా చెప్పుకోవాలి.

**నేరుగా సినిమాల్లోకి వచ్చి పేరు తెచ్చుకున్న వారిలో ప్రముఖులు:**

| | |
|---|---|
| టంగుటూరి సూర్యకుమారి | (రైతుబిడ్డ,దీనబంధు, దేవత) |
| పి. భానుమతి | (వరవిక్రయం, మాలతీ మాధవం, స్వర్గసీమ) |
| ఎస్. వరలక్ష్మి | (బాలయోగిని, ఇల్లాలు, బాలరాజు, జీవితం) |
| ఆర్.బాలసరస్వతీదేవి | (సతీ అనసూయ, చంద్రహాస, సువర్ణమాల) |

ఇంక పరిశ్రమ మరీ ప్రారంభదశలో వుండగా బెజవాడ రాజరత్నం, జయమ్మ పాత రూకల రామతిలకం మొదలైన వారు అక్కడక్కడ నటించారు. చిన్నగా పాడుకున్నారు. నాళం వనజా



లక్ష్మీరాజ్యం

గుప్త బాలనటిగా నాగయ్యగారి 'భక్తపోతన'లో పాడుతూ నటించారు.

అప్పట్లో వారు పాడుతూ నటించి కొంత ప్రాముఖ్యం సంపాదించుకున్నప్పటికీ, ఆ పాటలన్నీ ఇప్పుడు లభ్యమయ్యే అవకాశం లేదు. ఎందుకంటే కొందరు బాగా పాడినవారున్నా, కొందరు అంతంత మాత్రంగా పాడినవారూ వున్నారు. ఆ పాటలు సాంకేతికపరంగా మెరుగ్గా లేవపోవడం, వాటికి ప్రత్యేకమైన రూపురేఖలు లేకపోవడం వల్ల, వాటిని బయటకు తీసుకు వచ్చే ప్రయత్నాలు కూడా ఎక్కువ జరగలేదు. వాటికున్న చారిత్రక ప్రాముఖ్యాన్ని అప్పటివారు పెద్దగా పట్టించుకోలేదు.

టంగుటూరి సూర్యకుమారి, రావు బాల సరస్వతీదేవి లాంటివారు చిన్న వయసులోనే పరిశ్రమకి దూరమై వేరువేరు జీవనమార్గా లేర్పరచుకుని వెళ్ళిపోయారు.

సినిమా పరిశ్రమ ఎదుగుతూ వచ్చేకొద్దీ కొందరు పాడటం ఆపేసి కేవలం నటనకీ, తమ



ఋష్యేంద్రమణి

వయసుకు తగ్గ పాత్రలకే పరిమితమైపోయారు. మరికొందరు పాడుతూ, నటిస్తూ చిరకాలం వెండితెర మీద వెలుగుతూ పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నారు. ఇంకా కొందరు క్రమంగా పరిశ్రమ నుంచి కనుమరుగయ్యారు.

కన్నాంబ, జి.వరలక్ష్మి, మాలతి, పుష్పవల్లి, సురభి కమలాబాయి, ఋష్యేంద్రమణి, లక్ష్మీరాజ్యం మొదలైనవారు పాట పాడుకోవడం మానేసి, కేవలం నటనకే అంకితమైపోయారు. రావు బాలసరస్వతీదేవి నటనకి స్వస్తిచెప్పి గాయనిగానే వుందామనుకున్నా, అదీ కుదరలేదు. ఆమె పరిశ్రమలో వున్నదే తక్కువై పోయింది.

అయితే పాటనూ, నటననూ సమాన స్థాయిలో పోషించుకుంటూ, అద్భుతమైన పాటలు పాడి, మంచి సినిమాలు చేసేవారు వేళ్ళమీద లెక్కపెట్టే విధంగా వున్నారు. వారిలో వరుసగా పి.శాంతకుమారి, సి. కృష్ణవేణి, పి.భానుమతి, ఎస్.వరలక్ష్మి మాత్రమేనని చెప్పుకోవాలి. ఇందులో కూడా భానుమతి, వరలక్ష్మి ఒక ప్రత్యేక శైలి నేర్పరచుకుని, విలక్షణమైన కంఠ మాధుర్యంతో, చక్కని నటనతో తెలుగు సినిమా పాటని సుసంపన్నం చేశారు.



బెజవాడ రాజరత్నం

శాంతకుమారి నటించినంత వరకు కొన్నిపాటలు పాడి ఖ్యాతి సంపాదించినా, సాంకేతికంగా తెలుగు సినిమా రూపుదిద్దుకునేనాటికి ఆమె నడివయసు పాత్రలు వేయడం, వాటికి పాటలు, వుండే అవకాశం లేకపోవడం వల్ల ఆమెకు పాడే అవకాశాలు తక్కువే వచ్చాయి.

ఇంక సి.కృష్ణవేణి ఏభైల తర్వాత నటన నుండి విరమించుకున్నారు. అంతక్రితం ఆమె నటించిన సినిమాల్లో పాడుకున్న ఒకరిద్దరికీ ప్లేబాక్ పాడినా, అదీ కొంతవరకే జరిగాయి. ఇంక 80ల వరకూ పాడుతూ నటించి సినిమాలో నిలిచినవారు పి.భానుమతి, ఎస్.వరలక్ష్మి మాత్రమే అని చెప్పుకోవాల్సి వుంటుంది.

(వచ్చే సంచికలో మరికొంత...)




"కళ్ల జోడు పెట్టుకోలేదేమోయ్?"
"అదేంటి! నేను పెట్టుకున్నానే !?"
"ఛ్ఛ్ ! ఐతే నేనే పెట్టుకోలేదన్నమాట!!"



"ఈ నా కొత్త చారల షర్ట్ ఎలా వుంది?" అడిగాడు షోకేలారావు తన స్నేహితునితో.
"ఇంతకు ముందు గాడిదలా వుండే వాడివి. ఇప్పుడు జీబ్రాలా వున్నావ్" జవాబిచ్చాడా ఫ్రెండు.




"క్రొత్త గడియారంలో కూడా వుండే పాత భాగమేంటో చెప్పగలవా?"
"సెకండ్ హాండ్!!"



" ప్రకటనల వలన చాలా లాభాలు వస్తాయంటారు కానీ నా విషయంలో చాలా నష్టం వచ్చింది!!" విచారంగా చెప్పాడు బంగారయ్య.
"అదెలా?!" ఆశ్చర్యంగా అడిగాడు స్నేహితుడు.
"మా నగల షాపుకు నైట్ వాచ్‌మన్ కావాలి అని పత్రికల్లో ప్రకటించిన రాత్రే దొంగలు పడి దోచుకుపోయారు!!" అన్నాడు బంగారయ్య.



"వ్రాస్తే కనిపించని సిరా దొరుకుతుందా?"
"ఉంది సార్! ఏ రంగుది ఇమ్మంటారు?"



"ఈత రానివాడివి ఈ లోతు చెరువులో ఎందుకు దిగావయ్యా బాబూ!!" అంటూ అడిగాడు మునిగిపోతున్న వెంగళరావుని రక్షించిన ఓ పరోపకారి పాపన్న.
"అదిగో ఆ బాతు సగం వరకే మునిగివుంటే లోతు లేదనుకున్నానండి" జవాబిచ్చాడు వెంగళరావు.

ఈ జోకులను పంపినవారు: **యమ్.వి. అప్పారావు (సురేఖ), శ్రీరామ్‌నగర్, రాజమండ్రి.**



"వెయ్యి అబద్ధాలు ఆడైనా ఒక పెళ్లి చేయడం చాలా గొప్ప విషయమని పెద్దలు చెప్పారనీ,
నేను ఒకే ఒక్క అబద్ధం ఆడి స్వప్నను పెళ్లి చేస్కున్నారా... తప్పంటావా?" అని అడిగాడు రాము.
"తప్పెందుకవుతుంది... ఇంతకీ ఏ అబద్ధమాడావు?" అడిగారా స్నేహితులు కుతూహలంగా.
"నా కింతవరకూ పెళ్లి కాలేదని చెప్పారా" అన్నాడు రాము, ఇంట్లోని వాళ్లావిణ్ణి తల్చుకుని ఒణికిపోతూ.



"అమ్మా... నాక్కాబోయే భర్త కల్తీ వ్యాపారం చేస్తున్నాడని అనుమానంగా ఉందే"
"ఎందుకొచ్చిందా అనుమానం?"
"నాకు రాసే ఉత్తరాలలో మనమిద్దరమూ పాలు-నీళ్లలా, చక్కెర-గోధుమరవ్వలా, కలిసి మెలిసివుందాం - అని రాశాడే".

"నా ముద్దుల కూతురివి కదూ ! అబ్బాయి చాలా బుద్ధిమంతుడే ఈ సంబంధాన్ని ఒప్పుకోవే, వంట కూడ వచ్చుట" అంది తల్లి బ్రతిమాలుతూ.



"అందుకే వద్దంటున్నానమ్మా! వంటరానివాడైతే చాలా మంచిది. మన మే గడ్డి పెట్టినా తింటాడు" చెప్పింది కూతురు.

ఈ జోకులను పంపించిన వారు: **మామిడి. శ్రీలత, రేపల్లె.**



"పెళ్లయిన తర్వాత కూడా నన్నింత గాఢంగా ప్రేమిస్తూనే వుంటావా" అడిగింది ప్రేమికురాలు గోముగా.
"ఛ..;ఛ వేరొకరి భార్యను ప్రేమించడం ఏం బావుంటుంది !?" అనేసి నాలిక్కరచ్చుకున్నాడు ప్రేమికుడు.



"ప్రేమించుకునే రోజుల్లో నేనేది అడిగినా ఇట్టే కొనిచ్చారు"
"ఔను"
"పెళ్లైన తర్వాత ఏదడిగినా 'చూద్దాం అంటున్నారు దేనికి?"
"అప్పుడు చేసిన అప్పుల నించి ఇప్పటిదాకా తేరుకోలేదు మరి"

ఓ టీ.వీ ఛానెల్ జనం మధ్య కొచ్చి కొన్ని జంటల్ని ఇంటర్వ్యూ చేస్తోంది.
"మీరంటే భార్యకు..."
"...ఎంతో ప్రేమాభిమానాలు" అంటూ గర్వంగా చెప్పాడో భర్త.
"మరి మీరంటే మీ వారికి.."
"...ఎంతో భయ భక్తులు" అంటూ చెప్పిందా ఇల్లాలు ఇంకా గర్వంగా.





పక్కింట్లోంచి టీవీ కొద్దిసేపు చిన్న సౌండ్ తోనూ, ఇంకొంచెం సేపు పెద్ద సౌండ్ తోనూ, వినిపిస్తోంది.
"ఏమిటమ్మా ఇది. ఐతే పెద్దగానో లేక చిన్నగానో వినాలి కాని.. ఇదేమిటి?" అంటూ ఆరోజే ఊర్నించి వచ్చిన తండ్రి.
"వాళ్లెప్పడూ తక్కువ సౌండ్‌తోనే టీవీ చూస్తారు నాన్నా! మధ్య మధ్యన సౌండ్ పెద్దదవుతోంది అంటే ఆవిడ తన భర్తని తిట్టిపోస్తోందన్నమాట. చుట్టు ప్రక్కలవారికి ఆ మాటలు వినిపించకుండా సౌండ్ పెద్దది చేస్తూ ఆయన మేనేజ్ చేస్తుంటారంతే ".

ఈ జోకులను పంపించిన వారు:
**ఆష్టన్ ఫిన్‌లె, 'న్యూ' బోయిన్ పల్లి, సికింద్రాబాద్.**

"అధికార్లు, మంత్రులు , సుడిగాలి పర్యటనలు చేస్తే ఏమవుతుంది?"
"ప్రజల కళ్లలో దుమ్ము పడుతుంది"



ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన
**యమ్.వి. అప్పారావు (సురేఖ), శ్రీరామ్‌నగర్, రాజమండ్రి, మామిడి శ్రీలత, రేపల్లె, ఆష్టన్ ఫిన్‌లె, న్యూ బోయిన్ పల్లి, సికింద్రాబాద్, జయంతి వెంకటరమణ,పెందుర్తి**
గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'సత్యం' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.



"ఎన్నికలు దగ్గర పడుతున్నా, గెలిచేవాడిలా గొప్ప నిబ్బరంగా ఉన్నావే? ఏంటి కథ? "అభ్యర్థిని పరామర్శించాడు. పరాంకుశం "నిబ్బరం కాక ఏమిటి? నాదా అధికార పార్టీ , మా శ్రీమతిది ఎగస్ పార్టీ, మా తమ్ముడిది కొత్తపార్టీ, మా అబ్బాయి ఇండిపెండెంట్. ఎవరం గెలిచినా అధికారం మాదే" ధీమాగా సమాధానమిచ్చాడు అభ్యర్థి.





ఈ జోకులను పంపించిన వారు: **జయంతి వెంకటరమణ,పెందుర్తి**



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

పిల్లల కోసం ప్రత్యేకం...

బాల్యపు లేతదనం మళ్ళీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం



# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ **ఎమ్బీయస్ ప్రసాద్**

**చిత్ర పరిచయం 1**

సమన్వయం **మంజీర**

**భూ**మి మీద ఉన్న అనేకానేక ప్రాణుల్లో మనిషి ఒకడు. మనతోబాటు భూమి మీద తిరిగేవే కాక, నీళ్లలోనూ, ఆకాశంలోనూ తిరిగే అనేక జీవాలున్నా మనమే గొప్పవాళ్లమని విర్రవీగుతాం. అందుకే తక్కినవాటికి పేర్లు పెట్టాం, వాటిమీద కథలు అల్లాం. జిత్తులమారి నక్క అన్నాం, తెలివితక్కువ గాడిద అన్నాం. మరి అవి మనగురించి ఏం జోకులేసుకుంటున్నాయో, మనమీద ఎన్ని పంచతంత్రాలు చెప్పేసుకుంటున్నాయో మనకు తెలియదు.

మనమైతే ఇంగ్లీషు రాకపోతే చులకనగా చూస్తారన్న భయం కొద్దీ వచ్చీరాని ఇంగ్లీషులో ఏదో చెప్పబోయి అమెరికా వాడి దగ్గర భంగపడతాం. ఢిల్లీ వాడి దగ్గర ఏదేదో చెప్పేసి చివర్లో 'హై' అనేసి అదే హిందీ అనుకోమంటాం. వాడు 'హూ, మద్రాసీ' అనేసి అదోలా చూసి పెదవి విరిస్తే మళ్లీ నోరెత్తం. కుక్కల గురించి, పిల్లుల గురించి మనకున్న అభిప్రాయాలు మనలోనే దాచుకుంటాం.

కానీ కుక్కలకూ, పిల్లులకూ ఆ బాధ లేదు. ఏ దేశమేగినా, ఎందు కాలిడినా వాళ్లది ఒకటే భాష. చెప్పదలచుకున్నది చెప్పేయడం, కుక్కయితే చివర్లో 'భౌ' (హిందీలో 'హై'అన్నట్టు) చేర్చడం, పిల్లయితే 'మ్యావ్' అనడం. (అమెరికాలో కూడా అలాగే మాట్లాడవచ్చు. మావోయిస్టు అని ఆ పిల్లిని జైలుకి పంపరు)

పక్షుల్లో, పశువుల్లో మనగురించి ఎన్నో అపోహలు, దురభిప్రాయాలు చలామణీలో ఉన్నాయని తెలిసినా అవేమిటో తెలుసుకుని సవరించాలని మనం ఎంత ఇదయినా లాభం లేకపోతోంది. ఎందుకంటే మనకు వాళ్ల భాష తెలిసిచావదు కనుక! తెలుసుకుందామని ఒకడూ, అరా ప్రయత్నించినా ఆ మధ్య కాశీమజిలీ కథ చదివి ఆ ప్రయత్నాలు మానుకున్నారు. అ కథలో పక్షుల భాష తెలిసిన వాడొకడు విని నవ్వుకుంటూంటే అదేమిటో తర్జుమా చేసి చెప్పమని భార్య పట్టుబట్టిందట. తల బద్దలవుతుందే బాబూ అన్నా వినలేదట. చివరికి చెప్పడం, తల బద్దలు కొట్టించుకోవడం జరిగిందని విని పెళ్లయినవాళ్లు, పెళ్లి చేసుకుందామనుకున్నవాళ్లూ కా..కి..భాషల జోలికి పోకుండా గుణింతంలో మొదటిదాన్నే నమ్ముకుని 'క భాష'తోనే సరిపెట్టుకున్నారు.

దానాదీనా మానవజాతిలో పశుపక్ష్యాదుల భాష తెలిసినవారు అంతరించిపోవడం జరిగింది. ఎవరైనా నరదావడి నేర్చుకున్నా కాశీమజిలీ కథ గుర్తున్నవాళ్లందరూ వద్దని హెచ్చరించడం నేర్చారు. ఇక పశుపక్ష్యాదుల జోలికి పోకుండా ఎవళ్లమానాన వాళ్లు బతకడానికి అలవాటు పడ్డాం. అలాటప్పుడు స్వంత పిల్లలు కుక్కలతో పిచ్చాపాటీ మాట్లాడుతూంటే తండ్రన్నవాడు ఫీలవడంలో ఆశ్చర్య మేముంది?

అందుకే అవాళ సీనియర్ డూలిటిల్ గారు అలా అన్నాడు. ఆయన ఇంట్లోనుండి బయటకు వచ్చేవేళకి వాళ్లబ్బాయి జాన్ డూలిటిల్ తన పెంపుడుకుక్కతో ఊసులాడుతున్నాడు.

చిన్నపిల్లాడిగా ఉంటే ఓ హాయేమిటంటే ఊహాలోకంలో విహరిస్తూ కుక్కతో కబుర్లాడవచ్చు, ఆ మాట కొస్తే ఆడుకునే బంతితోనూ, తినబోతున్న అరటిపండుతోనూ కూడా మాట్లాడుతున్నట్టూ, వింటూన్నట్టు యాక్షన్ చేసేయచ్చు. ఒకవేళ ఉత్తుత్తిగా కాకుండా నిజంగానే మాట్లాడవలసివస్తే బంతితోనూ, అరటి పండుతోనూ మాట్లాడితే ఎవరైనా నవ్విపోతారు. అదే కుక్కతో అయితే.. ఆ సంగతే వేరు! మాటలు నేర్చిన కుక్కయితే ఉస్కో అంటే ఉస్కో అని ఊరుకుంటుందా? కోదు.



అందుకే ఇంటి పెరట్లో సావకాశంగా కూచుని చిన్నారి జాన్‌కి తమ జాతి లక్షణాల గురించి వివరించి చెబుతోంది

"..... మీలా రిస్టువాచీలు, గోడగడియారాలు ఉండవు కాబట్టి మాకు టైము తెలియదనుకోవడం పొరబాటు. మీరు ఇంట్లోంచి ఎప్పుడు బయలుదేరతారో మాకు ముందే తెలిసిపోతుంది. ఎలాగంటే..."

కానీ చిన్నారి జాన్‌కు 'కాలమూ - దాన్ని గణించే విధానం' గురించి లెక్చరు వినడంలో ఆసక్తి లేదు. తనను ఎన్నాళ్లనుండో బాధిస్తున్న సందేహాన్ని బయటపెట్టాడు -

"..అవునుగానీ, మీ కుక్కలు ఒకదాని కొకటి ఎదురవగానే వెనక్కి

వెళ్లి వాసన చూస్తాయేం అసయ్యంగా..?"

కుక్క విసుక్కోలేదు. ఓపిగ్గా వాళ్ల పద్ధతులు వివరించింది - "మీరు షేక్‌హ్యాండ్‌లు ఇచ్చుకోరూ, ఇదీ అలాటిదే! అవతలి వాళ్లెటువంటివాళ్లో వాసనపట్టాలంటే అదే పద్ధతి మరి!"

అంతలో "జాన్" అని కేక వినబడింది. అంతరాయానికి చింతిస్తూ కుక్క తలెత్తి చూసింది. కుర్రాడు తల వెనక్కి తిప్పిచూశాడు. గుమ్మంలో వాళ్ల నాన్న!

"కుక్కతో కబుర్లాపరా బాబూ, నీ సొద దాని కర్థం కాదు. దాని మొరుగుడు నీ కర్థం కాదు." అని హితవు చెప్పి వెనుదిరిగాడు.

పాపం నాన్న! మొదట్లో చిన్నపిల్లాడుకదా చందమామ కథల్లోంచి బయటకు రాలేదని జాలిపడి ఉపేక్షించాడు. కానీ పోను పోను వీడి వెర్రి వేపకాయసైజునుండి నుండి వెలక్కాయలెవెల్‌కు మారుతోందన్న భయం పట్టుకుంది. దానికి కారణం లేకపోలేదు -

ఓ రోజు ఆయన పిల్లవాణ్నీ, పెంపుడు కుక్కనూ వెంటబెట్టుకుని పార్కులో నడుస్తూండగా గాల్విన్ కనబడ్డాడు. 'మా అబ్బాయి జాన్' అని గాల్విన్‌కు, 'ఇదిగో మీ కొత్త ప్రిన్సిపాల్' అని జాన్‌కు పరిచయం చేశాడు తండ్రి. ప్రిన్సిపాల్‌గారు చేయి చాపాడు కానీ జాన్‌కు కుక్క చెప్పిన పాఠం వంటబట్టి నట్టుంది, ఆ ప్రిన్సిపాల్ సంగతేమిటో కనుక్కో వాలనుకుని కుక్కల ఫేషన్‌లో వెనక్కి వెళ్లి వాసన చూశాడు. ఆ తర్వాతే 'నైస్ టు మీట్ యూ' అన్నాడు.



శిష్యుడి నిర్వాకం చూసి కుక్క నొచ్చుకుంది - 'అబ్బే, ఈ పద్ధతి మంచిది కాదు' అని నచ్చచెప్పబోయింది. తండ్రి సంగతి చెప్పనే అక్కర్లేదు, తల కొట్టేసినట్టయింది. పిల్లాడి ఎదుగుదలలో తన హస్తం కంటె, కుక్క హస్తం..కాపోతే పాదం,,, ఎక్కువవుతున్నట్టు తోచింది. ఈ భాగోతానికి ఇంతటితో స్వస్తి చెప్పకపోతే లాభంలేదనుకున్నాడు.

వెళ్లి ఓ పెద్దమనిషిని వెంటబెట్టుకు వచ్చాడు. కుక్కభూతమేదో కుర్రాణ్ని ఆవహించిందని వచ్చిన పెద్దమనిషి నమ్మకం. "ఇదిగో కుక్క దెయ్యమా, ఫో, ఈ కుర్రాణ్ని వదిలిపెట్టేయ్'' అని భూతాన్ని హడలగొట్టాడు. అంటే భూతం చేతికి చిక్కదు కాబట్టి, చేతికి చిక్కిన కుర్రజాన్‌ని ఊపి చూశాడు. రబ్బరుబొమ్మలా అటూ, ఇటూ ఊగిన జాన్ ఏమీ అనలేక బిత్తరచూపులు చూశాడు.



"ఒరేయ్ మాంత్రికుడా ఇంకా కాస్త ఊపితే భూతం మాట ఎలాగున్నా మా జాన్‌గాడి కళ్లజోడు ఊడిపడుతుందిరా'' అని జాన్ ఫ్రెండయిన కుక్క తన భాషలో చెప్పి చూసింది. కానీ వచ్చినవాడికి కుక్కభాష రాకపోవడం వల్ల చిక్కొచ్చిపడింది. భూతం రాలిపడుతుందేమోని ఇంకా ఊపి చూశాడు. ఇక కుక్క మామూలుగా అయితే మాటవినేట్టు లేదని మానవజాతితో తమ జాతి రెగ్యులర్‌గా ఉపయోగించే భాష ప్రయోగించి వాడి పిక్క పట్టుకుంది. పెద్దమనిషికి భూతం మీద ఇంట్రస్టు అర్జంటుగా తగ్గిపోయింది. పిక్కపట్టుకుంటూ పిక్కబలం చూపాడు.



పరిస్థితి ఇంత వరకూ వచ్చాక ఏ తండ్రైనా ఏం చేస్తాడో జాన్ వాళ్ల నాన్నా అదే చేశాడు. కుక్కను పంపించివేశాడు.

కుక్కలబండిలో వెళ్లిపోతున్న తన పెంపుడుకుక్కను చూసి జాన్ బిక్కమొహం పెట్టాడు. "వాడు నా బెస్ట్ ఫ్రెండ్!" అన్నాడు.

"వీడు కాదు, అసలైన ఫ్రెండ్స్ నీకిప్పుడు తగులుతారు. ఈ కుక్కతో కబుర్లాడుతూ కూచున్నంతకాలం ఎవడూ నీ దగ్గరకి రాడు. ఇప్పుడు నా మీద కోపంగా ఉండవచ్చు కానీ ఎప్పుడో ఒకప్పుడు గ్రహిస్తావ్, నాన్న మంచిపని చేశాడని." అని బుజ్జగించాడు తండ్రి.

* * *

ఆ రోజునుండి జాన్ జంతువులతో మాట్లాడ్డం మానేశాడు. ఆ విద్యా మర్చిపోయాడు. వాళ్ల నాన్న కోరుకున్నట్టుగానే మామూలు మనుషుల్లా - అంటే కనడానికి, వినడానికి ఏ మాత్రం ఆసక్తి కలిగించని మనలాటి మనుషుల్లా - పెరిగాడు. చదువుకున్నాడు, పెద్దవాడయ్యాడు, డాక్టరయ్యాడు, పెళ్లాడాడు, ఇద్దరు కూతుళ్లను కన్నాడు. ఇల్లూ వాకిలీ కట్టుకున్నాడు - అంతా రొటీన్‌గానే!

స్వంతపేరు జాన్‌కు ఇంటిపేరు డూలిటిల్ ఇటూ, వృత్తిపేరు డాక్టర్ అటూ వచ్చి చేరాయి. ఇంకో ఇద్దరు డాక్టర్లతో కలిసి ఓ హాస్పిటల్ నడుపుతున్నాడు.



ఓ రోజు పొద్దున్న వాకిలిలో పడేసి వున్న న్యూస్ పేపరు తీసుకుంటూండగా ఓ కుక్కపిల్ల జాన్ కంటపడింది. దాన్ని తరమడానికి 'హే, హే' అన్నాడు. అది కదలలేదు. ఇంకా గట్టిగా అరిచాడు. అబ్బే! పేపరు చరుస్తూ కాస్త హంగామా చేశాడు. ఇక తప్పదురా అని కుక్క నింపాదిగా, బద్ధకంగా లేచి నిరసన ప్రకటిస్తూ దాని పృష్ఠభాగాన్ని కాస్సేపు చూపించి మరీ కదిలింది. జాన్‌కి ఒళ్లు మండిపోయింది.

"ఏమిటీ జంతువులన్నీ బొత్తిగా వరండాలోకి వచ్చేస్తున్నాయ్" అని ఇంట్లో వాళ్లమీద విసుక్కున్నాడు.

మీకు ఇంతకుముందే చెప్పడం జరిగింది, అతను ఇప్పుడో నాన్న అని. కాస్త ఇంచుమించుగా ఆ వయసులో వాళ్ల నాన్న ఉన్నట్టే తయారయ్యాడు. ఆ మాటకొస్తే వాళ్ల నాన్నా అంతే.. ఆ వయసులో వాళ్ల నాన్న పోలికలే, ఆలోచనలే.. అనలు ఆయన కూడా వాళ్ల... ఇది చర్విత చర్వణం..వదిలేద్దాం.

జాన్ కిచెన్‌లోకి ప్రవేశించేసరికి వాళ్ల ఆవిడ టిఫెన్ తయారుచేస్తోంది. పెద్దమ్మాయి షెరీజ్ బ్రేక్‌ఫాస్టు కానిస్తోంది. "గుడ్‌మార్నింగ్, షెరీజ్" అని పలకరించాడు జాన్ ఫ్రిజ్ తలుపు తీస్తూ.



"నా పేరు షెరీజ్ కాదు, నా పేరు మార్చేసుకున్నాను

తెలుసా. కొత్తపేరు 'పెప్రీకా'' అంది టీనేజ్‌లోకి వచ్చిన ఆ పిల్ల. టీనేజ్ అంటేనే అంత! తల్లిదండ్రులు పొరబాట్లు తప్ప మరేమీ చేయరని గట్టిగా నమ్మే వయసది. ఫస్టు తమ పేరు బాగాలేదని గునుస్తారు. ఓల్డ్ ఫేషన్డ్ అని ఫిర్యాదు చేస్తారు. తమ పిల్లలకు మంచి ఫేషనబుల్ నేమ్ అనుకుని మరోపేరు పెడతారు. కానీ ఆ పిల్లలూ టీనేజ్ వచ్చేసరికి తమ పేరు ఓల్డ్ ఫేషన్డ్ అనుకుని మళ్లీ తమ పిల్లలకు..ఇదీ చర్విత చర్వణం కాబట్టి దీన్ని కూడా వదిలేద్దాం.

పిల్లలతో వేగడం నేర్చుకోవలసిన ఈ కాలపు తండ్రి కాబట్టి జాన్ తను పెట్టిన పేరుని తీసిపారేసిన కూతుర్ని ఏమీ అనలేక ఓ నవ్వు తెచ్చిపెట్టుకుని,

''హలో మిస్ పెప్రీకా డూలిటిల్'' అని మళ్లీ పలకరించబోయాడు.

''డూలిటిల్, గీలిటిల్ లేదు, వట్టి పెప్రీకాయే'' అంది పిల్ల విసురుగా.



జాన్‌కి ఏమనాలో తెలియలేదు. అసలీ కొత్తపేరు నంగతేమిటో పెళ్లానికి తెలుసేమో కనుక్కోబోయాడు -

''ఇదిగో, ఈ గొడవేమిటంటావ్? అసలు పెప్రీకా అంటే ఏమిటిట?'' అని అడిగాడు.

''ఆవాలు, మెంతులు, మిరియాలు..అలాగే పెప్రీకా'' అంది భార్యామణి.

''అవునవును, ఇప్పుడు గుర్తొచ్చింది, పెప్రీకా అంటే ఎర్ర మిరియాలు కదూ..'' అన్నాడు జాన్ మిరియాల కషాయం తాగినవాడిలా మొహం పెట్టి.

ఇంతలో వాళ్ల చిన్నమ్మాయి మాయా రంగప్రవేశం చేసింది. ఆ అమ్మాయి చేతిలో ఓ పెద్ద గుడ్డుంది. అది హంసగుడ్డనీ, దాన్ని జాగ్రత్తగా పొదిగి పెద్దచేస్తే తాను హంసవాహనం మీద విహరించవచ్చనీ ఆ పిల్ల నమ్మకం. అందుకని తన పక్కమీద తన పక్కనే కంబళీ కప్పి వెచ్చగా ఉంచుతూంటుంది.

వస్తూనే ''పెప్రికా.. పేరు చాలా బాగుంది కదూ'' అంది అక్కకు వత్తాసుగా.

''నాకు మాత్రం పోపుసామాను గుర్తుకొస్తోంది'' అంది జాన్ మిరియాల ఘాటు ముక్కులో దూరినవాడిలా.

ఇంతలో ఫోను మోగింది. అలవాటు ప్రకారం జాన్ అటు పరిగెట్టాడు. తండ్రి తరహా చూసి మూతి విరుచుకుంటూ అక్కకు ఫిర్యాదు చేసింది మాయా - ''మనం సీరియస్‌గా ఫీలయేది తనస్సలు పట్టించుకోడు చూశావా?'' అని.

అక్కగారికి ముందే ఒళ్లు మంటగా ఉంది - ''దీనిలో కొత్తేముంది కనుక?'' అంది కనుబొమ్మ లెగరేసి.



ఈ లోపున తల్లి అడిగింది - ''చేతిలో అదేమిటే? ఎక్కడికి వెళుతున్నావ్?'' అని. అప్పటికే మాయా కోడిగుడ్లు పెట్టే గుంటల అట్టపెట్టెలో పెద్దగుడ్డు పెట్టుకుని తన గదికి బయలుదేరింది.

''ఈ హంసగుడ్డు నిన్న పార్కులో దొరికింది. పగిలిపోకుండా జాగ్రత్తగా పెట్టాలిగా అందుకని...''

ఫోన్ ముగించుకుని వచ్చిన జాన్ ఆ గుడ్డు కేసి చూశాడు - ''పదిమందికి సరిపడా ఆమ్లెట్టు వేసేటట్టుంది'' అన్నాడు జాలీగా.

''ఏ క్షణాన్నైనా గుడ్డు పగిలి పిల్ల బయటకు వస్తుంది తెలుసా?'' అంది కూతురు బుంగమూతి పెట్టి.

''అలాగా, అయితే పాపం నువ్వది చూడలేవులే. ఎందుకంటే నువ్వు హాలీడే కాంప్‌కి వెళ్లబోతున్నావుగా!''

మాయా బాధపడిపోయింది. ''నేను కాంప్‌కి వెళ్లను నాన్నా. పిల్లబయటకు వచ్చేటప్పటికి నేనుండాలి. ఎందుకో తెలుసా? అది గుడ్డులోంచి బయటకు వచ్చి లోకాన్ని చూసిన మొట్టమొదటి క్షణంలో ఎవరైతే దాని కంటబడతారో వాళ్లతో దోస్తీ కడుతుంది. ఈ హంస నాతోనే దోస్తీ కట్టాలని నా ఆశ.'' అని తన గోడు వెళ్లబోసుకుంది.

కానీ అందరు తండ్రులలాగానే జాన్‌కూడా పిల్లలబాధ అర్థం చేసుకోలేదు. పెద్దరికం, గాంభీర్యం రంగరించి హితవు చెప్పబోయాడు - ''చూడు మాయా, ఇలాటి కాకమ్మ ప్రయోగాలు చేస్తూ కూచోడం నీకు మంచిది కాదు. అబ్‌నార్మల్ చైల్డ్ అంటారు. నీక్కావలసినది, నీ వయసు పిల్లలతో ఆడుకోవడం. అందుకే ఈ శనాదివారాల్లో కాంప్‌కు పంపిస్తున్నాను, నువ్వు వెళుతున్నావు.'' చెవుతూండగా అతని గొంతులో అధికారం చొచ్చుకువచ్చింది. ఇక ఎవరేం చెప్పినా వినేది లేదు అన్నది ధ్వనించింది.



మాయాకు ఏడుపొకటే తక్కువ. 'అంటే..నన్నక్కడ పడేస్తే ఇక్కడ దీన్నెవరు చూస్తారు?'' అని గొల్లుమంది.

కోడిగుడ్లు పెట్టే గుంటల అట్టపెట్టె చేతికిచ్చి ''దీంట్లో పెట్టి నిక్షేపంలా పట్టుకెళ్లు. ముందు ఏడుపాపు.'' అన్నాడు జాన్.

భార్య మధ్యలో కలగజేసుకుంది. ''అబ్బ ఊరుకుందురూ'' అంది. కానీ జాన్ ఆగలేదు -

''అసలు దాన్ని మేం కొనిపెట్టలేదుగా. నీ అంతట నువ్వే కొట్టుకొచ్చావ్ ఎక్కణ్నుంచో. అవునూ ఆ పెంపుడు ఎలుకంటూ కొనిపించావ్ అదెక్కడుంది?''

''ఎలక కాదు, గినీవా పిగ్''. సవరించింది కూతురు.

''సర్లే, గినీవా పిగ్గో, రాటో. అది చచ్చిందంటే మా పొరబాటా?''

''చచ్చిందని ఎవరన్నారు? దానికి పేరు కూడా పెట్టాను. రానీ. అది నా రూములో బోనులో ఉందిగా''

''హరినీ, ఇంకా బతికేవుందా? మరి దాని పని పట్టకుండా ఈ గుడ్డట్టుకొచ్చావేం? సర్లే, నాకెందుకొచ్చిన గోల, ఇది! నా ఆఫీసు టైమవుతోంది.'' చేతిలో జ్యూస్ ఒక్కగుక్కలో తాగేసి బయటపడ్డాడు జాన్.

శనివారం పొద్దున్న క్యాంప్‌కి బయలుదేరినప్పుడు జాన్ తన కుటుంబాన్ని విడిగా పంపించవలసి వచ్చింది. అతను మరో ఇద్దరితో కలిసి ఓ హాస్పిటల్ నడుపుతున్నాడు. దాన్ని టేకోవర్ చేసుకోవడానికి మరో పెద్ద హాస్పిటల్



ముందుకు వచ్చింది. నిర్వహణ వాళ్ల కప్పగించేస్తే ఆదాయం పెరుగుతుంది కానీ స్వాతంత్ర్యం హరించుకుపోతుంది. దాని గురించి తర్జనభర్జనలు జరుగుతున్నాయి. శనివారం పొద్దున్న పెద్ద హాస్పిటల్ వాళ్లు చర్చలకు వస్తున్నారు. ఇక తను ఉండక తప్పని పరిస్థితి రావడంతో పిల్లలను వెంటబెట్టుకుని ముందుగా వెళ్లమని జాన్ తన భార్యకు చెప్పాడు. ఆవిడకు ఇదేమీ రుచించలేదు.



ఇంతలో చిన్నకూతురు పరిగెట్టుకు వచ్చింది, "నా గినీవా పిగ్ బోనులోంచి తప్పించుకుంది" అంటూ. 'నేను వెతుకుతానులేవే బాబూ' అని దానికి సర్దిచెప్పాడు. పెద్దకూతురు మొహం అదోలా పెట్టుకుని కూచుంటే 'మొహం కాస్త విప్పారనీ' అని చివాట్లేశాడు. సందు చూసుకుని 'అది పోను పోను మీలాగే తయారవుతోంది' అని భార్య విసిరిన విసురు వినబడనట్టు నటించాడు.

ఇన్ని చేసినా భార్య సంతోషించలేదు. "డబ్బే ముఖ్యం కాదు డియర్, ఫ్యామిలీ లైఫ్ కూడా చూడాలి. కుటుంబంతో ఎక్కువసేపు గడపాలి." అని సణిగింది.

"అదే నా ఉద్దేశ్యమూనూ, ఈ ప్రపోజల్ ఫైనలైజ్ అయిపోతే డబ్బు బాగా వస్తుంది. అహోరాత్రాలు కష్టపడక్కరలేదు. కుటుంబంతో ఎక్కువసేపు గడపవచ్చు. ఈలోగా చిన్న చిన్న సరదాలు..ఇదిగో ఈ స్పోర్ట్సు కారులాటివి.. కొనవచ్చు." అని జాన్ చెబుతూండగానే ఆమె చూపు వాకిట్లో ఆగిన స్పోర్ట్స్ కారుమీద పడింది. తనకోసం



భర్త కొనేసివుంటాడన్న భ్రమకు ఒక్క క్షణం లోనయి, "నేను నమ్మలేకపోతున్నాను. ఇది మీరు కొనివుండరు.."అంది ఆనందాశ్చర్యాలతో.

"నువ్వు నమ్మనక్కరలేదు! ఇది నేను కొనలేదు!! మన పాత వాన్ వెనక్కాల ఉంది." అన్నాడు జాన్ తాపీగా.

అతని భార్య మొహం మాడిపోయింది. 'సరసాలకు మాత్రం లోటు లేదు' అని సుతారంగా విసుక్కుంటూ కార్లో సామాన్లు పడేసింది. చిన్నపిల్ల వ్యానెక్కుతూ తండ్రికి బోల్డు జాగ్రత్తలు చెప్పింది. గినీవా పిగ్‌ను పట్టుకోవడానికి ఇల్లంతా జిగురుకాగితాలు పరవాలట, గుడ్డు పగలడం మొదలుపెట్టగానే ఫోన్ చేసి తనను రప్పించాలట, ఆ హంస తననే మొట్టమొదటిసారిగా చూడాలట. అన్నిటికీ సరే సరే అంటూ వాళ్లని బండెక్కించాడు జాన్.



ఆ రోజు రాత్రి తన చుట్టూ ఎలకబోన్లు పెట్టుకుని పడుకున్నా జరగాల్సింది జరిగింది. ఆ గినీవా పిగ్ అతని దుప్పట్లో దూరి అతన్ని హడలగొట్టింది. నిద్ర చెదిరి తిట్టుకుంటూంటే అంతట్లో హాస్పిటల్‌నుండి ఫోన్ - అర్జంటు కేసు ఒకటి వచ్చిందని.

తిట్టుకుంటూ వెళ్లి, తిట్టుకుంటూ కేసు చూసి, తిట్టుకుంటూ కారులో తిరిగివస్తూంటే జరిగిందా **సం..ఘ..ట..న !**

నిద్రమత్తు పోగొట్టుకోవడానికి కాగితపు గ్లాసులో కాఫీ తాగుతూ డ్రైవ్ చేస్తున్నాడు జాన్. అర్ధరాత్రి. రోడ్డు నిర్మానుష్యంగా ఉండడంతో జోరుగా పోనిస్తున్నాడు కారుని. కాఫీ గ్లాసును సీటు పక్క రింగులో పెడుతూ తడబడడం వల్ల అతని దృష్టి చెదిరింది. ఇంతలో అడ్డంగా ఓ కుక్క రావడం, కారు కింద పడబోవడం జరిగింది.



హఠాత్తుగా తన దృష్టికి వచ్చిన కుక్కను రక్షించబోయి ఛట్టున కారు తిప్పి పేవ్‌మెంటుమీదకు పోనిచ్చాడు. చెత్తడబ్బాను గుద్ది కీచుమంటూ కారు ఆగింది. ఇటుచూస్తే కుక్క చలనం లేకుండా పడివుంది. ఒక్కసారిగా పాపభారం జాన్‌ను చుట్టుముట్టింది. తన మీద తనకే అసహ్యం వేసింది. కళ్లుమూసుకుని అచేతనంగా ఉండిపోయాడు.

**"ఇప్పుణ్ణుంచైనా సరిగ్గా చూసుకుని కారు నడపరా, శుంఠా"**

ఎవడ్రా తననంత మాటన్నది అనుకుంటూ జాన్ కళ్లు తెరిచి అటూ ఇటూ చూశాడు. మనుష్యులెవరూ కనబడలేదు. కుక్క నింపాదిగా లేచి దులుపుకుంటూ వెళ్లిపోతోంది.

జాన్‌కి ఏమీ అర్థం కాలేదు.

**కలా?**

**భ్రమా?**

**అంతరాత్మ ప్రబోధమా?**

బుర్ర గోక్కుంటూ ఇంటివైపు సాగేడు.

(తరువాయి వచ్చేసారి)

## డాక్టర్ డూలిటిల్ సినిమా విశేషాలు

ఎడ్డీ మర్ఫీ పూర్తిపేరు ఎడ్వర్డ్ రీగన్ మర్ఫీ. 1961 ఏప్రిల్ 3 న న్యూయార్కులో పుట్టాడు. తండ్రి పోలీసు ఆఫీసరు. ఇతని బాల్యంలోనే మరణించాడు. సవతితండ్రి ఎడ్డీని, అతని తమ్ముడు చార్లీని సాకాడు. చార్లీ నటుడూ, సినీరచయితా అయ్యాడు. చార్లీ నటుడు, గాయకుడు, ఏనిమేటెడ్ సినిమాలలో పాత్రలకు గొంతు ఎరువిచ్చిన గాత్రదాత. ఇవన్నీ కాక కథారచయిత, దర్శకుడు, నిర్మాత కూడా!

'బెవర్లీ హిల్స్ కాప్' పాత్రతో ఖ్యాతి కెక్కాడు. 'నట్టీ ప్రొఫెసర్' అతన్ని మళ్లీ నిలబెట్టింది. కామెడీల ద్వారా పేరు తెచ్చుకున్న ఎడ్డీకు రిచర్డ్ ప్రయర్ అంటే ఆరాధనాభావం. తను కమెడియన్ కావడానికి అతనే కారణం అంటాడు. స్టేజిషోలు ఇచ్చినప్పుడు ప్రేక్షకులు ఎడ్డీని ప్రయర్ వారసుడిగా గుర్తించారు. కీర్తి గడించాక గురువుగారిని మర్చిపోకుండా 1989లో 'హార్లెమ్ నైట్స్' సినిమాను నిర్మిస్తూ ప్రయర్‌కు ముఖ్యపాత్ర ఇచ్చి గురుభక్తిని చాటుకున్నాడు.

అలాగే రెడ్ ఫాక్స్ కూడా తనకు స్ఫూర్తినిచ్చిన కమెడియన్ అంటాడు ఎడ్డీ. అలా చెప్పుకుని ఊరుకోలేదు. రెడ్‌ఫాక్స్ మరణించినప్పుడు అంత్యక్రియల ఖర్చు భరించాడు కూడా.

డా. డూలిటిల్ సినిమా 1998లో రిలీజయి అతని కెంతో పేరు తెచ్చింది. 2001లో డా. డూలిటిల్ -2 రిలీజయింది. అదీ హిట్టే!

కొత్త శీర్షిక ప్రారంభం...

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

'హాసం' హాస్య సంగీత పత్రిక మొదటిసారి చదివినప్పుడు చాలా ఆనందం కలిగింది. సినిమా పరిశ్రమకు సంబంధించిన పత్రికల్లో ఒక నూతనత్వాన్ని తీసుకురావడమే కాకుండా, అలనాటి పాత పాటలు, వాటి సాహిత్యం.... అలాగే ఆనాటి సినిమా స్క్రిప్టు మొత్తం డైలాగులు, సన్నివేశాలు అవన్నీ కూడా 'హాసం' పత్రికలో ఉండటం చూసి చాలా సంతోషించాను. మరుగుపడి పోయినటువంటి పాతను... ఓల్డ్ ఈజ్ గోల్డ్ అన్నారు కదా... ఆ గోల్డ్‌ను బయటికి తీసుకువస్తున్నటువంటి పత్రిక 'హాసం'. కేవలం వ్యాపార దృక్పథంతో కాకుండా ఎంతో శ్రద్ధతో- ఒక మంచి పత్రిక గా - చాలా చక్కగా తీసుకువస్తున్నందుకు, దానికి వెన్నెముకగా నిలిచిన రాజాగారిని అభినందిస్తున్నాను.

వారు ఒకరోజు ఫోన్ చేసారు. 'మీరు ఓ ప్రత్యేకమైన మంచి కాన్సెప్ట్‌తో కొన్ని ఆర్టికల్స్ వ్రాయాలి. అందులో మీకు ఇష్టమైన పాటలు, మీరు నటించిన చిత్రాలలోని పాటల సందర్భంలో జరిగినటువంటి సంఘటనలు కాని, వాటి ప్రభావం గురించి రాయాల'ంటూ రాజాగారు అప్రోచ్ అయినప్పుడు నాకు చాలా ఆనందం కలిగింది. 'తప్పకుండా రాస్తాను' అని చెప్పాను. గుర్తున్నంత వరకూ కొన్ని పాటల గురించి ఈ సంచిక నుండీ వివరిస్తుంటాను...

నా మొదటి చిత్రం "పుట్టిల్లు". 1952లో గరికిపాటి రాజారావుగారు ఆ చిత్రాన్ని నిర్మించినప్పుడు మొట్టమొదటి చిత్రంలోనే కథానాయికగా నటించడం జరిగింది. (ఈ చిత్రం 1953లో విడుదలైంది) అందులో చాలా అత్యున్నతమైన సాహిత్యం ఉంది. సుంకర, వాసిరెడ్డి - అనే ఇద్దరు జంటకవులు చాలా చక్కటి పాటలు వ్రాశారు. అందులో మొదటి పాట సాహిత్యపరంగా నాకు బాగా నచ్చింది.



సినీ పరిశ్రమకు వచ్చిన తొలిరోజుల్లో
మేకప్ లేకుండా తీయించిన స్టిల్ యిది

పిక్చరైజేషన్ కూడా చాలా చక్కగా చేశారు.

మనది భారత దేశమమ్మా
మనది భారత జాతి తల్లీ
భోగాల పుట్టిల్లు తల్లీ
భూలోక స్వర్గమేనమ్మా

-ఆఖరి చరణం - స్త్రీల గురించి, ఎంత బాగా వ్రాశారు అంటే -

స్త్రీ వంటఇంటికై సృష్టించబడినదో
స్త్రీ విలాసమునకై చిత్రించబడినదో
స్త్రీ దాస్యవృత్తికై చేతనంబైనదో

-అని వ్రాశారు. అలాగే ఇంకో చరణం లో

ఝాన్సీ మహారాణి అదిగో
ఆమెయే ఝానిసీ లక్ష్మి
ఒకచేతిలో బల్లెమమ్మా
ఒక చేతిలో కళ్ళెమమ్మా,
నడుమునకు ఖడ్గమోయమ్మా
ఒడలెల్ల రక్తమే తల్లీ
మూపుపై పసిబిడ్డ తల్లీ
అదిగో!అదిగో! అదిగో! అదిగో! అదిగో!
ఆమెయే ఝానిసీ రాణి
ఆమెయే ఝానిసీ లక్ష్మీ
మనకామె తోబుట్టువమ్మా

-1952 నాటి ఆ పాటలు నా కింత గుర్తు వున్నాయి అంటే 50 ఏళ్ళ తర్వాత కూడా సాహిత్యపరంగా ఎంత ప్రభావం చూపాయో తెలియడం కోసం చెప్తున్నాను.

అలాగే మరి అందులో ఇంకో పాట వుంది చాలా మంచి పాట -



తాతయ్యా! తాతయ్యా!
నీకూ నాకూ తాతయ్యా,
మన తెలుగుజాతికే తాతయ్యా
ఈ కందుకూరి తాతయ్యా
మూడు కాళ్ళతో నడిచే ముదుసలి
మూడో పెళ్ళికి ముస్తాబై
మూడేళ్ళయినా దాటని పిల్లకు
తాడుగట్ట తగదన్నాడు
అది తాడుకాదు ఉరితాడన్నాడు
తాతయ్యా! తాతయ్యా!
సంసారమనేదొక బండి
ఆలీ మగడూ చక్రాలూ
రెండు చక్రాలూ సరిసమానముగ
వుంటేనే బండన్నాడు
లేకుంటే అది మొండన్నాడు
తాతయ్యా! తాతయ్యా!

అప్పట్లో నాకు చీర కట్టుకోవడం వచ్చేది కాదు. మా అమ్మగారు కట్టేవారు. అలా 'పుట్టిల్లు' షూటింగ్ మొదలయ్యింది.

ఆ సినిమాలో స్కూల్ డ్రామా ఒకటి వస్తుంది. ఆ డ్రామాలో ఓ పేట్రియాటిక్ సాంగ్ - అదే 'మనది స్వతంత్ర భారతదేశమమ్మా' పాట. ఆ సినిమాకి వి.యన్.రెడ్డి కెమెరా. ఆయన చాలా ఫేమస్ కెమెరామన్. నటించేవారందరూ కొంచెం మహారాష్ట్రియన్ స్టయిల్‌లో ఉండాలని ఆయన సజెషన్ ఇచ్చారు. ఆ ప్రకారం జుట్టంతా మహారాష్ట్రియన్ స్టయిల్లో ముడి పెట్టి, ముక్కుకి నత్తు పెట్టి నడుముకి ఖడ్గం పెట్టారు. నేను సెంటర్ ఫిగర్. ఇంకో నలుగురు అమ్మాయిలలో దేవిక కూడా యాక్ట్ చేసింది. అప్పుడు ఆమెపేరు ప్రమీలారాణి.

సరే మేకప్ అంతా అయింది. సాటిన్ క్లాత్ నడుముదాకా.... బ్లౌజువేసుకుని నడుముకి బెల్టు లాంటిది పెట్టి ఖడ్గం పెట్టి, నగలు అవీ పెట్టారు. డ్రెస్ చేసుకున్న తర్వాత చూసుకుంటే పమిట లేదు. ఇంక నేనూ, మా అమ్మగారు ఎంత పేచీ పెట్టామో...!? అదే ఫస్ట్ టైం. పల్లెటూరి నుంచి వచ్చిన వాళ్ళం కదా చాలా సిగ్గుగావుండేది. పెద్ద వల్గర్‌గా కూడా ఏమీ లేదు. అయినా 'చెయ్యమంటే చెయ్యం' అని పట్టుపట్టాం. నాకేమో సిగ్గు అని దుప్పటి కప్పుకుని కూర్చున్నాను. మా అమ్మేమో 'కుదరదు మా అమ్మాయి పమిట లేకుండా చెయ్యద'న్నారు. అప్పటికే దాదాపు సగం సినిమా అయిపోయింది.

అప్పుడు రాజారావుగారు పరుగెత్తుకుని వచ్చారు. ' దేశభక్తి గీతం అంత వల్గర్‌గా తీస్తామా? పైగా స్త్రీల గురించి చెప్పేటప్పుడు' అని ఆయనంటే మా అమ్మగారు -'స్త్రీ గురించి చెప్పేటప్పుడు -అప్పర్ క్లాత్ లేకుండా ఎట్లా?' అని ఆర్గ్యూ చేశారు.

రాజారావుగారికి కోపం వచ్చింది. ఆయనికి చటుక్కున కోపం వస్తుంది కానీ వెంటనే మళ్ళీ మర్చిపోతారు. నన్ను చాలా

రచన : సుంకర-వాసిరెడ్డి
సంగీతం : మోహన్‌దాస్, టి.చలపతిరావ్

మనది భారతదేశమమ్మా
మనది భారత జాతి తల్లీ ॥మన॥
భోగాల పుట్టిల్లు తల్లీ
భూలోక స్వర్గమేనమ్మా ॥భో॥ ॥మన॥
వీరరుద్రమదేవి ధీరదుర్గారాణి
రాణాప్రతాపుడూ రసపుత్రవీరులూ
తమ శౌర్యమయ రక్త ధారాస్రవంతిలో
తడిపి మెదిపిన వీరధాత్రి ఇదే మా తల్లీ॥మన॥
ఝాన్సీ మహారాణి అదిగో
ఆమెయే ఝాన్సీ లక్ష్మీ
ఒక చేతిలో బల్లెమమ్మా
ఒక చేతిలో కల్లెమమ్మా
నడుమునకు ఖడ్గమోయమ్మా
ఒడలెల్ల రక్తమే తల్లీ
మూపుపై పసిబిడ్డ తల్లీ
అదిగో!అదిగో! అదిగో! అదిగో! అదిగో!
ఆమెయే ఝాన్సీ రాణి
ఆమెయే ఝాన్సీ లక్ష్మీ
మనకామె తోబుట్టువమ్మా
మనమామె చెల్లెండ్రమమ్మా
స్త్రీ వంట ఇంటికై సృష్టించబడినదో!
స్త్రీ విలాసమునకై చిత్రించబడినదో!!
స్త్రీ దాస్యవృత్తికై చేతనం బైనదో !!!
చెప్పవే మాయమ్మ చెప్పవే
మా తల్లీ! ॥మన॥



'పుట్టిల్లు' చిత్రంలో హీరోయిన్‌గా...




'పుట్టిల్లు' పాటల పుస్తకం కవర్‌పేజీ

రచన : సుంకర-వాసిరెడ్డి
సంగీతం : మోహన్‌దాస్, టి.చలపతిరావ్

తాతయ్యా! తాతయ్యా
నీకు నాకు తాతయ్యా
మన తెలుగుజాతికే తాతయ్యా
ఈ కందుకూరి తాతయ్యా ॥తా॥
మూడు కాళ్లతో నడిచే ముదుసలి
మూడో పెళ్లికి ముస్తాబై
మూడేళ్లయిన దాటని పిల్లకు
తాడుగట్ట తగదన్నాడూ అది
తాడుగాదు ఉరితాడన్నాడు ॥తా॥
సంసారమనే దొక బండి
ఆలీమగడూ చక్రాలూ
రెండు చక్రములూ సరిసమానముగ
ఉంటేనే బండన్నాడు - లే
కుంటే అది మొండన్నాడూ ॥తా॥
పతికి బానిసై మెతుకు దూరమై
గతుకులమారీ బ్రతుకై
తల్లడిల్లు నీ తల్లిని నేటికి
స్వేచ్ఛా జీవిని చేశాడు స్త్రీ
జాతికి జీవం పోశాడు ॥తా॥
చితికిపోయిన స్త్రీ లోకానికి
నూతనమార్గము చూపి
తాతకు మంచి ఖ్యాతిగడించి
జాతికి మేలుకూర్చుమురా నీ
తల్లీ ఆశలు తీర్చుమురా ॥తా॥





'అంతా మనవాళ్లే' పాటల పుస్తకం కవర్‌పేజీ

పాట రచన : కొండేపూడి లక్ష్మీనారాయణ    సంగీతం : మాస్టర్‌వేణు

పాడరా ఓ తెలుగువాడా !
పాడరా ఓ కలిమి రేడా!
పాడరా మన తెలుగుదేశపు భవ్యచరితల దివ్యగీతం ॥పాడరా॥
కదనరంగమునందు మెరసిన కాకతీయుల ఖడ్గతేజమ్
వదరుశత్రువు నెదిరిపోరిన వనిత రుద్రమ యుద్ధపటిమ
కొదమసింగము పగిది నురికిన బాలచంద్రుని బాహుదర్పము
పొంగజేయద మేనిరక్త-ముప్పొంగ జేయద నీదుహృదయము ॥పాడరా॥
తెలుగు పలుకుల తేనెలొలికెను తిక్కనార్యుని కవితలోన
రాలుకరిగే త్యాగరాజుని రాగసుధలో మునిగె తెనుగూ
సొంపుగూర్చెను తెలుగుతల్లికి హంపినగరపు శిల్పసంపద
భరతనాట్యపు భంగిమములో పల్లవించెను తెలుగు పరువము ॥పాడరా॥
తెనుగుజాతికి నూత్న సంస్కృతి తీర్చిదిద్దిన కందుకూరి
తెనుగుభాషను ప్రజల భాషగ జేయపోరిన గిడుగు పిడుగూ
దేశమంటే మనుజులేనని తెలియజెప్పిన అప్పారాయుడు
తెనుగుతల్లీ నోముపంచే తేజరిల్లిన దివ్యతారలు! ॥పాడరా
కలవు గనులును నదుల జలములు పసిడి పాతర మనదు దేశం
సిరియుసంపద వెల్లి విరిసే స్వర్గతుల్యము జేసికొందము
మూడుకోటుల తెలుగుబిడ్డల ముక్త కంఠము లొక్క పెట్టున
జయముజయమని తెలుగు తల్లికి విజయగీతిక లాలపింపగ ॥ పాడరా॥



ప్రేమగా చూసేవారు. ఆయనకు అప్పటికి ఆడపిల్లలు పుట్టలేదు. ఇద్దరు మగపిల్లలు చిన్నవాళ్ళే. కూతురులాగా నన్ను చూసుకునేవాళ్లు. అలాంటిది ఆయనకు చాలా కోపం వచ్చింది. వెంటనే ఆయన మా నాన్నగారితో "శ్రీనివాస్‌రావు గారు, ఐ డోంట్ వాంట్ హెర్ సర్వీసెస్ ఐ విల్ రిమూవ్ హెర్ " అనేశారు. మా నాన్నగారు ఇంకా కోపిష్టి. "అ... తీసేయండి, మీ పిక్చర్‌లో చేసేదేంటి" అన్నారు.

ఈ లోపల కెమెరామెన్ వి.యన్.రెడ్డి గారు, రాజారావుగారి ఫ్రెండ్స్ వచ్చి కన్విన్స్ చేసారు. చాలా సిగ్గుపడుతూ టేక్‌వరకూ పైట కప్పుకుని టేక్ సమయంలో తీసేసి యాక్ట్ చేశాను. అందరిలోకి కాస్త చబ్బీగా, లావుగా వుండేది దేవిక ఒక్కతే. ఆ రోజుల్లో 13, 14 ఏళ్లకే పమిట వేసుకోవటం సంప్రదాయం. పమిట తీసెయ్యమనేనరికి మానాన్నగారు సినిమావదులుకొనే స్టేజికొచ్చారు. సరే రాజారావుగారి కోపం తగ్గాక షూటింగ్ మొదలైంది. నిజంగా అందరం చాలాముద్దుగా అందంగా వున్నాం ఆ సీన్లో... అదొక సంఘటన.

ఈ సందర్భంగా ఇంకొక సంఘటన ఏమిటంటే - 'దొంగరాముడు' చిత్రంలో నటిస్తున్నాను. ఆ సినిమాలో 'అనురాగము విరిసేనా' నిజంగా చాలా మెలోడియస్ సాంగ్. ఒక అమాయకమైనటువంటి పేదపిల్ల ఆ చందమామను చూస్తూ తన ప్రేమను ఏవిధంగా ఎక్స్‌ప్రెస్ చేస్తుందనేది సాహిత్యపరంగా గానీ, ట్యూన్‌పరంగా గానీ నాకు బాగా గుర్తుంది.

ఆ సినిమాలో
బలేతాత మనబాపూజీ
బాలల తాత బాపూజీ



రష్యాలో 'పదండి ముందుకు' చిత్ర ప్రదర్శన సందర్భంగా దర్శకుడు వి.మధుసూదనరావు, జమున, గుమ్మడి



'అంతా మనవాళ్లే' చిత్రంలో సెకండ్ హీరోయిన్‌గా....



అని మహాత్మాగాంధీ మీద పాట పెట్టారు. ఆ రోజుల్లో ఒక సిస్టమ్ ఏమిటంటే పాటల రికార్డింగు అయిపోయిన తర్వాత వినిపించడం కోసం ఆర్టిస్టులను ఆఫీస్‌కు పిలిపించేవారు. అలా నన్ను అన్నపూర్ణ ఆఫీస్‌కు పిలిపించారు.

నాకు అప్పుడు 16,17 ఏళ్లు ఉంటాయి. నేను ఇండస్ట్రీకి వచ్చి అప్పటికి రెండేళ్లే అయింది. లౌక్యం బొత్తిగా తెలియదు. అమాయకంగా వుండేదాన్ని. నాన్నగారు, కెవి రెడ్డిగారు, నాగేశ్వరరావుగారు, దుక్కిపాటి మధుసూదనరావు గారు అందరూ కూర్చున్నారు. 'అనురాగము విరిసేనా' పాట వినిపించారు. విన్నాక 'చాలా బాగుందండి' అని చెప్పాక 'బలే తాత మన బాపూజీ' పాట వినిపించి 'ఎలా వుందమ్మా' అని నన్ను అడిగారు.

వెంటనే నేను "సార్ ఈ పాట 'పుట్టిల్లు'లో నా పాటకి కాపీలా ఉందండి. 'తాతయ్య తాతయ్య' అని కందుకూరి తాతయ్య మీద రాశారండి అలాగే ఉందండి ఈ పాట కూడా" అన్నాను. ఇంక వాళ్ళ ముఖాలు ఎంత చిన్నబోయాయో చూడండి. ఇంటికొచ్చిన తరవాత మా నాన్నగారు 'అలా అనవచ్చా? తప్పుకదా? కాపీ అనడం ఏమిటి నీ మొహం'అని కోప్పడ్డారు. అది తల్చుకున్నప్పుడు నా అమాయకత్వానికి నాకే నవ్వు వచ్చేది.

అలా కెవిరెడ్డిగారి లాంటి వారిని పట్టుకొని అమాయకంగా ఇది కాపీ అని అనేశాను. వాళ్ళు చిన్నపుచ్చుకున్నా, తరువాత అంతా సర్దుకు పోయింది.

'అంతా మనవాళ్ళే'నాకు మూడో చిత్రం. అది సెకండ్ హీరోయిన్ పాత్రే గాని చాలా గ్లామరస్ క్యారెక్టర్. అందులో నాకు రెండుపాటలు వున్నాయి. ఒకపాట 'ననుకాదని ఎవరు అనగలరా' అని - చాలా బాగుంటుందా పాట. ఆ సినిమా 100 రోజులు ఆడింది. నాకు పర్సనల్‌గా అందులో ఇష్టమైన పాట - 'పాడరా ఓ తెలుగువాడా'. కృష్ణకుమారి, వల్లం నరసింహారావు గారు తెరమీద పాడతారు. నాకు పర్సనల్‌గా, సాహిత్యపరంగా ఇష్టం . తెలుగువారి గొప్పతనం గురించి, చరిత్ర గురించి చాలా చక్కగా వ్రాశారు.

ఈ పాటకి సంబంధించిన ఇన్సిడెంట్ ఏమిటంటే - ఇటీవల మరణించిన జగ్గయ్య గారు 'పదండిముందుకు' అని ఒక సినిమా తీశారు. దాన్ని రష్యన్ గవర్నమెంటు కోసం రష్యాకు తీసుకువెళ్ళాము. దాన్ని సబ్‌టైటిల్స్‌తో 'తిర్యత్' పేరుతో అక్కడ ప్రదర్శించారు. (తిర్యత్ అంటే లాంగ్‌మార్చ్) నేను మొదటిసారిగా విదేశీయాత్ర చేయటం అదే. అప్పుడు గుమ్మడిగారు, నేను, డైరెక్టర్ వి.మధుసూదనరావుగారు ఉన్నాం. జగ్గయ్యగారు రాలేదు.

అక్కడ సందర్భం ఏమిటంటే థియేటర్‌లో వేరే సినిమా ఏదైనా జరుగుతున్నప్పుడు అంటే మా సినిమా రావడానికి ముందు బయట ప్రేక్షకులు టిక్కెట్స్ కొనుక్కోవటానికి వచ్చినవాళ్లలో రష్యన్స్, తెలుగువాళ్లు కూడా వున్నారు. ఎక్కువగా స్టూడెంట్స్. రష్యన్స్‌కి చీర కట్టుకున్న వాళ్లంటే చాలా ఇష్టం. మీరు ఇండియా నుంచి వచ్చారా (ఇండీస్కి?) అంటే 'యస్' అనేవాళ్లం. చాలామందికి అసలు ఇంగ్లీషు రాదు. మాకంటే ట్రాన్స్‌లేటర్స్ వున్నారు కాబట్టి మాట్లాడేవాళ్లం,ఎక్కడికి వెళ్లినా కూడా (వాళ్లకి మాట్లాడటానికి తెలుగు రాకపోయినా రాగాలు తెలుస్తాయి కదా)'పాడరా ఓ తెలుగువాడా' పాట అలాగే లతా మంగేష్కర్ పాడిన 'జ్యోతికలష్ ఛల్‌కే' అనే హిందీ పాట ఎక్కువగా పాడుతూ వుండేదాన్ని. ఇప్పుడంటే గొంతు పాడయిపోయింది కాని అప్పట్లో ఈ రెండు పాటలూ చాలా చోట్ల, బాగా పాడేదాన్ని.

**(వచ్చేసంచికలో మరికొన్ని పాటల గురించి....)**



ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

## కరాజు కథలు 9

# చిలుక పలుకులు



కరాజు రాజ్యంలో చాలా ఏళ్ళుగా చెంచయ్య అనే వ్యక్తి పశువుల వ్యాపారం చేస్తున్నాడు. సంతకి వెళ్ళడం కంటే చెంచయ్య దగ్గరైతే మేలురకం గేదెలు, ఆవులు, గొఱ్ఱెలు దొరుకుతాయని అందరి నమ్మకం. కొన్నాళ్ళుగా ఈ వ్యాపారంలోకి మరి కొందరు దిగారు.

ఇతరదేశాల పశుసంపదను ఈ వూరికి తెచ్చేసరికి జనం కొద్దిగా ఆ వైపుకు మోజు కనబర్చారు. దాంతో చెంచయ్య వ్యాపారం కొంత సన్నగిల్లడంతో ఇప్పుడేం చెయ్యాలా అని అనుకుంటూంటే అతనికో ఆలోచన తట్టింది.

కొండనానుకొని వున్న అడవిలో "చిలుకల గుబురు" అనే ప్రాంతం వుంది. అక్కడున్న చెట్లమీద కొన్నివేల చిలుకలు నివాసం చేస్తున్నాయి. ఇప్పుడా చిలుకలను వలవేసి పట్టి అమ్మితే పశువులకన్నా మెరుగైన లాభాలు వస్తాయని నిశ్చయించాడు చెంచయ్య. వెంటనే అనుచరులతో అడవికెళ్ళి రెండు రోజుల ప్రయత్నంతో కొన్ని చిలుకలను పట్టాడు.

కానీ తీరా ఇంటికొచ్చి వాటిని అమ్మకానికి పెట్టేసరికి అనుకొన్న రీతిన కొనడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. చిలుకలను ఇంట్లో పెంచడం మంచిదికాదనీ, ఒకప్పుడు ఇలా చేసే రామదాసు కారాగారశిక్ష అనుభవించాడనీ ఇలాంటి కథలతో చిలుకలను కొనడానికి అందరూ భయపడ్డారు.

మరి వీటిని అమ్మడ మెలాగని ఆలోచించగా అతనికి మరో ఆలోచన వచ్చింది. చిలుకలకు మాటలు నేర్పితే ఆ ముచ్చట కోసం వాటిని కొనడానికి జనం సమ్మతించవచ్చు. అయితే ఎటువంటి మాటలు నేర్పాలి? అందరూ ఎటువంటి మాటల్ని వినడానికి ఇష్టపడతారు? చెంచయ్యకు మెరుపులా తట్టింది. అందరూ ఇష్టపడే మాట ఒక్కటే-పొగడ్త. ఈ చిలుకలకు పొగిడే మాటలు నేర్పిస్తే అందరూ విరుచుకుపడి



కొంటారనే దృఢ నమ్మకం కుదిరింది.

ముందు "ఆహా!", 'ఓహో", "భలే" అనే చిన్న చిన్న మాటలు నేర్పాడు. ఆ తర్వాత "నీవే ఘనుడవు" - "నిన్ను మించిన వాడులేడు" అనే మాటలను నేర్పాడు. చిలుకలకిచ్చిన శిక్షణ పూర్తి కాగానే ఒకరోజు ఊరివారినంతా ఆహ్వానించి తాను కొత్తగా అమ్మదలచుకున్న మాటల చిలుకల్ని చూపెట్టాడు. ఇది చూసిన జనం ఆశ్చర్యంతో ఇలాంటి చిలుకనొక దాన్నైనా తమ ఇంట్లో వుంచుకోవాలని వుబలాట పడ్డారు. అదివరకు విన్న రామదాసు కథల్ని పక్కకు నెట్టేశారు. ఒక్కొక్కరు ఎక్కువ వెలనిచ్చి చిలుకల్ని కొన్నారు.

ఇలా కొన్న వాళ్ళలో ఆస్థానకవి కాడానికి ప్రయత్నించే కవి ఒకడు ఉన్నాడు. అంతకు ముందు అతను ఏ కావ్యం రాసి వినిపించినా విన్న తోటికవులు పెదవి విరిచేవారు. ఇది వారి ఈర్ష్య అని అతను తృప్తి పడేవాడు. అయినా అతన్నెవ్వరూ మెచ్చుకోలేదన్న బాధ అతనికి మనశ్శాంతి లేకుండా చేసింది. ఇప్పుడు అతను ఒక మాటల చిలుకను కొన్నాడు. అప్పట్నుంచి అతని ఆనందమే వేరు. అతను రాసిన ఒక పద్యపాదం చదవగానే ఎదురుగావున్న చిలుక "ఆహా!" అనేది. పద్యం పూర్తి కాగానే 'భలే"అనేది. 'నీ అంతటి ఘనుడులేడు' అనేది, మురిసిపోయిన ఆ కవి తను ఆకల్తో వున్నా చిలుకకు మాత్రం జామపళ్ళు, దానిమ్మ గింజలు పెట్టేవాడు.

ఇలా సంగీత కళాకారులు, నటులూ, వ్యాపారస్థులూ, ప్రభుత్వోద్యోగులూ - ఒకరేంటి? ఎందరో ఈ చిలుకల్ని కొని రోజూ వాటి పొగడ్తల ఆనందంలో మునిగి పోయేవారు.

ఈ వ్యాపారం చేస్తూనే చెంచయ్య మరొక చిన్న పని చేశాడు. చిలుకలకు రోజూ పొగడ్తలు నేర్పి నేర్పి విసుగు పుట్టి ఒకరోజు సరదాగా ఒక




చిలుకకు తిట్లు నేర్పడం మొదలెట్టాడు. "ఛీ ఛీ", 'నీచుడా', 'ఛండాలుడా' 'ఎంతటి అఘాయిత్యం చేశావురా' లాంటి పదాల్ని 'పొగడ్తలకన్నా తిట్లు తొందరగా నేర్చుకుంది చిలుక.

ఇంకో విశేష మేమిటంటే, పొగడ్తల విషయంలో ఒక్కొక్క చిలుకకూ ప్రత్యేకంగా పాఠం చెప్పాల్సి వచ్చేది. అదే తిట్లైతే ఒక చిలుకకు చెప్తే చాలు పక్కనున్న చిలుకలు వాటంతటవే ఆ తిట్లను నేర్చుకునేవి. రెండు వారాల్లో ఐదారుతిట్లు తిట్టే చిలుకలు తన దగ్గరుండడం చూసి చెంచయ్యకే ఆశ్చర్యం వేసింది. వీటిని చూచి పొగిడే చిలకల్ని కొనే వాళ్ళు కూడా రారేమో నన్న భయంవేసి వాటిని పెరట్లో దూరంగా వుంచాడు. అప్పుడప్పుడు ఎవరికైనా తిట్టేచిలుకలు కావాలా అని అడగడం కూడా జరిగింది. కాని వాటిని కొనడానికి ఎవరూ ఇష్టపడరని గ్రహించాడు.

ఒకనాడు ఒక తీపిమిఠాయిల దుకాణం ప్రారంభోత్సవానికి మంత్రి బజారుకు సపరివారంగా రావడం జరిగింది. ఆ సందర్భంలో దగ్గర్లోనేవున్న మాట్లాడే చిలుకల దుకాణం గురించి విని వాటిని చూడాలనే కుతూహలంతో మంత్రి అక్కడకు వెళ్ళాడు. అనుకోకుండా వచ్చిన మంత్రిగారిని చెంచయ్య సాదరంగా ఆహ్వానించి తన దగ్గరవున్న పొగిడే చిలుకల్ని చూపించి వాటిలో ఒకదానిని మంత్రి గారికి గౌరవ మర్యాదలతో బహుకరించాడు. ఇదే సమయంలో దూరంగా పెరట్లోంచి తిట్లు వినిపించేసరికి చెంచయ్య వాటిని గురించి చెప్పక తప్పింది కాదు. ఇది చూసిన మంత్రి చెంచయ్యకు ఒక మంచి సలహా ఇవ్వాలనుకున్నాడు.

"చెంచయ్యా! ఆ చిలుకల్ని వదిలేస్తే పోలా!" అన్నాడు మంత్రి.

"అమ్మ బాబోయ్! వద్దండీ వద్దు" అన్నాడు చెంచయ్య కంగారుగా. "ఒకసారి ఒక చిలుక పంజరంలోని తప్పించుకొని పోయి, ఊళ్ళోకెళ్ళి ఇళ్ళకప్పుల మీద, వీధుల్లో చెట్లమీద కూర్చొని వచ్చే పోయేవారిని తిడ్తూండింది. దాంతో అందరూ నా యింటిని చుట్టుముట్టి నన్ను చావబాది పోయారు. నేనే ఎలాగో తప్పించుకొని ఈ చిలుకను పట్టి మళ్ళీ గూట్లో పెట్టేశాను."

ఈ మాటలు విన్న మంత్రికి మరొక ఆలోచన తట్టింది.

"చెంచయ్యా! మననగరంలోని మంచోళ్ళ పేట ఎరిగున్నావ్ కదా?" అడిగాడు మంత్రి.

"అవును మంత్రి ప్రభూ! అక్కడున్నవారు పేట విడిచి బయటికి రారు".

"అవును. మంచోళ్ళపేట అంటే మంచి మనుష్యులు వుండే పేట. ఆ పేటకు ఆ పేరు





ఎందుకు వచ్చిందో తెలుసుగా! రాజ్యంలో రకరకాల నేరాలు చేసిన వారు శిక్షలను అనుభవించిన తర్వాత ఊళ్ళో వాళ్ళ ముఖాలు చూపించుకోడానికి ఇష్టపడరు. ఒక్కసారి వచ్చిన చెడ్డపేరు వారిని ఎక్కడా తలెత్తినీయకుండా చేస్తుంది. అలాంటి వాళ్ళంతాచేరి పూరిచివర్న నివాసం ఏర్పరచుకున్నారు,అదే మంచి వాళ్ళపేట. ఇప్పుడు నీవీ చిలుకల్ని వాళ్ళకు కానుకగా పంపిస్తే సరిపోతుంది. అక్కడి వారు నేరస్థులు కనుక తిట్లను తప్పుపట్టరు."

మంత్రి ఆలోచన చెంచయ్యకు ఒక రకమైన ఊరట కలిగింది. తిట్టే చిలుకల్ని వదిలించుకోడానికి ఇదొక సదవకాశమైంది. వెంటనే తన దగ్గరున్న చిలుకల్ని మంచోళ్ళ పేటకు తీసుకువెళ్ళి అక్కడి వాళ్ళకు కానుకగా ఇచ్చి వచ్చాడు.

తిట్లు విన్నప్పుడు ముందు అందరికీ కాస్త కోపం వచ్చింది. ఇప్పటికే కుమిలి పోతున్నవాళ్ళని ఇంకా క్రుంగదీయడానికి ప్రభుత్వం వారు ఈ పని చేయించారంటూ బాధపడ్డారు. కాని ఈ బాధ కొన్నాళ్ళు వరకే వుండింది.

చిలుకల తిట్లు రోజూ వింటూ వింటూ కొంత కాలానికి బాగా అలవాటు పడిపోయారు. అంతకుముందు ఎవరైనా కొద్దిగా నిందించినా బాధపడేవారు యిప్పుడు ఎవరు ఏమనుకున్నా ఛీ అన్నా, తిట్టినా, కొట్టినా ఇసుమంతకూడా చలించని మనస్తత్వాన్ని పొందగలిగారు. ఇక ఎక్కడో మూల దాగుండవలసిన అవసరం పోయింది. అందరూ స్వేచ్ఛగా నగరంలోనికి వచ్చి ధీమాగా తిరుగుతున్నారు. పెళ్ళిళ్ళల్లో కనిపిస్తున్నారు. సభలలో సాక్షాత్కరిస్తున్నారు. ఇప్పుడు వాళ్ళ వైఖరి వేరు.




ఎవరు దూషించినా ఒక చిఱునవ్వు నవ్వి ఒక ఘనకార్యం సాధించినవారి రీతిలో సగర్వంగా చూసేవారు.

ఇపుడు ఊరంతా నేరస్థులే. అంతేకాదు కొత్తగా నేరాలు చేయదలచినవారు ముందు చిలుకల తిట్లు విని, వాటి కలవాటుపడి ఆ తర్వాత నేరం చేసేవారు. న్యాయాధీశులు వారికే శిక్ష విధించినా సంతోషంగా స్వీకరించి శిక్షాకాలం కాగానే యథావిధి అందరి మధ్య ఆనందంగా తిరిగేవారు. తను చెంచయ్యకి చెప్పిన ఒక చిన్న సలహా రాజ్యంలో ఇంతటి విపరీతానికి దారి తీస్తుందనుకోలేదు మంత్రి.

కంగారుగా కరాజు దగ్గరకు వెళ్ళి పరిస్థితిని వివరించాడతను. దీనికి పరిష్కార మార్గం చూడవలసిందిగా వేడుకున్నాడు.

"క్లిష్టపరిస్థితి వచ్చింది మంత్రీ! ఒక రాజ్యంలో నేరాలు చేయడం సహజం. దానికి వారు శిక్ష అనుభవించడమూ సహజమే. కాని సమాజంలోని వారందరూ వారిని చిన్న చూపు చూసినపుడు వారు సిగ్గుతో తలదించుకున్నప్పుడే ఆ శిక్షకొక విలువ. ఎప్పుడా సిగ్గే పోయిందో 'ఎవరేమనుకుంటే నాకేం'? అన్నట్టు వారు నిక్కుతూ తిరుగుతుంటే ఇక శిక్షలకు విలువలేదు. నేరాలకు అదుపు లేదు. ఒక రాజ్యానికి ఇంతకంటే హీనస్థితి ఉండబోదు" అన్నాడు కరాజు.

కరాజే తన అసహాయత్వాన్ని వెల్లడిస్తుంటే ఇక దిక్కెవరు? మంత్రి కంగారుగా "మహారాజా! ఎప్పుడూ ఏదో ఒక పరిష్కారమార్గం చూపించే మీరే ఇలాగంటే ఎలా? ఏదైనా ఆలోచించండి" అన్నాడు.

"ఐతే ఇలా చెయ్యండి" అన్నాడు కరాజు. "ఇది చిలుక పలుకలతో వచ్చిన అనర్థం కనుక చిలుకపలుకులే దీనికి విరుగుడు. వెంటనే చెంచయ్యని కలిసి చిలుకలకు "బుద్ధిలేని వాణ్ణి పొగుడ్తారు - చేతకానివాణ్ణి తిడ్తారు." అనే కొత్త మాటల్ని నేర్పి వూళ్ళోకి వదలమనండి. ఈమాటలు వినగానే పొగిడించుకునే వాళ్ళంతా తాము బుద్ధిలేని వాళ్ళుగా చూడబడ్తామనే భయంతో పొగడ్తలకు దూరమౌతారు. ఇక నేరస్థుల విషయానికొస్తే, తమను నేరస్థులన్నా వారు పెద్దగా పట్టించుకోరు కానీ చేతకానివాళ్ళనిపించుకోవడం మాత్రం అస్సలు సహించలేరు. అందుకని తిట్లకు భయపడ్తారు. ఈ ప్రయత్నంతో రాజ్యంలో మార్పు రాగలదు" అన్నాడు కరాజు.



అనతికాలంలో చిలుకలకొత్త మాటలు జనంలో బాగా ప్రచారమయ్యాయి. ఎక్కడైనా ఎవర్నైనా పొగిడితే చాలు అందరూ గొల్లుమని నవ్వేవారు. పొగడబడ్డవాడు నిజంగానే బుద్ధిలేనివాడిలా అయోమయంగా చూసేవాడు. ఇక నేరస్థులంటే చాతకాని వాళ్ళనీ, అందుకే వాళ్ళు నేరాలకి దిగుతారనీ అనే ప్రచారం వాళ్ళల్లో పూర్తి మార్పుతెచ్చింది. సంవత్సరం అయ్యేసరికి రాజ్యంలో నేరాలసంఖ్య బాగా తగ్గిపోయింది. సరికదా, అయినవాణ్ణి, కానివాణ్ణి పొగిడే సంస్కారం పూర్తిగా తుడుచుకుపోయింది. ■

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



**26**

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్ చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



**జరిగిన కథ**

వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం కోసం శాస్త్రి ని కలిసిన వెంకట్రావుకు నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటూ తూతూ మంత్రాల తో పూజలు చేయించి దోచుకుంటాడు. జరిగిన తతంగమంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు. ఇదంతా మీ ఇంటి వాస్తు బాగా లేకపోవటం వల్లే జరిగిందని, వాస్తుభూషణరావుని కలిస్తే ఫలితం ఉంటుందన్న నారాయణ సలహా మేరకు వాస్తు భూషణరావు ఇంటికి వచ్చి లైనులో నిలబడిన వెంకట్రావుకు తెల్లవారుజాము మూడున్నరకు ఆయనను కలిసే అవకాశం దొరుకుతుంది. తన సమస్యను విన్నవించటంతో స్వయంగా వచ్చి ఇంటి వాస్తు పరిశీలిస్తానని చెప్పి వెంకట్రావు ఇంటికి వచ్చిన వాస్తుభూషణరావు వెంకట్రావు ఇంటిలోని ప్రతి దానిని తప్పుపడుతుంటాడు. (ఇక చదవండి)

"పోర్టికో మరీ ఆరడుగులే ఉన్నది. కనీసం ఏడడుగుల ఎత్తైనా ఉండాలి. పోర్టికో అధిపతి శని. దీన్ని వేలైనంత దూరంగా పెట్టుకోవాలిగానీ మరీ నెత్తిన పెట్టుకున్నారే! అన్నన్న.. వాటర్ పైపులు ఇక్కడ పెట్టారేంటి, అందునా ఈ ట్యాప్ పడమర చూస్తున్నది.

**పడమర చూసే ట్యాపు**
**ప్రగతిని చేత్తో ఆపు**

అని అర్జెంటీనాలో అరిచి చెప్పాను. వాళ్ళు వినలేదు కాబట్టే ఆ దేశం ఇపుడు ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయి ఆరు రోజుల్లో అయిదు మంది అధ్యక్షులు మారిపోయారు. శాస్త్రమా మజాకా! శాస్త్రో రక్షతి రక్షితః అన్నారు. శాస్త్రాన్ని మనం రక్షిస్తే అది మనలను రక్షిస్తుంది."

"స్వామీ! ఇన్ని విషయాలు మాకు నిజంగా తెలియవు."

"అందువల్లనే నాయనా ఇన్ని పొరపాట్లు జరిగాయి."

"మరి దీనికి నివారణ?"

"అందువల్లనే నాయనా మేమున్నది? రండి.. నింపాదిగా కూర్చుని మాట్లాడుకుందాం."




ముగ్గురూ హాలులో కూర్చున్నారు. సూట్‌కేస్‌లోంచి ఐదువేల పేజీల పుస్తకం ఒకదాన్ని బయటకు తీశాడు వాస్తుభూషణం. పేజీలు తిరగెయ్యసాగాడు.

"ఏం పుస్తకం సార్ అది అంతలావుంది?" అడిగాడు వెంకట్రావు.

"ఆరు వేల సంవత్సరాల క్రితం వాస్తవ మహర్షి అనే ఋషి రచించిన వాస్తు వాద క్రియ అనే ఉద్గ్రంథం ఇది. ఆ మధ్య వాషింగ్‌టన్ వెళ్ళినపుడు ఫుట్‌పాత్ మీద పదివేల డాలర్లిచ్చి కొన్నాను. మయుడు పాండవులకొరకు మయసభను నిర్మించడానికి ఈ గ్రంథాన్ని పరిశీలించాడని ప్రతీతి. లేనిది ఉన్నట్లు, ఉన్నదిలేనట్లు భ్రమింపజేయడానికి ఈ గ్రంథంలో అనేక టెక్నిక్కులున్నాయి. ప్రపంచంలో ఇలాంటి గ్రంథం ఇదొక్కటే." చెప్పాడు వాస్తు భూషణం.

"ఆహా! అది నేనొకసారి చూడొచ్చా?" అడిగాడు వెంకట్రావు.

"తప్పకుండా. విజ్ఞానం అందరిదీనూ." అందించాడు వాస్తు భూషణం.

"ఏం భాషండీ ఇది.. ఏదో అరబిక్‌లా ఉంది. ఒక్కముక్క అర్థం కావడంలేదు." అన్నాడు వెంకట్రావు.

"అది దేవేంద్ర భాష. సామాన్యులకు అర్థం కాదు. ఇలా ఇవ్వండి." పుస్తకం తీసుకుని పేజీలు తిరగేశాడు వాస్తుభూషణం.

"వెంకట్రావుగారూ... ఇంట్లో చాలా మార్పులు చెయ్యాలి. ఆగ్నేయంలో లెట్రిన్లను నిర్మూలించాలి. సెప్టిక్ ట్యాంకును మూసేసి ఉత్తరంవైపు తవ్వించండి. మెట్లు మొత్తం పడగొట్టించండి. బెడ్రూమ్ అంతా కూలగొట్టాలి. దక్షిణం వైపున్న ద్వారబంధాలు నిర్మూలించి రెండంగుళాలు ఉత్తరం జరిపించాలి. ఉత్తరం కాంపౌండ్‌వాల్ పడగొట్టి అంగుళం జరిపి తిరిగి కట్టించండి. హాల్లో ఉన్న అలమరలను తీసేయించండి. దక్షిణానున్న వాటర్ ట్యాప్‌లను తీసేయించి ఉత్తరం వైపు పెట్టించండి. పిట్టగోడ తీసేసి రెండున్నరంగుళాల మందంతో తిరిగి కట్టించాలి. తూములను తవ్వించి పెద్దవి చేయించాలి. వంటింట్లో ప్లాట్‌ఫామ్ ఎత్తు పెంచాలి. మోరీని తీసేయించి కోణంలో పెట్టాలి........" చెప్పసాగాడు వాస్తుభూషణం.

**"ఆపండి మీ వాచాలత్వం...."**

అనే మాటలు గంభీరంగా వినిపించాయి.

ముగ్గురూ ఉలిక్కిపడి వాకిలి వైపు చూశారు.

నిలువునా కాషాయవస్త్రాలు, అరణ్యంలో పెరిగినట్లు తైల సంస్కారం లేని తల, గుబురు మీసాలు, కొమ్మల నుండి దిగిన ఊడల్లాంటి గిరజాలు, నుదుట మందమైన గంధపుగీతలు, మెడలో నిమ్మకాయలంత రుద్రాక్షలతో మాల, చేతులకు బంగారు కడియాలు, పాదాలకు పావుకోళ్ళు ధరించి నిలబడి ఉన్నాడో వ్యక్తి. రెండు పండిత శాలువాలు భుజం మీదున్నాయి. కళ్ళు అగ్నిగోళాల్లా ఉన్నాయి. కనుబొమ్మలు వరుసా వాయీ లేకుండా పెరిగున్నాయి. బక్కపల్చగా ఉన్నా బలంగా ఉన్నాడు.

అతనిని చూసి పళ్ళునూరాడు వాస్తు భూషణం.

"ఎవరు మీరు?" అడిగాడు వెంకట్రావు.

"ఆఁ.. ఎంత మదం ఎంత కావరం? ఎంత అహంకారం" ఆగ్రహంగా అన్నాడా వ్యక్తి.

"విచిత్రంగా ఉందే.. ఈ శతాబ్దంలో ఇలాంటి పేర్లా? ఇంతకూ ఈ మూడింట్లో మీ అసలు పేరేంటి" అయోమయంగా అడిగాడు వెంకట్రావు.

"ఓరా దురహంకారీ... మాతోనే పరాచికాలా! మాకు ఆగ్రహం వస్తున్నది." తీవ్ర స్వరంతో అన్నాడా వ్యక్తి.

అతని కోపం చూసి సుందరి, వెంకట్రావు భయపడ్డారు.

"క్షమించండి స్వామీ ఏదో బ్రహ్మ విష్ణు మహేశ్వరులైతే.... వాళ్ళ ఆకారాలు చూశాం కాబట్టి వెంటనే గుర్తు పట్టగలం. కానీ మీరు.... మనిషా.. దేవుడా.. మనుషుల్లో దేవుడా.. ఏదైనా పీఠాధిపతా... క్షమించండి... ఇంతకు ముందు తమరినెక్కడా చూసినట్టు గుర్తు లేదు.. అందుకే అడుగుతున్నాం..." చేతులు జోడించి అడిగారు ఇద్దరూ.



"సరే.. క్షమించాం. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన జ్యోతిష, సాముద్రిక, నాడీశాస్త్ర, భాషా శాస్త్ర, సర్వశాస్త్ర, వాస్తుశిరోమంజరి, వాస్తు నవరత్న చింతామణి, వాస్తు దైవ చూడామణి, వాస్తు విభూషణాచార్యులను నేనే..." అన్నాడు గంభీర స్వరంతో.

"అలాగా... మీరు మా ఇంటికి రావడం... మేము పిలవలేదే..." తడబడుతూ అన్నాడు వెంకట్రావు.

"హు.. సర్వాంతర్యామిని. నన్ను ఒకరు పిలిచేదేంటి? ఎక్కడ వాస్తుపురుషునికి అన్యాయం జరుగుతుందో, ఎక్కడ వాస్తు పురుషుడు అవమానించబడుతాడో అక్కడ నేను ప్రత్యక్షమౌతాను. నా సెవెన్త్ సెన్స్ నన్ను సదా హెచ్చరిస్తుంటూనే ఉంటుంది."

"వాస్తు పురుషుడికి అన్యాయమా? ఎప్పుడు, ఎక్కడ, ఎలా?" ఆశ్చర్యంగా అడిగాడు వెంకట్రావు.

"అవును... అక్షరాలా వాస్తుపురుషుడికి అన్యాయమే జరుగుతున్నది. అది సహింపలేకే హిమాలయాలకు తపస్సుకని బయలుదేరి కూడా మా శరీరం ఇటు మళ్ళింది..."

"ఇంతకూ మీరు చెప్పిన ఆ అన్యాయం ఎక్కడ....?"

"ఎక్కడో ఏంటి... ఇక్కడే.. మీ ఇంట్లోనే.. ఈ అజ్ఞాని కారణంగానే.." వాస్తుభూషణాన్ని చూపిస్తూ అన్నాడతను.

వాస్తుభూషణం ముఖం నల్లబడింది. సుందరి, వెంకట్రావులు విస్తుపోయారు అతడి మాటలకు.

"ఏ విధంగా?" అడిగాడు వెంకట్రావు.

"ముందు మీరు లోపలకు రండి కుర్చీలో కూర్చొండి." అన్నది సుందరి కుర్చీ చూపిస్తూ.

"ధిక్... వాస్తు ధిక్కారం చేసిన కుర్చీలో మేము కూర్చోజాలము" కోపంగా అన్నాడు వా.వి.చా.

"కుర్చీ వాస్తుధిక్కారం చేసిందా? నాకు అర్థం కావడం లేదు." అయోమయంగా అన్నాడు వెంకట్రావు.

"అజ్ఞానులకు అర్థం కాదు. ఈ కుర్చీలో కూర్చున్నవాడు కూర్చున్నట్లే టపా కడతాడు. కనుక




మేము ఈ కుర్చీలో కూర్చోము. ఇలాగే నించుంటాము."

"అయ్యో.. అలా ఎంత సేపు నిలుచుంటారు? పోనీ ఈ సోఫాలో ఆశీనులుకండి."

"అజ్ఞాని.. హిమాలయాలలో ఒంటికాలు మీద పన్నెండు సంవత్సరములు తపము చేసిన వారము. రెండు కాళ్ళమీద నిలబడటం మాకు బ్రహ్మ విద్యేమీ కాదు."

"సంతోషం ఇంతకూ మీరేం చెప్పదలిచారు?"

"ఈతడు చెబుతున్న మార్పులన్నీ అబద్ధాలు, డంబాచారాలు." తీవ్ర కంఠస్వరంతో అన్నాడు వా.వి.చా.

"అతను చెప్పేది అబద్ధం, నమ్మకండి" అన్నాడు వాస్తుభూషణం కోపంగా.

"అవును నమ్మకండి అతడిని. అతడి మాటలు వింటే ఇలా పోతారు. అతడి చెప్పినట్లు వంటింట్లో ప్లాట్‌ఫామ్ ఎత్తు పెంచితే సుందరి గారికి చర్మవ్యాధి కలిగి చర్మం అక్కడక్కడా ఊడిపోయి కురూపిలా తయారౌతారు." అన్నాడు వా.వి.చా.

"భయమేసింది సుందరికి. తన శరీరంపై చర్మం ఊడిపోయి తెల్లని మాంసభాగం కనపడుతూ వణుకుతూ బజార్లో నడుస్తుంటే అందరూ తనను చూసి భయపడి పారి పోతున్నట్లు మనసులో దృశ్యం మెదలి కెవ్వున కేక పెట్టింది.

"వద్దు.. వద్దు.. ఎత్తు పెంచం గాక పెంచం." అరిచింది.

వాస్తుభూషణం అందుకున్నాడు.

"వెంకట్రావు గారూ నా మాట వినండి, ఆ ప్లాట్‌ఫామ్ ఎత్తు పెంచకపోతే ఆఫీసులో జీతం తీసుకుని ఇంటికి వస్తుంటే సిటీ బస్సులో ఎవడో ఒకడు మీ జేబు కత్తిరించి పర్సు కాజేస్తాడు. లేదా జేబులో దోపుకునేటపుడే పర్సు జారి కింద పడుతుంది. దాన్ని మీరు గమనించరు. ఆ నెలంతా మీరు అప్పుల పాలౌతారు." హెచ్చరించాడు.

వెంకట్రావు విలవిలలాడాడు. ఇంటికి రాగానే సుందరిని పిలిచి రెండు ముద్దులు పెట్టి జీతం మొత్తం ఇద్దామని జేబులో చెయ్యి పెట్టంగానే ఖాళీగా ఉన్నట్లు దేభ్యం మొహం వేసుకుని పర్సు కొట్టేశారని సుందరికి చెప్పినా నమ్మకుండా ఏ లాడ్జింగ్‌కో వెళ్ళి భోగం దానికి సర్వం సమర్పించి తన దగ్గర నాటకాలాడుతున్నట్లు తిట్టిపోసిన దృశ్యం సాక్షాత్కరించింది.

"నో నో.. పెంచుతాను. పెంచి తీరుతాను." అరిచాడు.

"వెంకట్రావుగారూ. లెట్రిన్లు ఆగ్నేయమూల ఉండకూడదని రూలేం లేదు అసలక్కడే ఉండాలి. అవి పడగొట్టిస్తే సుందరిగారికి అగ్ని ప్రమాదం జరిగి ముఖమంతా కాలిపోయి అద్దంలో చూసుకున్నపుడల్లా తన రూపానికి తనే భయపడి కేకలు పెడుతుంటారు." అన్నాడు వా.వి.చా.

సుందరి నరాలు వణికాయి. స్టౌ ముందు తున్నపుడు చీర కొంగుకు మంట అంటుకుని వళ్ళంతా కాలిపోయినట్లు, ముఖమంతా కాలి చర్మం అట్టలు కట్టినట్లు, బొట్టు పెట్టుకుందామని అద్దం ముందు నిలుచోగానే భయపడి కేకలు పెట్టినట్లు ఓ దృశ్యం కనిపించి 'నో' అని అరిచింది.

**-(ఇంకావుంది)**

మార్చి 30 ఆనంద్ బక్షీ వర్ధంతి సందర్భంగా

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : మిలన్
రచన : ఆనంద్ బక్షీ
సంగీతం : లక్ష్మీకాంత్-ప్యారేలాల్
అభినయం : సునీల్‌దత్, నూతన్, జమున, దేవేన్‌వర్మ తదితరులు

గానం : ముకేశ్,లతామంగేష్కర్

అ: సావన్ కా మహీనా, పవన్ కరే సోర్
ఆ: సావన్ కా మహీనా, పవన్ కరే షోర్
అ: పవన్ కరే సోర్
ఆ: పవన్ కరే షోర్
అ: అరె బాబా, షోర్ నహీఁ. సోర్ సోర్
ఆ: పవన్ కరే సోర్
అ: హాఁ జియరారే ఝూమే ఐసే జైసే బన్ మా నాచే మోర్ ॥సావన్ కా మహీనా॥
ఆ: మౌజ్‌వా కరే క్యా దేఖో హమ్‌కో ఇసారా
అ: జానా కహాఁ హై పూఛే నదియా కీ ధారా
ఆ: మర్‌జీ హై తుమ్హారీ లే జావో జిస్ ఓర్
జియరారే ఝూమే ఐసే జైసే బన్ మా నాచే మోర్ ॥సావన్ కా మహీనా॥
అ: రామా గజబ్ ఢాయే యే పుర్‌వైయా
ఆ: నైయా సంభాలో కిత్ ఖోయే హో ఖివైయా
అ: పుర్‌వైయా కే ఆగే చలే న కోయీ జోర్
జియరారే ఝూమే ఐసే జైసే బన్ మా నాచే మోర్ ॥సావన్ కా మహీనా॥
ఆ: జిన్‌కే బలమ్ బైరీ గయే హైఁ బిదేస్‌వా
ఆయీ హై లేకే ఉన్‌కే ప్యార్ కా సందేస్‌వా
కారీ మత్‌వారీ ఘటాయేఁ ఘన్‌ఘోర్
జియరారే ఝూమేరే ఐసేరే జైసే బన్ మా నాచే మోర్ ॥సావన్ కా మహీనా॥



ఆనంద్ బక్షీని పరిచయం చేయబూనటం సూర్యుడికి దివిటీ చూపినట్టే. ఆయన గురించి తెలియని తెలుగువారికి ఆయన గురించి చెప్పాలంటే వేటూరిపై ఈ టీవీవారు రూపొందించిన 'ఝుమ్మంది నాదం' కార్యక్రమంలో వేటూరి గురించి శ్రీదేవి "ఆయనను బొంబాయ్‌లో ఆంధ్రా బక్షీ అని పిలుస్తారు" అని చెప్పిన మాట చాలు.

అత్యున్నత ప్రమాణాలతో పండితపామర జనరంజకంగా పాటలు వ్రాసిన ఆనంద్ బక్షీ 2002 మార్చి 30న మరణించారు. ఆయన మరణానంతరం విడుదలైన 'ముఝ్‌సే దోస్తీ కరోగే!'(2002) ,'ద హీరో'(2003) చిత్రాలలోని ఆయన పాటలు ప్రజాదరణ పొందాయి. దీన్ని బట్టి ఆయన నేటి తరానికి కూడా అనువుగా పాటలు రాశారని అర్థమవుతుంది.

తాను పాటలు రాసే చిత్రానికి అన్ని పాటలూ తానే రాయాలని ఒక నియమం పెట్టుకున్నారు ఆనంద్ బక్షీ. అలా అయితే అన్ని సందర్భాలకు మంచి అవగాహనతో ఒకే శైలిలో రాయవచ్చని ఆయన అభిప్రాయం. ఆ నియమాన్ని సడలించిన సందర్భాలు ఉన్నాయి. అదేమిటని అడిగితే "నా ఇష్టం" అన్న అభిమానవంతుడాయన.

'మూగమనసులు' చిత్రాన్ని హిందీలో 'మిలన్' (కలయిక) గా రూపొందించినపుడు ఆనంద్ బక్షీని గీతరచయితగా ఎంచుకున్నారు. స్వరబ్రహ్మ కె.వి. మహదేవన్ మలచిన 'మూగమనసులు' పాటలు ఎంత ప్రజాదరణ పొందాయో అందరికీ తెలిసినదే. లక్ష్మి-ప్యారే సంగీత దర్శకత్వంలో 'మిలన్' పాటలూ సూపర్ హిట్ అయ్యాయి. ముఖ్యంగా ఆత్రేయ వ్రాసిన పాటలలోని సారాన్ని తీసుకుని స్వతంత్రంగా పాటలు వ్రాసి ఆనంద్ బక్షీ తానేమిటో నిరూపించుకున్నారు. ఆత్రేయ వ్రాసిన సందర్భాలకు ఆనంద్ బక్షీ వ్రాసిన పాటలు పరిశీలిద్దాం. 'హాసం' 49వ సంచికలో 'మూగమనసులు' పాటల పుస్తకం ఈ పరిశీలనకు ఉపకరిస్తుంది.

జానపద పాటల పోటీకి గోపీ వద్ద రాధ నేర్చుకుని పాడే పాట'నా పాట నీ నోట పలకాల సిలకా'. ఇదే సందర్భానికి హిందీ పాట 'సావన్ కా మహీనా'. సావన్ అంటే శ్రావణం. మహీనా అంటే మాసం. శ్రావణం మాసం వర్షాలు బాగా పడతాయి. అందుకే హిందీలో సావన్ అనే పదాన్ని వర్షానికి పర్యాయ పదంగా వాడతారు. షోర్ అంటే రొద, గొడవ. జియరా అంటే మనసు. ఝూమ్‌నా అంటే నాట్యం చేయటం. బన్ అంటే వనం. మోర్ అంటే నెమలి. పల్లవిని స్థూలంగా ఈ క్రింది విధంగా అనువదించవచ్చు.

అ: 'వానాకాలం వచ్చె, గాలి రొద సేసె',
ఆ: 'వానాకాలం వచ్చె, గాలి రొద చేసె'.
అ: 'గాలి రొద సేసె'
ఆ: 'గాలి రొద సేసె'
అ: 'ఎహె చేసే కాదు, సేసె.., సేసె...'
ఆ: 'గాలి రొద సేసె'
అ: 'ఆఁ! అడవిలో నెమలికి మల్లే ఆడింది నా మనసే!

జానపదగీతాలలో ఉండే యాసను తెలుగులో 'సిలకా' పదంతో చెబితే "హిందీ"లో 'సోర్' పదంతో చెప్పారు.రెండూ జానపదగీతాలే అయినా కథాపరంగా కొంత విషయాన్ని తెలిపేవే. అయితే పల్లవిలో తెలుగు పాటలో వివరించిన ప్రేమబంధం హిందీ పల్లవిలో లేదు. పడవ నడిపే వాడు నీటిని, గాలినే నమ్ముకుంటాడు. వానాకాలంలో గాలిహోరు చూసి అతని మనసు

మేఘాలు చూసి ఆడే నెమలిలా పురివిప్పి ఆడింది.

మౌజ్ అంటే అల. ఏదైనా ముద్దుగా చెప్పాలంటే 'వా' చేరుస్తారు. ఇసారా (ఇషారా) అంటే సైగ. మర్‌జీ అంటే ఇష్టం. 'తుమ్హారీ మర్‌జీ' అంటే 'నీ ఇష్టం' అని. ఓర్ అంటే దిక్కు. 'నదియా కీ ధారా' అంటే నది ధార.

**ఆ: అలలు సూడు మనకు ఏదో సైగ సేసాయి**
**అ: దారి ఎటేపని గోదారి ఉరకలడిగాయి**
**ఆ: నీ ఇష్టమేలే ఇక, ఏ ఒడ్డు చేర్చినా సరే**
**అడవిలో నెమలికి మల్లే ఆడింది నా మనసే!**

నది అలలు ఏదో సైగ చేస్తున్నట్టుంటాయి. ఆ సైగ అర్థం 'ఎక్కడికి తీసుకు వెళ్ళాలని' అడగటమే. ఆ ప్రశ్నకు అతను ఎటు తీసుకువెళితే అటే వస్తానని ఆమె ఆమె సమాధానం ఇచ్చింది.

'గజబ్ ఢానా'అంటే అబ్బురపరచటం, ఉక్కిరిబిక్కిరి చేయటం. పుర్ వయ్యా(పుర్‌వాయీ) అంటే గాలి. నైయా అంటే నావ. ఖివైయా అంటే పడవ నడిపేవాడు, నావికుడు, జోర్ అంటే బలం.

**అ: అయ్యోరామా ఈ గాలి మహా జోరుగుందే!**
**ఆ: నావ జాగర్తయ్యా కళాసీ, నీ మనసెక్కడికో పోయిందే!**
**అ: ఈ హోరుగాలి దగ్గర ఎవరి ఆటలు సాగేను**
**అడవిలో నెమలికి మల్లే ఆడింది నా మనసే!**



గాలిజోరు చూసి అతను అబ్బుర పడుతుంటే ఆమె అతన్ని నావ సంగతి చూడమని హెచ్చరిస్తుంది. అతనేమో ఈ గాలి ముందు ఎంత బలమైనా చెల్లదు కాబట్టి గాలికి తలవంచటమే మేలంటున్నాడు. మనం మన జీవితాన్ని పూర్తిగా మన అదుపులో పెట్టుకోవాలని ఎంత ప్రయత్నించినా విధి ముందు తలవంచక తప్పదనే నిగూఢార్థం ఉందిక్కడ.

బలమ్ అంటే ప్రియుడు. బైరీ అంటే వైరి, పగవాడు, బిదేస్‌వా అంటే విదేశం. కారీ అంటే 'కాలీ'కి మాండలిక రూపం. మత్‌వారీ అంటే హాయిగా,స్వేచ్ఛగా ఉండేది. ఘటా అంటే మేఘం, మొయిలు. ఘన్ ఘోర్ అంటే దట్టమైనది.

**ఆ: చెలికాడే పగవాడయి పరదేశమెళితే**
**ఆతడి వలపు సందేశమే మోసుకొని వచ్చె**
**ఒత్తయిన వయారి కారుమేఘం**
**అడవిలో నెమలికి మల్లే ఆడింది నా మనసే!**

వలచినవాడు పగవాడిలా ఆమెను వదిలి పరదేశం వెళితే మేఘాలు అతని ప్రేమ సందేశాన్ని మోసుకొని తెస్తాయట. విరహాన్ని వివరించే కవుల పై కాళిదాసు 'మేఘదూతం' ప్రభావం చాలా ఉందని ఈ పాటకూడా నిరూపిస్తుంది.

తెలుగు పాటలో 'నీటిలో నేను నీడనె సూడాల' అంటూ జన్మాంతర బంధానికి ఉపమానంగా ప్రతిబింబాలను వాడారు. అయినా అది సరళమైన జానపదగీతంలోనే అనిపిస్తుంది. హిందీలో జన్మాంతర బంధాన్ని ప్రస్తావించలేదు. 'ఎటు తీసుకెళ్ళినా సరే ' అంటూ అతనిపై పూర్తి నమ్మకం పెట్టుకుని తన జీవితాన్ని జాగ్రత్తగా నడపమని ఆమె అంటే 'మన చేతుల్లో ఏమీ లేదు' అని అతను ముందుముందు జరగబోయే సంఘటనలను సూచించాడు. 'గోదారి ఉరకాల' అనే భావం 'నదియా కీ ధార'గా చెప్పారు.

మొత్తానికి తెలుగు పాటలో వారి బంధానికి పెద్దపీట వేస్తే హిందీలో వారి అనిశ్చితికి ప్రాధాన్యం ఇచ్చి తనదైన బాటలో నడిచారు, బక్షీ.

గానం : ముకేశ్

**ముబారక్ హో తుమ్‌కో సమా యే సుహానా**
**మైఁ ఖుష్ హూఁ, మేరే ఆఁసువోం పే నా జానా**
**మైఁ తో దీవానా దీవానా దీవానా (2)**
**హజారోఁ తరహ్ కే యే హోతే హైఁ ఆఁ సూ**
**అగర్ దిల్ మేఁ గమ్ హోతో రోతే హైఁ ఆఁసూ**
**ఖుషీ మేఁ భీ ఆంఖేఁ భిగోతే హైఁ ఆఁసూ**
**ఇన్హేఁ జాన్ సక్‌తా నహీఁ యే జమానా ॥మైఁ ఖుష్‌హూఁ॥**
**యే శహనాయియాఁ దే రహీ హైఁ దుహాయీ**
**కోయీ చీజ్ అప్‌నీ హుయీ హై పరాయీ**
**కిసీ సే మిలన్ హై కిసీ సే జదాయీ**
**నయే రిశ్తోఁనే తోడా నాతా పురానా ॥మైఁ ఖుష్ హూఁ॥**



రాధకు వేరొకరితో పెళ్ళి జరిగినపుడు గోపి పాడే పాట 'ముద్దబంతి పూవులో' ఈ సన్నివేశంలో హిందీ పాట, 'ముబారక్ హో తుమ్‌కో' ; ఈ పాట స్వేచ్ఛానువాదం ఇది;

ముబారక్ అంటే అభినందన. సమా అంటే వేళ. సుహానా అంటే ఆహ్లాదమైనది. 'ఆఁసువోంపే న జానా' అంటే 'నా కన్నీళ్ళు చూసి మోసపోవద్దు' అని. దీవానా అంటే ప్రేమ పిచ్చివాడు.

**'శుభం కలగాలందరికీ ఈ చల్లని వేళ**
**నాకు ఆనందమే, నా కన్నీళ్ళు ఒట్టివే**
**వెర్రివాడిని, వెర్రివాడిని, వెర్రివాడిని నేను,**

ఆత్రేయగారు ఎంతో భావుకంగా 'మూగకళ్ళ ఊసులో' అని అతని మూగవేదన గురించి చెబితే హిందీలో తన కన్నీళ్ళు కూడా దాచు కోలేకపోయాడు నాయకుడు. నిజానికి రాధ, గోపిలకు తమ మనసుల్లోని ఆ మూగ బాధేమిటో తెలియదు. తన'పాలగుండెలో ఏది దాగుందో' తన క్కూడా తెలియని గోపి తెలుగుపాటలో కనిపిస్తాడు. హిందీలో బాహాటంగా కన్నీళ్ళు కారుస్తూ తెలివి మీరిన గోపి కనిపిస్తాడు. హిందీ చిత్రానికి కూడా దర్శకత్వం వహించిన ఆదుర్తి. సుబ్బారావుగారు తెలుగు పాటకు దీటుగా వ్రాయలేదో అంతుబట్టదు. పైగా నాయకుడు'వెర్రివాడిని' అంటాడు. ఆ వెర్రి ఏమిటో,తన కన్నీళ్ళకు సంజాయిషీగా వెర్రివాడినని చెబితే జనం ఏమని అర్థం చేసుకోవాలో తెలియదు.

'హజారోం తరహ్ కే' అంటే వేల రకాలు. గమ్ అంటే బాధ. భిగోనా అంటే తడవటం. జమానా అంటే లోకం.

**వేనవేల రకాలు కన్నీళ్ళు**
**మదిలో బాధ మెదిలితే కురిసేను కన్నీళ్ళు**
**ఆనందంలోనూ కళ్ళు తడిపేను కన్నీళ్ళు**
**ఈ లోకానికి అర్థం కావులే ఇవన్నీ**

నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి అని ఆత్రేయగారు మనసు తీరును క్లుప్తంగా విశ్లేషిస్తే హిందీలో ఆ మాటను అవసరానికి మించి విశదీకరించి

నాయకుడు తన కన్నీళ్ళను సమర్థించుకున్నట్టు అనిపిస్తుంది. మనసులో ఏముందో కన్నీళ్ళను చూసి చెప్పలేమని తెలుగులో అంటే 'నా కన్నీళ్ళను ఇలా అర్థం చేసుకోండి' అని చెప్పాడు హిందీ నాయకుడు. తెలుగు పాటలోని గాఢత హిందీలో పలచబడిపోయింది.

శహనాయీ అంటే సన్నాయిలు. దుహాయీ అంటే ఘోష అనుకోవచ్చు . చీజ్ అంటే వస్తువు. జుదాయీ అంటే ఎడబాటు. రిష్తా అన్నా, నాతా అన్నా బంధం. పురానా అంటే పాతది.

ఈ సన్నాయిలు ఘోషిస్తున్నాయి
సొంతమైనదేదో పరాయిసొత్తయిందని
కలయిక ఒకరికి, ఎడబాటొకరికి
కొత్త బంధాలు వచ్చి తెంచాయి పాత బంధాన్ని'

ఈ చరణంలో మరీ సూటిగా తనదైనదేదో దూరమవుతున్నట్టు ఆమె పెళ్ళి మంటపంలో పాడుతున్నాడు అతను. ఇంత సూటిగా చెబితేగాని ప్రేక్షకులకు వారి బంధం అర్థం కాదనుకున్నారేమో. తెలుగుపాటలోని మిస్టిసిజం కొనితెచ్చుకున్నది కాదు. అసలు ఆ కథకు అదే ఆయువుపట్టు. హిందీ పాటలో ఆ మిస్టిసిజం లేదు.

తెలుగు పాటలో ఉన్న 'ఎనక జనమ' ప్రస్తావన ఈ పాటలోనూ లేదు. కానీ ఆత్రేయ వ్రాసిన 'నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి' అనే వాక్య ప్రభావం ఈ పాటపై చాలా కనిపిస్తుంది. పల్లవిలోనూ, మొదటి చరణంలోనూ కన్నీళ్ళ ప్రస్తావనే కనిపిస్తుంది. ' ఏ కన్నీటెనకాల ఏముందో తెలుసునా' అనే భావం 'ఈ లోకం కన్నీటి అర్థాలను తెలుసుకోలేదు' అని చెప్పారు.

తెలుగు పాటలో అతను తానిచ్చిన ముద్దబంతి పువ్వుల మర్మాలు, తన మూగమనసులోని ఊసులు ఆమెకు తెలుసో లేదో అని ఆవేదన పడితే హిందీ పాటలో కాస్త సూటిగా ఆమె పరాయిదయిందని,తమ బంధం తెగిపోయిందని బాధ పడుతున్నాడు. తెలుగులో నర్మగర్భంగా చెప్పిన విషయం హిందీలో సూటిగా చెప్పటంతో వేదాంత భావం ఎక్కువగా ధ్వనించదు.

గానం : ముకేశ్

రామ్ కరే ఐసా హో జాయే,
మేరీ నిందియా తోహె మిల్ జాయె
మై జాగూఁ తూ సోజాయే (2)
స్వపన్ చలా ఆయె కొయీ చోరీ-చోరీ
మస్త్ పవన్ గాయే లోరీ
చంద్ర కిరన్ బన్ కే డోరీ
తేరే మన్‌కో ఝూలా ఝులాయే ॥మేరీ నిందియా॥
గుజర్ జాయె సఖ్‌సే తెరీ దుఃఖ్ భరీ రతియాఁ
బదల్ లూఁ మైఁ తోసే అఖియాఁ
మాంగూఁ దువాయేఁ హాథ్ ఉఠాయే ॥మేరీ నిందియా॥
మై హీ నహీఁ తూ హీ నహీఁ
సారా జమానా దర్ద్ కా హై ఎక్ ఫసానా
ఆదమీ హో జాయె దివానా
యాద్ కరే గర్ భూల్ న జాయే ॥మేరీ నిందియా॥



రాధ వైధవ్యంతో పుట్టిల్లు చేరి కుమిలిపోతూ నిదుర కరవై ఉండగా గోపి పాడే జోలపాట'పాడుతా తీయగా చల్లగా'; ఈ సందర్భంలో హిందీ పాట 'రామ్ కరే ఐసా హోజాయె; ఈ పాట స్వేచ్ఛానువాదం ఇదీ;

నిందియా అంటే 'నీంద్'కు మాండలిక రూపం. అలాగే రతియాఁ (రాతేఁ), అఖియాఁ (ఆంఖేఁ), బతియాఁ (బాతేఁ) కూడా. తోహె అంటే తుఝే. నీకు అని అర్థం.

ఆ రాముడు చల్లగ చూడాలి
నా కంటి నిదురే నీకు చేరాలి
నే మేలుకోవాలి, నువు నిదురించాలి

చోరీ- చోరీ అంటే 'సడి చేయకుండా' అని. లోరీ అంటే జోలపాట. డోరీ అంటే తాడు. ఝూలా అంటే ఊయాల.

చెప్పా పెట్టకుండా, సడి సేయకుండా
కలయేదో కన్నుల్లోకి రావాలి
జోలపాడాలి హాయిగొలిపే చల్లని గాలి
జాబిలి కిరణాలే ఊయలగొలుసులై
ఉయ్యాల లూపాలి నీ మనసును ॥నా నిదుర॥

మనసునకు కష్టం కలిగించని కల అనే భావంతో తెలుగు పాటలో 'తీపికల' అంటే హిందీలో 'సడిచేయని కల' అన్నారు. రెండూ ఆహ్లాదమైనవే కదా! చల్లని గాలి, జాబిలి ఆమెను నిదురపుచ్చాలి అని లలితమైన భావాలు పొందుపరిచారు. 'గుజర్ జాయే' అంటే వెళ్ళిపోవాలి అని. బదల్‌నా అంటే మార్చు కోవటం. 'బస్ మేఁ హోనా' అంటే 'మన చేతుల్లో ఉంటే' అని. దువా అంటే ప్రార్థన.

వెత నిండిన నీ రాతిర్లు
చల్లగా గడిచి పోవాలి
కనులు మార్చడమే సాధ్యమైతే
చేతులెత్తి దేవుణ్ణి వేడుకుంటాను
నా కనులు నీకిచ్చేస్తాను
నిదురరాని నీ కనులు నే తీసుకుంటాను ॥నా నిదుర॥

వెత నిండిన రాతిర్లు కరిగిపోవాలని, సాధ్య మైతే తన కనులు ఆమెకిచ్చి ఆమెకు నిదుర అంది స్తానని అంటున్నాడు. ఇలా జరగాలని దేవుణ్ని వేడుకుంటున్నాడు. తెలుగుపాటలో 'పోయి నోళ్ళ'ను తలచుకుని బాధపడవద్దనే సూచన ఉంది. హిందీపాటలో బాధ తీరిపోవాలనే భావం మాత్రమే ఉంది.

దర్ద్ అంటే బాధ. ఫసానా అంటే కథ. యాద్ కర్‌నా అంటే గుర్తు చేసుకోవటం. భూల్‌నా అంటే మరచిపోవటం.

నువ్వే కాదు, నేనే కాదు
ఈ లోకమే ఓ వెత నిండిన కత
మరుపన్నదే లేక కుమిలిపోతే
కాడా మనిషి పిచ్చివాడు

ఈ లోకంలో అందరూ ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక బాధ అనుభవించినవారే. ఆ బాధను తలచుకుంటూ ఉంటే సుఖం ఉండదు. బాధ ను మరచి సాగిపోవటమే ఉత్తమమని చెబుతున్నాడు.

ఆమె బాధను చూడలేక ఆమెకు నిదుర ప్రసాదించమని దేవుణ్ణి వేడుకుంటున్నాడు. కలల కలిమి కూడ దోచుకునే దొరలు ఎందుకు అని పదే పదే ఆమెకు తన దురదృష్టాన్ని గుర్తుచేసే లోకులను ఛీ కొట్టారు తెలుగు పాటలో.

హిందీ పాటలో మరపు అనేది మన చేతిలో ఉందని, వెతలు మరచిపోవటం ఉత్తమమని చెప్పారు. తెలుగులో 'పోయినోళ్ళు అందరూ మంచోళ్ళు' 'మణిసి పోతే మాత్రమేమి మనసు ఉంటది' అని పోయినవారి గురించి బాధపడవద్దని చెప్పారు ఆత్రేయ. హిందీలో ఆ ప్రస్తావన లేదు. తన కనులు ఆమెకిచ్చి ఆమె ప్రశాంతంగా నిదురపోయేలా చేయమని దేవుణ్ణి వేడుకుంటున్నాడు.

తెలుగులో 'జనమ జనమకది మరీ గట్టిపడితది',అని మనసుల బంధం గురించి చెప్పారు. బహుశా ఆనంద్ బక్షీ నాయకుల మలిజన్మలోనే ఆ ప్రస్తావన తేవాలనుకున్నారేమో -'హమ్ తుమ్ యుగ్ యుగ్ సే' (తెలుగులో 'ఈ నాటి ఈ బంధమేనాటిదో') పాటలో వారి జన్మజన్మల బంధాన్ని అద్భుతంగా చెప్పారు.

ఎల్.వి.ప్రసాద్ నిర్మించిన 'మిలన్' చిత్రం 9 ఫిలింఫేర్ అవార్డులకు నామినేట్ అయి మూడు అవార్డులు గెలుచుకుంది. ఉత్తమ నటి(నూతన్),ఉత్తమ సహాయనటి(జమున) తో పాటు ఉత్తమ సంగీతం (లక్ష్మీకాంత్ - ప్యారేలాల్) అవార్డు గెలుచుకుంది.

- పి.వి.సత్యనారాయణ రాజు


శ్రీ తుళజా భవాని క్రియేషన్స్
అట్లూరి పూర్ణచంద్రరావు సమర్పించు
శ్రీను..వాసంతి..లక్ష్మి...
నిర్మాత : ఎన్.యమ్. సురేష్ స్క్రీన్ ప్లే - దర్శకత్వం : ఇ. శ్రీనివాస్
సంగీతం : ఆర్.పి. పట్నాయక్ పాటలు : కులశేఖర్ కెమెరా : సోమన్ ఎడిటింగ్: కోటగిరి వెంకటేశ్వరరావు
పాటల ప్రత్యేకం

రచన: కులశేఖర్ (1) గానం : ఆర్.పి. అండ్ గ్రూప్

ప: కుకుకూ కుకుకూ కుకుకూకూ
తొలిరాగం నేర్పింది ఈ పలుకూ....
కుకుకూ కుకుకూ కుకుకూకూ.....
నవలోకం చూపింది ఈ పిలుపూ...
చిగురాకుల సవ్వడి ఐనా...చిరుగాలి తాకినా...
గుడిగంటల సందడి విన్నా...నాలో ...ఏదో మైమరపూ
కుకుకూ ..... కుకుకూ... కుకుకుకూ
తొలిరాగం నేర్పింది ఈ పలుకూ
చ: కుశములెన్నో అడిగినదీ కులికే గోదావరీ...
పులకలు నాలో చిలికినదీ ఎగసే ఈ లాహిరి....
కరిమబ్బునే మహముద్దుగా
ఎదముందుకుతెచ్చెనుగాలీ....
తడికన్నుల్లో సిరివెన్నెల్లే కురిపించెను జాబిలీ..
కుకుకూ కుకుకూ కుకుకూకూ
తొలిరాగం నేర్పింది ఈ పలుకూ....
కుకుకూ కుకుకూ కుకుకూకూ.....
నవలోకం చూపింది ఈ పిలుపూ...
చ: అడుగులు తానై నడిపినదీ ....పుడమే ఓ దారినీ...
పదములు పాడీ పంచినదీ... ఒడిలో ఓదార్పునీ...
ఋణమన్నదే యిక తీరదే ... నా ప్రాణములిచ్చిన గానీ...
నేల తల్లికే నేను యివ్వనా... ఈ గీతాంజలీ..
కుకుకూ కుకుకూ కుకుకూకూ
తొలిరాగం నేర్పింది ఈ పలుకూ.... ॥కుకుకూ॥



రచన: కులశేఖర్ (3) గానం : ఆర్.పి.

పల్లవి: కోదండ రాముణ్ణి చూడు...కోరింది యిచ్చేటివాడు
ఆ సుందరాంగుణ్ణి చూడు.... మా తల్లి సీతమ్మ జోడు
అందాలన్ని చూడకళ్ళు చాలకుంటె
నా మనసుతో చూడు చూడయ్యో.....
ఆ రూపం అపురూపం నిలపాలోయ్ గుండెలోపలా...
ఆ దైవం మనకోసం వెలిశాడోయ్ నేలపై యిలా... ॥కోదండ॥
చరణం: శ్రీరాముని చిరునవ్వుగ వెలుగొందిన సీత...
ఆ దేవుని వెనకాతలె వనికేగెను మాత....
లంకేశుడు బెదిరించెను పలుమాయల చేత...
బెంబేలున మూర్ఛిల్లెను అయ్యో మన సీత...
ఆ బాధే నాలో పాటై పాడేను రామాయణం.....॥కోదండ॥
చరణం: హనుమంతుడు వివరించెను సీతాసతి జాడ....
శ్రీరాముడు వదిలించెను లంకేశుని చీడ...
పరనిందకు శీలమ్మును శంకించుట చేత....
పెనుమంటలలో దూకి పునీత అయ్యె సీత.....
ఆ గాథే నాలో పాటై పాడేనూ రామాయణం.. ॥కోదండ॥

రచన: కులశేఖర్ (2) గానం : నిహాల్ అండ్ ఆర్.పి.

నిహాల్: పాడనా శిలను కరిగించు గీతం
పరమేశ్వరుడే యిలకేతెంచి
పులకించి నర్తించు నవ నాట్యవేదం....
ఆర్.పి: పాడనా మదిని మురిపించు గీతం..
స్వరమాధురిలో మనసే నెమలై
పురివిప్పి ఆడేటి ఆనంద గీతం...
నిహాల్: నారద ప్రణిపాతం స్వర భారతి పదపీఠం
ఓంకార నాదాల నిగమార్థసారం.... సంగీతం...
ఆర్.పి. వెన్నెల జలపాతం మరుమల్లెల మణిదీపం
స్వరరాగ రసయోగ గంగాప్రవాహం...సంగీతం..
నిహాల్: దిగంతాల శ్రుతి సుగంధాలు
వెదజల్లును సంగీతం.... ॥పాడనా...॥
స-నిస-దనిస- మదనిస-
గమ దనిస - సగమ దనిస
సాస్స స్నీన్నిద - నీన్ని దాద్దమ
గసగసని- సనిద నిదమద గమదనిస
తుంబురు వరదానం తుహినాచల పరిధానం
మందార మకరంద మాధుర్యపానం... నా గానం....
ఆర్.పి: తుమ్మెద ఝుంకారం...నా పాటకి శ్రీకారం..
పరువాల పరవళ్ళ సెలయేటి వేగం....నా రాగం....
నిహాల్: కళాభారతికి కశాఘాతమది..
ఏమిర నీ గీతం.... ఆర్.పి.॥పాడనా॥
నిహాల్: నాదబ్రహ్మ గురు త్యాగరాజ కృత
పంచరత్నములకించుమించు సరిసాటియైన
మమ గాన వాహినికి ...
మంజుల మార్దవ మానసగీతికి..
ఊపిరులాడక... స్వరములు తోచక
తికమక పడిపడి...పదములు తడబడి..
శ్రుతి తప్పి మతిపోవు పసివాడవు....
జన్యజనకాల, ధన్యగమకాల
నా మూర్ఛనలకింక మూర్ఛిల్లిపోతావు.....పాడనా...పాడనా..





ఆర్.పి: గలగల పారే సెలయేరమ్మ...సరిగమలంటే నేర్పింది
కిలకిల పాడే ప్రతి గువ్వమ్మ... గమకములంటే చూపింది
అమ్మ పాటలో లాలి లాలన.. చిన్న పాపలో హాయి భావన..
గాలి తరగలో గాన మధురిమ...
పేద వెదురులో ప్రాణ స్పందన..
కడలి అలల కమనీయ కీర్తన...
పుడమి ఎదను చినుకమ్మ నర్తన....
సుప్రభాత సుమ రాగ రంజన ..
సూర్యదేవ కిరణాల దీవెన..
వేద మంత్రముల నాద ఘోషణ...
కాగితాలలో కావ్య వేదన...
గుండె గూటిలో వాయులీనమై....
కంటి పాపలో స్వప్న రాగమై...
గాన పథమ్మున నను నడిపించే .....
జానపదమ్ముల జాను తెలుగు
తొలి పాటతల్లి....నా జోతలందుకొని....
పొంగి పోదా...మదిని మురిపించుగీతం.... పాడనా..

రచన: కులశేఖర్ (4) గానం : మాలతి, సునీల్ ,ఆలీ అండ్ గ్రూప్



ఏయ్ పిల్లాయ్...
ఏటి ?
నువ్వు నాకు నచ్చావ్...
నాకు నా గోపి నచ్చాడు
గోపిగాడా... ఆడెక్కడుంటాడు
ఏఁవో
అమెరిక అన్నాడు
అరెకరఁవమ్మేడు
అడ్డరోడ్డు సంతలో నన్నొదిలి పోయేడు.. ॥అమెరిక॥
తెలిసినోడు...తెలియనోడు..... పడుసోడు,ముసలోడు...
ఉన్నోడు....లేనోడు.....వెంటపడీ నవ్వుతాడు..హాఁ
పిల్లా బాగున్నావంటడూ... అంతనచ్చావా?
పిల్లా ఏవూరు అంటడూ... ఊరుచెప్పేవా?
అమ్మాయి ఏఁపేరు అంటాడు ........ పేరు చెప్పేనా?
అలా ఓ సారి అంటడూ.... చాటుకెళ్ళావా?
అమ్మ దొంగా చాటుకెళ్ళినావా?
అందమంతా అప్పగించినావా? ॥అమ్మదొంగా॥
ఏంటి తెగ మెలికలు తిరిగిపోతున్నావ్
మా గోపి గుర్తొస్తున్నాడు...
అంత గుర్తొచ్చే పనేం చేశాడేంటి...?
మనువని చెప్పాడు మడతలు విప్పాడు
మావిడి తోపులో మంచం వేశాడు ॥మనువని॥
అమ్మతోడు ..అందగాడు..మల్లెలవీ...జల్లినాడు...
దగ్గరగా ...వచ్చినాడు..బుగ్గలవీ.....గిల్లినాడు..హాఁ



అబ్బా మా సెడ్డ గుంటడూ...
మీద కొచ్చాడా?
అమ్మీ ముద్దెట్టమంటడూ....
ముద్దుపెట్టావా?
ఛీ పో సిగ్గంటే ఒగ్గడూ....
పట్టుకున్నాడా?
కుర్రాడే మాత్రం తగ్గడూ...
అంత పనోడా?
కొంటెవాడా కోకలాగినాడా?
సూపుతోటే కాక రేపినాడా? ॥కొంటెవాడా॥
చెట్టంతుంటాడు...చెప్పినదింటాడు...
నలుగురినెప్పుడూ...నవ్విస్తుంటాడు...
కొత్తలుంగీ కట్టినాడు..గళ్ళ బనీనేసినాడు....
మంద గొలుసు పెట్టినాడు..మందులవీ అమ్ముతాడు...
మందులమ్ముతాడా?!
పిల్లా మీ వాడు ఎవ్వరే?
డాక్టరబ్బాయీ..
అబ్బో ఏఁమందులున్నవే?
బోలెడున్నాయీ....
సరే వాడెక్కడున్నడే ?
తెలీదబ్బాయి..
కండపుష్టికి..ధాతుపుష్టికి తిరుగులేని వనమూలికలమ్ముతాం.....
మూలిక వాడండీ...
మూలన పడ్డ మగతన్నాన్ని వెలికి తీయండి...
చీకటి పడితే చాలు చిరుత పులైపోతారు ..
మా మాట నమ్మండి....
గజ్జిగాని దురద గాని తామర గాని
గోక్కోవడానికి గోళ్ళు లేవని బాధపడకండి..
ధనుర్వాతం, పక్షవాతం...
కాళ్ళనొప్పులు, కీళ్ళనొప్పులు, నడుంనొప్పులు, వెన్నునొప్పులు
మెడనొప్పులు, తొడనొప్పులు...
అన్ని నొప్పులకూ ఒకటే మందు..
రూపాయ్ కొడితే ఉంటుంది మీ ముందు..
పెద్దాపురం తైలం...నొప్పులన్నీ మటుమాయం....
అరె..మా గోపి గొంతులా వుందే!?
ఏంటి మీ బావ సందుల్లో మందులమ్ముతాడా?
మరి డాక్టరన్చెప్పి బిల్డప్పిచ్చావ్..
మందులమ్మేవాళ్ళని మా ఊళ్ళో డాక్టరనే అంటారు...
సావమనెదవని
ఆఁ...మందులోడా... ఓరి మాయలోడా...
మాతరేసి మాయ చేసినోవా.... ॥మందు॥

రచన: కులశేఖర్ (5) గానం : ఆర్.పి.అండ్ గ్రూప్

వానా వానా వానా నీలాకాశం లోనా...నీతో చిందేసి ఆడనా...
వానా వానా వానా మేఘాలపన లోనా...నేను ఓ పాట పాడనా...
పన్నీటి పూలతోన....ఊసులాడుకోనా...
పసిపాపలా హరివిల్లునే చెయ్ చాపి అందుకోనా... ॥వానా ॥
వానలోన కాగితాల పడవలేసే చిలిపి ప్రాయం
యింకా గురుతే చిన్నినేస్తం
ఏటిలోన గాలమేసి ఎదురు చూసే మనసు పాపం
మదిలో మెదిలే నాటి బాల్యం....
వాననీటిలో ఆడుకున్న ఈతలూ..
జామతోటలో పాడుకున్న పాటలూ...
మరుపేలేని తియ్యనైన జ్ఞాపకాలు...
వానా వానా వానా......
నింగిలోన మబ్బుకూన అందుకుంది చినుకు రాగం
దాహం కోరే నేల కోసం...
నేలపైన నీటివీణ పల్లవించే మబ్బుకోసం
స్నేహం పంచే పూలగీతం..
కోయిలమ్మతోపాటు కొంటెపాటలూ..
జాబిలమ్మతో ఎన్ని జాముౠత్రులూ.....
మరుపేలేని తియ్యనైన జ్ఞాపకాలు..
వానా వానా వానా ..

రచన: కులశేఖర్ (6) గానం : ఆర్.పి., ఉష అండ్ గ్రూప్

గోదారి నవ్వింది..తుమ్మెదా..
నిండు గోదారి నవ్వింది ...తుమ్మెదా.... ॥గోదారి॥
మా పల్లె నవ్వింది.....తుమ్మెదా..
మల్లె పువ్వుల్లె నవ్వింది ..తుమ్మెదా.. సంబరాల వేళ తుమ్మెదా..
ఊరు సొర్గమయ్యిందమ్మ తుమ్మెదా..
యిన్ని సంతోషాలు నిండు నూరేళ్ళుంటే....
ఎంత బాగుంటుందె తుమ్మెదా.. ॥గోదారి॥
ఆనందమే బ్రహ్మ...తుమ్మెదా...మనిషికానందమే జన్మ...తుమ్మెదా
కోరుకున్నదంత కళ్ళముందు వుంటే ఆనందమే కద... తుమ్మెదా..
ఆకాశమేమంది...తుమ్మెదా... చిటికెడాశుంటే చాలంది..తుమ్మెదా..
అంతులేని ఆశ గొంతు దాటలేక ఎనకపడుతోందమ్మ...తుమ్మెదా..
ఈ నవ్వు తోడుంటె...తుమ్మెదా...
యింక కష్టాలదేఁవుంది తుమ్మెదా... ॥గోదారి॥
గోధూళి వేళల్లో....తుమ్మెదా... ఎద రాగాలు తీసింది... తుమ్మెదా...
కొండ గుండెలోన ..సందె పొద్దు వాలి..ఎంత ముద్దుగుందె.. తుమ్మెదా..
అందాల చిలకమ్మ.... తుమ్మెదా కూని రాగాలు తీసింది... తుమ్మెదా..
కన్నె మూగ ప్రేమ..హాయి పాటల్లోన.. ఊయలూగిందమ్మ.. తుమ్మెదా..
పుణ్యాల నోమంట.....తుమ్మెదా...ఈ లోకాన ఈ జన్మ...తుమ్మెదా...
గోదారి నవ్వింది తుమ్మెదా.....



శ్రీ తుళజా భవాని క్రియేషన్స్
అట్లూరి పూర్ణచంద్రరావు సమర్పించు

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



# శ్రీను. వాసంతి.. లక్ష్మి...

నిర్మాత : ఎన్.యమ్. సురేష్ స్క్రీన్ ప్లే - దర్శకత్వం : ఇ. శ్రీనివాస్
సంగీతం : ఆర్.పి. పట్నాయక్ పాటలు : కులశేఖర్ కెమెరా : సోమన్ ఎడిటింగ్: కోటగిరి వెంకటేశ్వరరావు



అట్లూరి పూర్ణచంద్రరావు



ఎన్.ఎమ్.సురేష్



ఇ.శ్రీనివాస్



ఆర్పీ పట్నాయక్



కులశేఖర్

## తారాగణం

ఆర్.పి.పట్నాయక్, ప్రియ, నవనీత్, ప్రకాష్‌రాజ్, గిరిబాబు, కౌశిక్, నూతన్‌ప్రసాద్,బ్రహ్మానందం, ఆలీ, సునీల్, రఘుబాబు, ఉమాశ్రీ, మాధురీసేన్, అనంత్‌ప్రభు, గిరిధర్, సందేష్, కళ్లు చిదంబరం, చిన్నా

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : వినయన్ |
| మాటలు | : తనికెళ్ల భరణి |
| పాటలు | : కులశేఖర్ |
| ఎడిటింగ్ | : కోటగిరి వెంకటేశ్వరరావు |
| కెమెరా | : కె.జి.సోమన్ |
| నృత్యం | : జనార్ధన్ |
| ఆర్ట్ | : డి.వి.సురేష్‌కృష్ణ |
| స్టిల్స్ | : రాజా |
| పబ్లిసిటీ డిజైన్స్ | : కృష్ణ డిజిటల్స్ |
| పి.ఆర్.ఓ. | : పులగం చిన్నారాయణ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : మల్లిఖార్జునరావు |
| కో-డైరక్టర్స్ | : మద్దినేని రమేష్, ఎన్.నరసింహారావు |
| అసోసియేట్ డైరక్టర్స్ | : జనార్ధన్, ఎస్.అజయ్‌కుమార్ |
| సంగీతం | : ఆర్.పి.పట్నాయక్ |
| సమర్పణ | : అట్లూరి పూర్ణ చంద్రరావు |
| నిర్మాత | : ఎన్.ఎమ్.సురేష్ |
| స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : ఇ.శ్రీనివాస్ |

ఫిబ్రవరి 25 ,2004న పరమపదించిన బి.నాగిరెడ్డి గారి స్మృత్యర్థం....



# కొమ్మ కొమ్మకో సన్నాయి...



## విజయాధిపతే రఖిలం విజయం

"నా సంకల్పమే నాకు సులగ్నం.
నా స్వార్థమే నా పరార్థం.
నా జీవితం వ్యాపారం.
నా సంస్థలే నా ఆస్తి.
నా పనివాళ్లే నా సంసారం.
చెట్లు చేమలు నా తోబుట్టువులు.
కాలంపోతే రాదు కనుక దానిని నిర్వ్యాపారంగా ఖర్చు
చేయరాదు అన్నది నా సిద్ధాంతం.
'క్రియాసిద్ధిస్సత్వే భవతి' నాకు నచ్చిన, అచ్చివచ్చిన సూక్తి.
అదే మా విజయా సంస్థకు నిర్వచనం".

**సుదీర్ఘ జీవితాన్ని కృషిగా మలుచుకుని ఋషిగా, క్రియాయోగిగా మహాపురుషుడిగా ఎదిగి ఇటీవలనే తనువు చాలించిన శ్రీ బొమ్మిరెడ్డి నాగిరెడ్డిగారి మాటలవి. ఆయన స్థితప్రజ్ఞుడు, సిద్ధసంకల్పుడు, 'నిర్మమో నిరహంకారః' అన్న మాటలు ఆయన వ్యక్తిత్వానికి భాష్యాలు.**

చెన్నపురిలో పురివిప్పిన ఆంధ్ర కళావాణిజ్య సంస్కృతులకేమి, భాషాభివృద్ధికి ఆలంబనమైన ముద్రణాయంత్రాంగ పరికల్పనకేమి, అచ్చ తెలుగు చలనచిత్ర నిర్మాణానికేమి బి.నాగిరెడ్డి అనే నామవాచకం కాలాతీత విఖ్యాతమై వెలుగొందే జ్యోతి.

ఆయన చెన్నపురిలోనే మలిఊపిరి పోసుకున్నారు. అక్కడే తొంభైరెండు వసంతాల నిండు ఊపిరి నింపుకున్నారు. తుదిసారి వదిలివేశారు.

ఎన్నడో ఒక వ్యాపారం నిమిత్తం మద్రాసు చేరిన వారి కుటుంబం చదువు సంధ్యలలో సైతం రాణకెక్కిన ముగ్గురు సోదరుల (బి.యన్. రెడ్డి, బి.నాగిరెడ్డి, బి.యన్.కొండారెడ్డి) తో తెలుగు చలన చిత్రాకాశంలో పాలపుంతలు వేసింది. ఎక్కడో తెనాలిలో వున్న ఆలూరు వెంకట సుబ్బారావు(చక్రపాణి)తోను, కొడవటిగంటి కుటుంబరావు(చందమామ) తోను వాణీవాణిజ్యాలకు చేతులు కలిపింది. అప్పటినుంచీ పట్టిందల్లా బంగారమై తెలుగింటి విజయకేతనం తమిళ గగనంలో ఎగిరింది. మన చందమామ బాల సాహిత్యాకాశంలో పున్నమి వెన్నెలలు జల్లింది. తరువాత అకాశానికి హద్దులులేవని అనేక భాషలలో భాసిల్లింది.



'చందమామ' పత్రిక ద్వారా వడ్డాది పాపయ్య వంటి చిత్రకారులకు వన్నెనీ వాసినీ తెచ్చింది. అంతకుముందు న్యాయవతి రాఘవరావుగారి 'బాల' ఎంతో మోజువాణీ చేసేది. 'చందమామ' రాకతో 'బాల' కొంత తెరమరుగై పోయింది. అటు తర్వాత చక్రపాణిగారి'యువ'ప్రచురణ ప్రారంభమైంది. చక్రపాణి గారు గతించిన తరువాత 'యువ' హైదరాబాదుకు చేరుకున్నా, నాగిరెడ్డి గారి చందమామ చెన్నపురి నుంచే వెన్నెలలు వెదజల్లింది.

ఒకనాడు మూలానారాయణస్వామిగారికి చెందిన ఈ సంస్థా, దాని భవనాలు విజయ వాహినీ స్టూడియోలుగా రూపుదాల్చి తెలుగువారి కళాసంస్కృతులకు వెలుగు బావుటాలుగా నిలిచిపోవడానికి శ్రీనాగిరెడ్డిగారి వ్యాపారదక్షత మూలకారణం.

నాగిరెడ్డిగారి వ్యాపారదక్షత నిష్కరమైనది. దానికి మమకారపు పార కమ్మిన హ్రస్వదృష్టి లేదు. పేరుతో పాటు పెన్నిధిని కూడా సమకూర్చేదే ఆయన చేసిన వ్యాపారం. అందుచేతనే సాక్షాత్తు అగ్రజులైన శ్రీబొమ్మిరెడ్డి నరసింహారెడ్డి (బి.యన్.రెడ్డి) దిగ్దర్శకులుగా కీర్తిప్రతిష్టలు ఆర్జించినా తన విజయ బేనర్‌లో ఒక చిత్రానికి కూడా దర్శకత్వం అవకాశం పొందలేదు. అతిఎక్కువ బడ్జెట్‌తో అతితక్కువ మార్కెట్ వున్న కళాఖండాల నిర్మాణానికి నాగిరెడ్డి వ్యాపారంలో చోటులేదు.

'పాతాళభైరవి'చిత్రంలో మాంత్రికుడు శిష్యుడితో అన్నమాటలు నాగిరెడ్డి గారి వ్యాపార సూత్రాలు,'జనం కోరేది మనం శాయడమా మనం చేసేది జనం చూడడమా' ఈ ప్రశ్నకు నాగిరెడ్డిగారి ప్రతి చిత్రం సమాధానమే. అందులో అంచనాలనుమించి ఆర్జించిన చిత్రాలూ వున్నాయి. ఎదురుదెబ్బ తీసినవీ వున్నాయి. ఆయన తీసిన 'మాయాబజార్' అఖండ వ్యాపారాత్మక కళాఖండమే!

ఒక మార్కస్ బార్ట్లీ, ఒక కృష్ణన్(శబ్దం). ఒక మాధవపెద్ది గోఖలే (కళ). ఒక పింగళి నాగేంద్రరావు. ఒక కమలాకర కామేశ్వరరావు, ఒక ఎన్.టి.రామారావు నుంచీ హాస్యనటులు బాలకృష్ణ, పద్మనాభం వరకూ విజయాసంస్థ నుంచి పెంపొందినవారే.

'మామూలు చిత్రాలలో హీరో వేషం కన్నా విజయావారి చిత్రంలో ఎక్స్‌ట్రావేషం మిన్న' అన్న నానుడి సినీ రంగంలో ఏర్పడింది.

తన పరిధులు తనకు తెలిసి కేవలం వాణిజ్యపరంగా మాత్రమే నాగిరెడ్డిగారు వ్యవహరించేవారని ప్రతీతి. కథ, కథనం, సంభాషణలు, సంగీతం, దర్శకత్వం వ్యవహారాలన్నీ చక్రపాణిగారు చూసుకునేవారు. కనుకనే ఆ క్రమశిక్షణ విజయా సంస్థ నిర్మించిన చిత్రాల్లో కానవస్తుంది.

నాగిరెడ్డి, చక్రపాణి ప్రత్యక్ష పర్యవేక్షణలో వచ్చిన ఏ చిత్రానికీ పని చేసే అదృష్టం నాకు లభించలేదు. నేను సినీరంగంలో ప్రవేశించే నాటికే విజయాసంస్థ చిత్రనిర్మాణం ఆగిపోయింది. కానీ ఆ తరువాత చాలా కాలానికి శ్రీనాగిరెడ్డి గారి కుమారులు నిర్మించిన రెండు చిత్రాలు 'భైరవద్వీపం', 'శ్రీకృష్ణార్జున విజయం'లకు పాటలు రాశాను.

రచయితగా నా వ్యాసంగానికి, గీత రచనకు ఏళ్ల తరబడి నీడ నిచ్చింది మాత్రం నాగిరెడ్డిగారి 'విజయాగార్డెన్స్'. ఆ చెట్లనీడలో ఆకుపచ్చని పరిసరాలలో నేను పాటలు రాసుకునేవాడిని. అనేక సందర్భాలలో తోట పనులు చేయిస్తూ నాగిరెడ్డిగారు స్వయంగా తాను కూడా పనిచేస్తూ ఎప్పుడైనా కనిపించేవారు. అప్పటికే వానప్రస్థం స్వీకరించినట్లు విజయోద్యానంలో కాటేజీలో వుండేవారు.

ఒకసారి విజయాగార్డెన్స్ పాతరికార్డింగు థియేటర్‌కి వచ్చారట నాగిరెడ్డిగారు. అక్కడ వరండాలో మైనాలు వుండేవట. ఎవరేమి మాట్లాడితే ఆ మాటలు వల్లించడం వాటి వినోదం. అలా నాగిరెడ్డిగారు వచ్చేసరికి అవి లేత లేతగా తిట్ల తెలుగు మాట్లాడుతున్నాయట. వెంటవచ్చిన వారితోపాటు నాగిరెడ్డిగారూ ఆశ్చర్యపడి తేరుకుని వెంటనే సౌండ్ ఇంజనీర్ స్వామినాథన్‌గారిని పిలిచి 'ఇంతకుముందు యిక్కడికి పుల్లయ్య, భావనారాయణ వచ్చి వెళ్ళారా' అని అడిగారంట.'ఔను సార్ ఇప్పుడే వెళ్లారు' అన్నారుట స్వామినాథన్. 'తెలుస్తూనే వుంది' అన్నారట నాగిరెడ్డి, అంతటిది ఆయన సద్యఃస్ఫూర్తి, సమయస్ఫూర్తి.

వైద్య,ఆరోగ్య రంగాలకు నాగిరెడ్డిగారు చేసిన సేవ అద్వితీయమైనది. సినిమా వాణిజ్యం తన అంచనాలకు,సూత్రాలకు దూరమై పోతున్న వెంటనే ఆయన తన దృష్టి ఉభయతారకంగా మళ్లించి స్టూడియోలో చాలా భాగం విజయా హాస్పిటల్‌గా పునర్నిర్మించారు. డాక్టర్ చెరియన్, సేతుమాధవన్,జయంతి రామారావు, జగన్నాథ రెడ్డి, సత్యభామారెడ్డి, కె.యన్.రెడ్డి లాంటి ప్రముఖులను, వైద్యనిపుణులను అత్యాధునికమైన విజయా హాస్పిటల్, విజయా హెల్త్ సెంటర్లలో నియమించారు.

ఒకనాడు రేవతీ స్టూడియో కొని విజయా, వాహినీ స్టూడియోలలో యుద్ధ ప్రాతిపదికను కలిపివేసిన నాగిరెడ్డిగారు కాలం మార్పును గమనించి అదే సమయస్ఫూర్తితో తన స్టూడియోను చికిత్సాకేంద్రంగా, కళ్యాణ మంటపాలుగా,షాపింగ్ సెంటర్లుగా మార్చివేశారు.

అయినా ఆయన నిరాడంబరుడు. నిక్కచ్చి మనిషి, నిష్ఠుర కార్యవాది.

విజయాగార్డెన్స్‌లోతన చెట్లనీడన కూర్చొని నేను పాటలు రాస్తూంటే అటువైపుగా వచ్చి ఒక పేపరు చదివి చూసి - 'ఇదెందుకిక్కడ? ఎవరి కర్థమౌతుంది?' అని అడిగి (డెందము అనే మాట - వేరే మాట వాడవచ్చుకదా) తన దారిని వెళ్ళిపోయిన నాగిరెడ్డిగారు, నా స్మృతిపథంలో ఎప్పటికీ నిలిచిపోయే బాటసారి, తోటమాలి.

అంతటి ప్రయోజకుణ్ణి కన్న తెలుగు తల్లి ధన్యురాలు.

**- వేటూరి సుందరరామమూర్తి**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తమిళం | తెలుగు |
|---|---|---|
| చిత్రం | కాదలిక్క నేరమిల్లై | ప్రేమించిచూడు |
| రచన | కణ్ణదాసన్ | ఆచార్య ఆత్రేయ |
| సంగీతం | విశ్వనాథన్ రామ్మూర్తి | మాస్టర్ వేణు |
| గానం | పి.సుశీల, పి.బి. శ్రీనివాస్ | పి.సుశీల, పి.బి. శ్రీనివాస్ |
| అభినయం | రాజశ్రీ, రవిచంద్రన్ | రాజశ్రీ, అక్కినేనినాగేశ్వరరావు |

ఆమె : అనుబవమ్ పుదుమై అవరిడమ్ కండేన్
అన్ నాళిల్ ఇల్లాద పొల్లాద ఎణ్ణంగళే
పొన్నాన కైపట్టు పుణ్ణాన కన్నంగళే ॥అనుబవమ్॥
అతను : తళ్లాడి తళ్లాడి నడమిట్టు
అవళ్ వందాళ్ -ఆహా
శొల్లామల్ కొళ్లామల్
అవళిడమ్ నాన్ శెన్డేన్
అదు కూడాదెన్డాళ్ మనమ్ తాళాదెన్డేన్
ఒన్డు నానే తందేన్ అదు పోదాదెన్డాళ్
అనుబవం పుదుమై అవళిడమ్ కండేన్...
ఆమె : కణ్ణెన్న కణ్ణెన్న అరుగినిల్
అవన్ వందాన్ -ఆహా
పెణ్ణెన్న పెణ్ణెన్డు ఎన్నెన్న
కదై శొన్నాన్
ఇదు మాఱాదెన్డాన్ ఇని నీయే ఎన్డాన్
కణ్ణిల్ పార్వై తందాన్ తుణై
నానే ఎన్డాన్ నానే ఎన్డాన్
అతడు : శింగార తేర్ పోల కులుంగిడుమ్
అవళ్ వణ్ణమ్ - ఆహా
శిత్తాడై ముందానై తళువిడుమ్ ఎన్ ఎణ్ణమ్
అవళ్ ఎంగే ఎన్డాళ్ నాన్ ఇంగే నిన్డేన్
అవళ్ అంగే వందాళ్
నాంగళ్ ఎంగో శెన్డోమ్
ఆమె : పనిపోల్ కుళిర్న్దదు
కనిపోల్ ఇనిత్తదమ్మా ఆహా
మళైపోల్ విళుందదు మలరాయ్ మలర్న్దదమ్మా
ఒరు తూక్కమిల్లయ్ వెఱుమ్ ఏక్కమ్ ఇల్లయ్
పిఱర్ పార్కుమ్ వరై ఎంగళ్ పిరివుమ్ ఇల్లయ్



ప్రేమ మత్తులో ఉన్నవారు పాడితే ఎలా ఉంటుందో తెలుసుకోవాలంటే -'కాదలిక్క నేరమిల్లై' చిత్రంలోని, 'అనుబవం పుదుమై' పాటనూ 'ప్రేమించి చూడు'లోని 'అది ఒక ఇదిలే' పాటనూ వినాలి. ఆ రెండు పాటలు విన్న తర్వాత - ఆ ప్రణయ స్వప్న లోకంలోంచి బయటపడి మామూలు మనుషులు కావడానికి కొంచెం సమయం పడుతుంది.

'కాదలిక్క నేరమిల్లై' చిత్రం కోసం కణ్ణదాసన్ రాసిన, ఆ పాట అప్పుడప్పుడే ప్రేమలో పడిన యువతీ యువకుల స్థితికి అద్దం పడుతుంది. ఆ పాట చెప్పే భావాలు ఏమిటి?

ఆమె : అనుభవం కొత్తది వారి దగ్గర చూశాను (పొందాను)(అతని)
ఆ రోజుల్లో లేని గడుసుభావాలే
బంగరు చేతులు సోకి పుండైన చెంపలే (బుగ్గలే)
అతను : తడబడుతూ తడబడుతూ నడయాడి (నటమా)
ఆమె వచ్చింది - ఆహా
చెప్పకుండా చెయ్యకుండా (సడీ చప్పుడూ లేకుండా)
ఆమె దగ్గరకు వెళ్లాను
అది వద్దన్నది మనసు తాళదన్నాను
ఒకటి నేనే ఇచ్చాను అది చాలదన్నది
అనుభవం కొత్తది ఆమె దగ్గర పొందాను
ఆ రోజుల్లో లేని గడుసుభావాలే
బంగరు చేతులు సోకి పుండైన చెంపలే
ఆమె : కన్ను ఏమిటి ఆ కన్ను ఏమిటి
(చూపు ఏమిటి ఆ చూపు ఏమిటి)
దగ్గరికి అతను వచ్చాడు ఆహా
అమ్మాయి అంటే (అమ్మాయి) నీవేనంటూ
ఏమేమో కథలు చెప్పాడు
ఇది మారదన్నాడు ఇక నీవే అన్నాడు

కళ్ళకు చూపయ్యాడు తోడు
నేనే అన్నాడు నేనే అన్నాడు
అతను : శృంగారపు తేరులా కదిలే ఆమె తీరు
ఆహా - చిన్నారి చీరకొంగును కౌగిలించే నా ఆలోచన
ఆమె ఎక్కడ అన్నది నేను ఇక్కడ నిలిచాను
ఆమె అక్కడికి వచ్చింది
మేము ఎక్కడికో వెళ్లాము
ఆమె : మంచులా చల్లబడ్డది
పండులా రుచించింది -ఆహా
వానలా కురిసింది
పువ్వై విరిసింది
ఒక నిద్ర లేదు (నిద్రంటూ లేదు)
ఒట్టి దిగులూ కాదు
తక్కినవాళ్లు చూసేదాకా
మాకు ఎడబాటూ లేదు

ఈ 'అనుబవం పుదుమై' అనే పల్లవి ఎంతో ప్రసిద్ధమై, ఆ పల్లవే పేరుగా ఆ తర్వాత తమిళంలో ఒక చిత్రం వెలువడింది.

తొలివలపులోని మాధుర్యాన్ని చవిచూపే ఈ పాటను పి.సుశీల, పి.బి.శ్రీనివాస్ ఎంతో అందంగా పాడారు. 'అనుబవం పుదుమై' అన్న ప్రతీసారీ ఏదో కొత్తదనం వినిపించడం విశేషం.

పాటలోని సొగసు - ఏదీ వాస్తవంగా చెప్పకపోవడమే. 'అది వద్దన్నది', 'ఒకటి నేనే ఇచ్చాను', 'ఇది మారదన్నాడు' అనే సందర్భాలలో - అదేదో ఆ ఒకటేదో రెండేదో చెప్పకపోవడం కణ్ణదాసన్ గడుసుతనం. 'మేము ఎక్కడికో వెళ్లాము' అన్న ప్రయోగమూ గడుసైనదే.

నాయికా నాయకులిద్దరికీ వలపు కొత్త. గతంలో అనుభవంలో లేని విషయం. అందువల్ల ఆ వలపు అనుభవం పరస్పరం మొదటిసారి తెలుసుకొన్నారు. గతంలో లేని గడుసుతనం ముంచుకువచ్చింది. వలపు ఇచ్చిన ధైర్యంతో చెక్కిళ్లకు చేతులు సోకి పుండయ్యాయట. అలా పుండు కావడమూ కొత్త అనుభవమే.

తమిళగీతంలో లేని సొగసులెన్నో తెలుగు పాటలో కనిపిస్తాయి. నిజానికి తెలుగు పాట తమిళ గీతానికి అనుసరణకాదు. 'అది,'ఇది' అనే మాటలతో సరికొత్త సరసాలు సరదాలు చవిచూపే ఈ తెలుగు పాట తమిళ గీతం కన్నా అందంగా ఉంది. అది -ఇదీ అని చెప్పలేనిది.

అయినా 'అది ఒక ఇదిలే' అంటారు ఆ నాయికా నాయకులు.

తొలి వలపులోని ఆ ఇద్దరిదీ చెరొక రకమైన అవస్థ. నాయకుడికి ఎద రగిలింది. మతిచెదిరింది. నాయికకు మది పులకరించింది. నాయకుడు 'మతి' అనడం, నాయిక 'మది' అనడం - సార్థకంగా కనిపిస్తాయి.

తమిళగీతంలో మంచులా చల్లబరచి వానలా కురవడం అనుభవమైతే - తెలుగు పాటలోని అనుభవం మాటల్లో చెప్పలేనిది.

'ఎండల్లె వచ్చాడు మంచల్లె కరిగాడు
వెన్నెల్లు కురిశాడు వేడెక్కిపోయాను'

అనే పంకుల్లో విరోధాభిప్రాయాలతో వలపు చల్లదనాన్ని వేడిమినీ ఒక్కచోటే ఆవిష్కరించడం - తెలుగు పాటకు మరింత వన్నెనూ వాసినీ జతచేసింది. పి.సుశీల- 'నా బుగ్గ గిల్లాడు' అనే మాటలకు పలికిన తీరు, 'మది పులకించెను మరులొలికించెను' అనే పంక్తులను హ్రస్వంగా పలికి ముగించే తీరు - నేటికి కొత్తగానే వినిపిస్తాయి.

శ్రీనివాస్ గళంలోని మత్తెక్కించే గుణం పాటనిండా పరచుకొని ఉంది. ఈ పాటలోని 'అదీ', 'ఇదీ' - ఆ తర్వాత మళ్లా మరెన్నో వలపు పాటల్లోనూ కనిపించడానికి కారణం ఇదీ అని చెప్పలేము. (పాట విన్నతరువాత శ్రోతకు కలిగే భావాన్ని 'ఇది బాధందునా ఇది హాయందునా' అని పాట చివర సుశీల కూడా సమర్థిస్తారు.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

ఆచార్య ఆత్రేయ రాసిన నిత్యనూతనమైన ఆ పాట ఇదిగో:

ఆమె : అది ఒక ఇదిలే అతనికె తగులె
సరికొత్త సరసాలు సరదాలు చవిచూపెలె
అహా ఎనలేని సుఖమెల్ల తనతోటి దనిపించెలె
లాలాల లాలాల ॥అది ఒక॥

అతను : మెచ్చాను వచ్చాను ఏమేమో తెచ్చాను
ఆ- నచ్చాను అన్నావ ఏమైన ఇస్తాను
అని పలికిందిరా చెలి కులికిందిరా
ఎద రగిలిందిరా మతి చెదిరిందిరా ...చెదిరిందిరా
అది ఒక ఇదిలే ఆమెకె తగులె
సరికొత్త సరసాలు సరదాలు చవి చూపెలె
ఆ ఎనలేని సుఖమెల్ల తనతోటి దనిపించెలే...
అది ఒక ఇదిలే...

ఆమె : సిగ్గేల అన్నాడు నా బుగ్గ గిల్లాడు
సిగ్గేల అన్నాడు నా బుగ్గ గిల్లాడు
అహ మొగ్గల్లే ఉన్నావు విరబూయమన్నాడు
మది పులకించెను మరులొలికెంచెను
నను మరిపించెను తగుననిపించెను అనిపించెను
అది ఒక ఇదిలే..

అతను : నడకేది అన్నాను నడిచింది ఒకసారి
ఆహ నడుమేది అన్నాను నవ్వింది వయ్యారి
నా వద్దున్నదె తన ముద్దన్నది
చే కొమ్మన్నది నీ సొమ్మన్నది సొమ్మన్నదీ

ఆమె : ఎండల్లె వచ్చాడు మంచల్లె కరిగాను
వెన్నెల్లు కురిశాడు వేడెక్కిపోయాను
ఇది బాధందునా ఇది హాయందునా
ఏది ఏమైనను నే తనదానను తనదానను
అది ఒక ఇదిలె అతనికె తగులె...



# సరిగపదమని

## 15

**కూర్పు : టి.నవీన్**



పంపినవారి పేరు :..........................................................

వయసు :........... వృత్తి :..........................................................

చిరునామా :..........................................................

..........................................................

..........................................................ఫోన్ :..............................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



**అడ్డం:-**

1. ఎస్.వి.కృష్ణారెడ్డి నటించిన చిత్రం (3)
3. 'ఆనందమానందమాయే మది ఆశల నందనమాయే' అనే పాట గల చిత్రం (5)
6. తూనీగా తూనీగా ఎందాక పరిగెడతావే ......... నావంక (2)
8. '........... దిగివచ్చి మబ్బులతో వేయాలి మన పందిరీ' వెంకటేష్‌కి కోటి స్వరపరిచిన గీతం (3)
10. '.........లా ఘోషించే గోదావరి' ఆంధ్రకేసరి చిత్రంలోని గీతం (2)
11. 'నేస్తమా మన ఇద్దరి లోకం ఒకటే లేవమ్మా అందుకే నా.....లతో లోకం చూడమ్మా (2)
13. 'చెమ్మ..... చెమ్మ .....చారడేసి మొగ్గా' పెళ్ళిసందడి చిత్రంకోసం కీరవాణి స్వరపరిచిన గీతం (2)
14. ఇరువురి.....ల కౌగిటిలో స్వామి ఇరుకునపడి నీవు నలిగితివా (2)
18. '....జవరగమనా' శంకరాభరణం చిత్రంలో ఓయుగళగీతం ఇలా మొదలవుతుంది (2)
19. 'సుఖీ....... సుఖీ...... సుమంగళి సుఖీ...... సుశీలవై చిరాయువై' మేజర్ చంద్రకాంత్ చిత్రంలోని పాట (2)
20. 'ప్రేమ.....లకు బృందావనమూ నందనవనమూ ఏలనో' (2)
21. ........ కనులతో కలబడితే ఆ తగువుకు ఫలమేమి? (2)

**నిలువు:-**

1. '.....మీద కూడు ఉప్పు చాప తోడు ' ఏ.ఆర్.రెహమాన్ స్వరపరిచిన గీతం (2)
2. 'చెంగావి రంగుచీర కట్టుకున్న చిన్నది దాని జిమ్మ..... అందమంతా చీరలోనె ఉన్నది' (2)
3. 'చూపులు కలసిన ...... ఎందుకు నీకీ కలవరము' (4)
4. జిల్ జిల్ జిల్‌మని మ్రోగింది కన్నెగుండెల్లో ......... రాగం (2)
5. 'ఏరు...... సాగాలో రన్నో చిన్నన్న (2)
7. 'ఝుమ్మంది ....... సైయ్యంది పాదం 'వేటూరి గీతం (2)
8. 'కమ్మని కలలకు ........... చక్కని చెలిమికి శ్రీకారం హ్యాపీ న్యూ ఇయర్' (4)
9. '..........నాద శరీరా పరా' శంకరాభరణం చిత్రంలోని పాట (3)
12. '............ చెప్పలేవా నువ్వు నచ్చావని' సిరివెన్నెల గీతం (4)
15. కృషి వుంటే .......ఋషులవుతారు మహాపురుషులవుతారు (4)
16. ...... ....... మూర్తివి గణనాథా నువ్వు శివుని కుమారుడివి గణనాథా (2)
17. 'నూజివీడు ....... ఆడుదామా దాండియా' చక్రి స్వరపరిచిన గీతం (3)
19. 'భద్రం బీకేర్‌ఫుల్ బ్రదరూ .......గ మారకు బ్యాచిలరూ ' మనీ చిత్రంలోని పాట (2)

**పజిల్, కూపన్ 31-03-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)




రెండవ బహుమతి (ఒక తప్పుతో)




మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)






### అక్షర క్రమంలోనే కాదు
### మరెన్నింటిలోనో
### అగ్రతాంబులం

# 'అనైద'



గ్రీక్, పర్షియన్ సంతతికి చెందిన అనైద కు ఇండీపాప్‌లో ఓ ప్రత్యేక స్థానం వుంది. ఆమె తన అందచందాలతోనే కాదు-అంతర్జాతీయ సంగీతంతో వున్న అనుబంధంలో దేశ, విదేశ సంగీతాభిమానుల్ని అలరిస్తోంది.1995లో గాయనిగా కెరీర్‌ను ప్రారంభించక ముందే అనైద మంచి చిత్రకారిణిగా పేరు తెచ్చుకుంది. సంగీతం,చిత్రలేఖనంతో పాటుగా ఆమె రచనా వ్యాసంగంలోనూ ప్రవేశం పొందింది. జాతీయస్థాయిలోని దినపత్రికలు, మ్యాగజైన్స్‌లో అనైదా వ్యాసాలు రాసింది. అంతేకాదు ఆత్మన్యూనతతో బాధపడే ఎందరికో ఆమె ఊరటను కలిగిస్తూ ఆ దిశగా పనిచేస్తున్న అనేక సంస్థలకు కన్సల్టెంటుగానూ వ్యవహరిస్తోంది.

ఇదంతా అనైద సంగీత ప్రపంచానికి సంబంధం లేకుండా జరిగేది. సంగీతాన్ని, సమాజాన్ని సమానంగా ప్రేమించే అనైద-బాల్యం వివిధ దేశాలలో గడిచినా, ముంబైలోనే ఆమె స్థిరనివాసాన్ని ఏర్పరచుకుంది. సంగీతమే ప్రధాన వ్యాపకంగా పెట్టుకుంది. ఇండి -పాప్‌లో అనైద ఎన్నో అంశాలలో అగ్రగామిగా నిలిచిందని చెప్పుకోవచ్చు. 1995లో అనైద విడుదల చేసిన సింగిల్ 'హాట్‌లైన్' ఆ తరహా ఆల్బమ్స్‌లో మొట్టమొదటిది. విదేశాలలో ఇలా సింగిల్ సాండ్ ఆల్బమ్స్ విడుదల చేసే సంప్రదాయం వున్నా భారత్‌లో మాత్రం ఆ ఖ్యాతి అనైద 'హాట్‌లైన్' కే దక్కింది.

రాత్రికి రాత్రి ఈ తొలిపాట సక్సెస్‌తో వచ్చిన పేరుతో అనైద వరుసగా 'ఫీవర్','దివా' సింగల్ ఆల్బమ్స్‌ను 1996లో విడుదల చేసింది. అయితే పూర్తిస్థాయిలో 1995లోనే తన ప్రతిభా పాటవాలను సంగీత ప్రియులకు తెలియచేసేందుకు 'లవ్ టుడే హై నహీ ఆసాన్' ఆల్బమ్‌ను విడుదల చేసింది. అప్పట్లో అత్యధిక స్థాయిలో అమ్ముడయిన తొలి ఆల్బమ్‌గా అది రికార్డ్ సృష్టించింది. అలానే ఆల్బమ్‌లోని ఒక పాటకు ప్రముఖ బాలీవుడ్ కొరియోగ్రాఫర్ సరోజ్ ఖాన్ నృత్యరీతుల్ని సమకూర్చింది. ఓ వీడియో ఆల్బమ్‌కు సరోజ్‌ఖాన్ పనిచేయడం అదే మొదటిసారి. ఆల్బమ్ లోని 'దిల్ లే..లే.....' పాటకు గానూ అనైద ఉత్తమ గాయనిగా నామినేట్ అయ్యింది. 1996లోనే అనైద 'నాజూక్ నాజూక్' ఆల్బమ్‌ను విడుదల చేసింది.

ఇందులోని 'ఓవా...ఓవా...' హో హల్లా హో, పాటలను వీడియోగా చిత్రీకరించారు. 'హో హల్లా హో' పాటను ఆరునెలలు కష్టపడి తొలి ఇండియన్ యానిమేటెడ్ వీడియోగా చిత్రీకరించటం జరిగింది.ఈ పాట అనేక అవార్డులతో పాటుగా ఉత్తమ యానిమేషన్‌గా'హోప్ 96' అవార్డునూ అందుకొంది. అలానే వాల్ట్‌డిస్నీ సంస్థ తొలిసారి తమ యానిమేటెడ్ మూవీ 'ద లయన్ కింగ్'లోని ఓ ట్రాక్‌ను ఇతర భాషలలోకి అనువదించింది. అందులోని 'హ కున....మ టాటా' అనే పాటను అనైద -బాబా సెహగల్‌తో కలిసిపాడింది. అన్ని వయసుల వారినీ ఈ పాట విపరీతంగా ఆకట్టుకుంది.

1996లోనే అనైద సిరియన్ గాయకుడు, గీతరచయిత షుక్రీతో కలిసి 'ఓ మలు మలు' అనే అరబిక్ ఆల్బమ్‌కు వర్క్ చేసింది. హిందీ పాప్‌గాయని ఒరిజినల్ అరబిక్ ఆల్బమ్ కోసం పాట పాడటమన్నది అదే మొదటిసారి. 1997లోభారతస్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగా అందరికంటే ముందు అనైదానే ఓ సింగిల్ ట్రాక్‌ను 'వందేమాతరం' పేరుతో విడుదల చేసింది. తర్వాత దానిపేరును 'హమ్ సబ్ ఏక్ హై'అని మార్చింది. ఈ పాట వీడియోలో బాలీవుడ్ స్టార్స్ సంజయ్‌దత్, సల్మాన్‌ఖాన్, కుమార్ గౌరవ్, అతుల్ అగ్నిహోత్రి తదితరులు నటించారు.

1997లోనే గ్రీక్ పాప్ సూపర్ స్టార్, క్లాసికల్ పియనిస్ట్, కంపోజర్ స్టైఫనోస్ కోక్కోలిస్ అనైదాను గ్రీస్‌కు ఆహ్వానించి తన ఆల్బమ్‌లో ఆమెతో పాట పాడించాడు. కేవలం పాప్ గళాలకే పరిమితం కాకుండా వైవిధ్య భరితమైన నేపథ్య గీతాలను అనైదా పాడింది. కైజద్ గుస్తార్ 'బాంబే బాయ్స్' చిత్రం కోసం 'క్వెస్ట్' అనే పాట పాడింది. ఈ పాటతో సినిమా రంగంలోనూ తనకో ప్రత్యేకమైన గుర్తింపు వచ్చిందని అనైద భావించింది.

ఆ తర్వాత 1999లో ఇరా రోషన్ సంగీత దర్శకత్వంలో, మాయాగోవింద్ రచన చేసిన ఎనిమిది పాటల'చోరి చోరి' అనే ఆల్బమ్‌కు అనైదా విడుదల చేసింది. భారతీయతకు, ఇక్కడి సంస్కృతి, సంప్రదాయాలు, జానపద సంగీతానికి దగ్గరగా వుండే భావాలను ఈ ఆల్బమ్ ద్వారా వ్యక్తపరచానంటోంది అనైద. 2000వ సంవత్సరంలో గ్రీస్‌లో అనైద ఆల్బమ్ 'క్వెస్ట్' విడుదలైంది. ఇండియన్ పాప్‌సింగర్ ఆల్బమ్ ఒకటి గ్రీస్‌లో విడుదల కావటం కూడా అక్కడ అదే ప్రథమం. ఇలా అనేక అంశాలలో అనైద అగ్రతాంబూలామే అందుకొంది.



2001లో 'ది గ్రేటెస్ట్ హిట్స్ ఆఫ్ అనైద' విడుదలైంది.'లయన్ కింగ్', 'బాంబే బోయ్స్' చిత్రాల తర్వాత అనైద 'బ్లాక్ ఈజ్ బ్లాక్' అనే పాటను 'స్ప్లిట్ వైడ్ ఓపెన్', కోసం 'తుమ్‌సే అచ్ఛా కౌన్ ' అనే పాటను' 'ముఝే మేరీ బీబీసే బచావో' కోసం, 'యూ గాట్టా ఫాల్ ఇన్ లవ్' పాటను 'లజ్జా' 'దీవానీ ...దీవానీ, అనే పాటను 'చోరి చోరి చుప్కే చుప్కే ' చిత్రాలలో పాడింది. దేశ విదేశాలలో లైవ్ పెర్ఫార్మెన్స్, స్టేజ్ షోలు ఇవ్వడంలో అనైద ఎంతో బిజీగా వుంటోంది ప్రస్తుతం. పాకిస్తానీ బాండ్ 'నూరీ',తో కలిసి ఆ మధ్యన 'నయా జయా' అనే పాటనూ అనైద పాడింది. టాలీవుడ్ చిత్రం 'జమానత్'లో నటించే అవకాశం వచ్చినా - అదే డేట్స్‌లో ఓ ఆంగ్ల చిత్రంలో నటించాల్సి వుండటంలో ఈ ఆఫర్‌ను వదులుకున్నానని అనైద చెబుతోంది. ఇప్పటికే దాదాపు 13 విడియో ఆల్బమ్స్‌తో ప్రేక్షకుల్ని తన అందచందాలలో అలరించిన అనైద వెండితెర మీద తన సోయగాలను ఎలా ప్రదర్శించనుందో వేచిచూడాలి.

**- వి. అరుణ సత్యవతి**

హాసం

# హాసం క్లబ్‌లు ప్రారంభం

క్లబ్

హాస్య-సంగీత ప్రియులందరూ సకుటుంబంగా నెలకోసారి రెండుగంటలపాటు హాస్యకార్యక్రమాలతోనూ, పాటలతోనూ కాలక్షేపం చేయడానికి వీలుగా ఈ కొత్తసంవత్సరంలో ఉగాది నుండి 'హాసం క్లబ్'లు ఏర్పాటవుతున్నాయి. ఈ కార్యక్రమాలలో పాల్గొనడానికి మీరు 'హాసం' పాఠకులు కానవసరం లేదు. క్లబ్‌కు చందా కట్టనక్కరలేదు. హాయిగా వచ్చి జోకులు వినవచ్చు. మీరూ చెప్పవచ్చు. వివరాలివిగో -

| ఊరు | తేదీ | సమయం | స్థలం | వివరాలకు సంప్రదించవలసినవారు |
|---|---|---|---|---|
| రాజమండ్రి | 21-03-04<br>ఆదివారం | ఉదయం<br>10.35 -12.35 | 16-4-2, శ్రీరామనగర్,<br>పేపర్‌మిల్లు వద్ద, రాజమండ్రి-5, | శ్రీ ఎం.వి.అప్పారావు<br>☎ 95883- 2438085, 98852 15155 |
| వైజాగ్ | 21-03-04<br>ఆదివారం | సాయంత్రం<br>6.05 - 8.05 | విశాఖ జిల్లా కేంద్ర గ్రంథాలయం<br>మహారాణిపేట, విశాఖపట్టణం-2 | శ్రీ టి.ఎల్.ప్రసాద్ ☎ 98850 56449<br>శ్రీ మస్తాన్‌రెడ్డి☎ 95891-2720919/2713554 |
| ఏలూరు | 21-03-04<br>ఆదివారం | సాయంత్రం<br>6.35 -8.35 | శ్రీ మోతే శ్రీనివాస నారాయణరావుగారి ఇల్లు<br>పడమర వీధి, ఏలూరు | శ్రీ మోతే నారాయణరావు☎ 958812-221989<br>శ్రీ డి.రామకృష్ణారావు ☎ 958812-222318 |
| హైదరాబాదు | 27-03-04<br>శనివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | 'హాసం' ఆఫీసు, శ్రీ బాలాజీ నిలయం,<br>రాజీవ్‌నగర్ బస్టాప్, ఎ.జి.కాలనీ దగ్గర్లో,<br>హైదరాబాదు-18 | శ్రీ గిరి ☎ 9540-55570215<br>శ్రీ ఎస్.వి.రామారావు ☎ 24160279 |

'హాసం' అభిమానులు తమ వీలుమేరకు ఈ కార్యక్రమాలలో పాల్గొని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాం.
ఇతరపట్టణాలలో 'హాసం క్లబ్బు'లు ప్రారంభించ దలచినవారు సంప్రదించవలసిన చిరునామా -

**శ్రీ ఎస్.వి.రామారావు, కన్వీనర్, హాసం క్లబ్స్,**
**జి3, ఉమా అపార్ట్‌మెంట్, లలితానగర్, దిల్‌సుఖ్‌నగర్,**
**హైదరాబాద్ -500 060 ఫోన్ - 040-2416 0279**

# తాత్తా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 9

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | | నటీనటుల సజెషన్ |
|---|---|---|
| వీరభద్రం | - | కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - | నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - | తరుణ్ |
| అశ్విని | - | శ్రియ |
| పార్వతమ్మ | - | అన్నపూర్ణ |
| హనుమంతు | - | గుండు హనుమంతరావు |
| అనంత్ | - | గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.



**జరిగిన కథ**

రాజు పాలెం అనే గ్రామంలో రావ్ బహుద్దూర్ వంశానికి చెందిన వీరభద్రం అనే స్కూలు మాష్టారు ఉంటారు. ఆయనంటే ఆ ఊరి మొత్తానికి భక్తితో కూడిన భయం. చీటికి మాటికి భార్యపై రుసరుస లాడుతుంటాడాయన. వీరభద్రం పెద్దకొడుకు శ్రీరామ్ పట్నంలో చదువుతూంటే చిన్న కొడుకు లక్ష్మణమూర్తి తండ్రి దగ్గరే ఉండి పదోతరగతి చదువుతూ ఉంటాడు. శ్రీరామ్‌ను అశ్విని ప్రేమిస్తూ ఉంటుంది. తనకు బాకీగా ఉన్న కట్నం బాపతు సొమ్మును రెడీగా ఉంచమని మామ వీరభద్రంకు ఉత్తరం రాస్తాడు రాజేంద్ర. సంక్రాంతి పండుగకు అల్లుడు రాజేంద్ర, కూతురు గీతలు వస్తారు. మావల సంఘం సెక్రటరీ అప్పారావు ఆత్మహత్య చేసుకోటానికి ప్రయత్నించినట్టు వీరభద్రానికి తెలుస్తుంది. అత్తగారి కోరిక మేరకు తనకు రావలిసిన కట్నం బాపతు సొమ్ము రాబట్టు కోవడానికి ఒక సంవత్సరం గడువిస్తాడు రాజేంద్ర. కాలేజీనుండి ఇంటికి బయలుదేరిన శ్రీరామ్‌ను తన ఇంటికి తీసుకెళ్లి తండ్రి కి పరిచయం చేస్తుంది అశ్విని. -(ఇక చదవండి)

"అదేంటయ్యా అంత భయపడి పోతున్నావ్?.. సిగరెట్ కాల్చటం ఘోరమూ నేరమూ కాదులే!.. ఈ రోజుల్లో స్టూడెంట్స్‌కి అదో ఫ్యాషన్!.. అలవాటు కానంతవరకూ ప్రమాదంలేదు. నేను సరదాగా అప్పుడప్పుడూ ఇదిగో ఇలా 'పైప్' పీలుస్తూంటాను" చేతిలో వున్న 'పైప్' చూపిస్తూ అన్నాడు విష్ణుమూర్తి.

"అసలతను ఏమీ చేయలేదు డేడీ!..వట్టి చాక్‌పీస్!" ఇంకా ఆ నవ్వు కంటిన్యూ చేస్తూనే చెప్పింది అశ్విని. అయినా శ్రీరామ్‌కి కోపం కానీ, పౌరుషం కానీ రాలేదు...

"బేబీ వాటీజ్ దిస్?...అతను నీకు కాలేజీలో బెస్ట్ ఫ్రెండే కావచ్చు కానీ ఇప్పుడు మనింటికి వచ్చిన గెస్ట్. వేళాకోళం చెయ్యకూడదు.. మర్యాద చెయ్యాలి.. మైండిట్.."

నవ్వును బలవంతంగా ఆపుకుందామె.

మళ్లీ ముగ్గురూ - మేడదిగి హాల్లోకొచ్చి కూర్చున్నారు. శ్రీరామ్ కుటుంబ విషయాలను అడిగి తెల్సుకుని - వీరభద్రం అడ్రస్ కూడా తీసుకున్నాడు విష్ణుమూర్తి.

"ఇక నేను బయల్దేర్తాను సార్!" పదినిమిషాల పిచ్చాపాటీ తర్వాత లేచాడతను.

"అప్పుడేనా తొందరేముంది?..ఏకంగా డిన్నర్ చేసి వెడుదువుగాని!"

"థాంక్స్ ఫర్ ది ఇన్విటేషన్.. కానీ.. ఇవాళ కాదు సార్! మరోసారి ఎప్పుడైనా వస్తాను" చెప్పులు తొడుక్కుంటూ చెప్పాడు.

"మరోసారి ఎప్పుడో అంటే కుదర్దు...రేపే రావాలి!.. పండగ భోజనం మా ఇంట్లోనే!.. ఎలాగో నువ్ మీ ఊరు వెళ్ళటం లేదుగా?.. పండుగపూట హాస్టల్లో పడివుండటం ఎందుకూ?.. నీ కోసం వెయిట్ చేస్తూంటాం... వచ్చెయ్....!"

అతను ఏ సంగతీ చెప్పకుండా బయటకు నడిచాడు. "అతన్ని కార్లో డ్రాప్ చేసిరా బేబీ!"




అన్నాడు విష్ణుమూర్తి.

"నో..నో!.. ఫరవాలేదండీ! నే వెడతాను" - ఖంగారుగా చెప్పేసి పరుగులాంటి నడకతో వెళ్ళిపోతున్న అతన్ని చూసి ఫక్కున నవ్విందామె.

"ఏమిటి బేబీ అది?-మాటిమాటికీ అలా నవ్వితే అతనేమనుకుంటాడు చెప్పు?" - మందలించాడు విష్ణుమూర్తి.

"కాదు డేడీ! అతన్నిచూస్తే నవ్వొచ్చింది... వట్టి బెదురు గొడ్డు...అందుకే అయ్ లవ్ హిమ్!"-

"నో! మన వంశం ధైర్యసాహసాలకు పుట్టిల్లు. అలాంటి ఇంట్లో పుట్టిన నువ్వు ఓ బెదురు గొడ్డుని 'లవ్' చేయటం నాకు వింతగా తోస్తోంది... అసలు అతన్ని పెళ్ళిచేసుకుంటే...నువ్ సుఖపడగలవా అనే అనుమానం వస్తోంది."

"చూస్తూండు డేడీ!.. అతన్ని హీరోని చేస్తాను.. ఆ తర్వాతే పెళ్ళి చేసుకుంటాను" - ఛాలెంజ్ చేస్తున్నట్టు చెప్పింది.

"అలా అన్నావ్ బావుంది.. ఇప్పుడు నువ్వు నాకు నచ్చావ్!.. నీ ప్రయత్నాల్లో నువ్వుండు.....నేను అట్నించి ప్రొసీడై పోతాను.." గుప్పెట మూసి బొటనవేలు పైకెత్తి చూపిస్తూ మెచ్చుకోలుగా అన్నాడు విష్ణుమూర్తి....

* * *

వీధి అరుగు మీదకూర్చుని పుస్తకంలోని పాఠాన్ని లోలోపలే చదువుకుంటున్నాడు లక్ష్మణమూర్తి.

పక్కగా మరికొంచెం దూరంలో తివాసీ మీద కూర్చుని 'పేకముక్క'లతో ఒక్కడే ఆడుకుంటున్నాడు వీరభద్రం. అంతలో నారాయణ "భలేమంచి చౌకబేరము" అనే పాటను పాడుకుంటూ అటే వెడుతూండటం చూసి పిలిచాడు.

"ఒరే! ఇట్రా!.. ఈ పేకనించి ఒక్కముక్క తీసి, వేయుము" అంటూ కొన్ని కార్డులు వాడి చేతిలో పెట్టాడు.

"అయ్‌బాబో!.. నాకు పేకాట రాదండీ" అన్నాడు నారాయణ,చేతిలో వున్న పేకముక్కల్ని చూసుకుంటూ.

"నీకు రాకపోయినా నష్టం వాటిల్లదు! నాకు వచ్చు కదా! చెప్పినట్టుచెయ్యి!" ఓ కార్డువేసి మళ్లీ నారాయణని ఓ కార్డు వేయమన్నాడు వీరభద్రం. అంతలో పార్వతమ్మ అక్కడకు వచ్చింది.

"ఇవాళ ఆదివారమేగా? మీ స్కూల్లో మేస్టర్లను ఎవర్నైనా రమ్మని పిలవకపోయారా పేకాటకీ?....వాడి పనెందుకూ పాడుచెయ్యటం?" అని భర్తతో చెప్పి,

"నువ్ రారా నారాయణా! చెరువు కెళ్లి నీళ్లు తేవాలి!"అంది.

క్షణం ఆలస్యం చేయకుండా అదే అదననుకుని ఆ 'ఫ్రేం' లోంచి మాయమై పోయాడు నారాయణ.

వీరభద్రానికి భార్యమీద పట్టరాని కోపం వచ్చింది. ఆ కోపాన్ని పక్కనున్న కొడుకుమీద ప్రదర్శించబోయాడు.

"తమరేం అఘోరిస్తున్నారూ?.. రీడింగా?.. స్లీపింగా?"

"మ...మ...మననులోనే చ... చదువుకుంటున్నాను!" భయపడి పోతూ బదులిచ్చాడు లక్ష్మణమూర్తి.

"అఘోరించారు!..మనసులో చదువుకున్నది మోకాలుకు పోవును!.. పైకి చదువుకున్నది బుర్రకెక్కును.. పైకి అఘోరించు!"

వెంటనే పాఠాన్ని గబగబా పైకి చదవటం ప్రారంభించాడు లక్ష్మణమూర్తి. మధ్యమధ్యన తండ్రి అడుగుతున్న ప్రశ్నలకు బెదురు బెదురుగా సమాధానాలు చెప్తున్నాడు.

అంతలో రెండుకార్లు వేగంగావచ్చి ఆ



ఇంటిముందు ఆగేయి...

ముందు ఆగిన కార్లోంచి ఇద్దరు వ్యక్తులు దిగేరు.

"వీరవాసరం వీరభద్రరావుగారిల్లు ఇదేనా మాస్టారూ?" ఒకాయన వీరభద్రాన్ని చూసి అడిగేడు.

అతనివైపు గుర్రుగా చూసేడు వీరభద్రం

"ఇది ఎవరి గృహం అనుకుని ఇక్కడ దిగేరో తమరు?" ఎదురు ప్రశ్న వేశాడు.

ఆ భాష కొంచెం అర్థం కానట్టుగా బిత్తరపోయి చూశాడు ఆ పెద్దమనిషి. ఈ లోగా రెండో వ్యక్తి సమర్థించుకుంటూ చెప్పాడు.

"వారిదే అనుకుని వచ్చామండీ..."

"అనుకుని కూడా మళ్లీ అడుగుటలో ఆంతర్యమేమిటో?.. నన్నొక వెర్రి వెంగళప్పను చేయుటకా?"

ఈ సారి రెండవ వ్యక్తి కూడా బిత్తరపోయాడు.

"రామ..రామ!...అంత మాటెందుకు మేస్టారు? పొరపాటైపోయింది.. ఇంతకీ వారు ఇంట్లో వున్నారా?" అడిగేడు వెంటనే.

ఆ ప్రశ్న విన్న వీరభద్రం వెంటనే శివమెత్తిన వాడిలా లేచి అన్నాడు కొంచెం ఆవేశంగా

"అబ్బే...లేరు!...వారు ఇంట్లో ఎందుకుండెదరూ... ఇవాళ ఆదివారము కనుక, స్కూలు శలవు కనుక జోలె భుజానికి వేసుకుని యాచనకు వీధుల వెంబడి తిరుగుచున్నారు...హుం!.. ఇంట్లో వున్నారా?... అదో ప్రశ్న!"

ఆ పెద్దలిద్దరూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

అంతలో రెండో కారులోంచి విష్ణుమూర్తి దిగి వచ్చాడు.

"మీరుండండయ్యా!.. వీధిలో వాళ్ళతో గొడవ పడతారెందుకూ?.. బహుశా ఆ కుర్రాడు వీరభద్రంగారి రెండో అబ్బాయయ్యుంటాడు... ఆ "ఉగ్రనరశింహం" అతగాడి ట్యూషన్ మాస్టారు కాబోలు... అసలా 'ఫేసే' దరిద్రంగా వుంది.... అతనితో మాట్లాడి 'టైం' వేస్టు చెయకండి... ఇవాళ స్కూలుకి శలవే కనక మేస్టారు ఇంట్లోనే వుండి వుంటారు... రండి.. లోపలకు వెళ్ళి విచారిద్దాం!" అంటూ గబగబా లోపలకు దారితీశాడు. తక్కిన పెద్దలిద్దరూ వీరభద్రాన్ని ఓ పురుగుని చూసినట్టు చూసి విష్ణుమూర్తి వెంట నడిచారు.

"ఆఁ! లోపలకు వెళ్ళిన పిదప మీరు విచారించవలసిందే!" అంటూ పళ్ళు పటపటా నూరుతున్నాడు వీరభద్రం.

అదేక్షణంలో ఓ కారులోంచి క్రిందకు దిగిన డ్రైవరు బీడీ నోట్లో పెట్టుకుని జేబులో అగ్గిపెట్టె లేదని గ్రహించి వీరభద్రం దగ్గరకు వచ్చి అడిగేడు

"గురూగారూ...మన దగ్గిర అగ్గిపెట్టుంటే ఓసారిప్పించండి!"

అనలే అవమానంతో ఉడికిపోతున్న వీరభద్రానికి పుండు మీద కారం చల్లినట్టు అనిపించింది.




"అలాగే ఇచ్చెదను...! ముందు నీ కారులో వున్న పెట్రోలు తీసుకురమ్ము"

"పెట్రోలా ఎందుకూ?"

"నీ తలపై గుమ్మరించి అటుపై అగ్గిపుల్ల గీయుటకు!" అన్నాడు వీరభద్రం. డ్రైవరుకి కోపం వచ్చింది.

"ఇదిగో పంతులూ!.. ఒళ్ళేలా వుందేమిటి?... నేను మర్యాదగా అగ్గిపెట్టె అడిగితే అనవసరంగా అలా నోరుపారేసు కుంటావేమిటీ?" అన్నాడు.

"నోరు పారేసుకోవటమే కాదు.. నీ 'లెగ్సూ', 'హెండ్సూ' కట్టి కార్లో పారవేయ గలను. నన్నే అగ్గిపెట్టె ఇమ్మందువా?.. ఎంతసాహసము?"

"ఉఁ..! సర్లే... నీతో నాకేంటి?.. పైగా ఆ మొఖానికి సాయం వికారంగా ఆ భాషొకటి?.."

అంటూ వెళ్ళిపోయాడు డ్రైవరు.

వీరభధ్రం కోపాన్ని నిగ్రహించుకోలేక పోయాడు.. పద్యం తప్పుగా చదువుతున్న లక్ష్మణమూర్తిపై ఆ కోపాన్ని ప్రదర్శించి వీపు మీద ఒకటి తగిలించాడు.

"సరిగ్గా చదివి అఘోరించు" అంటూ మండిపడ్డాడు.

ఇక లోపల..

హాల్లోకి అడుగుపెట్టిన విష్ణుమూర్తి చుట్టూ కలయచూశాడు..అక్కడ ఎవరూ కనిపించలేదు.

"ఎవరండీ లోపల?" పిలిచాడు.

అప్పుడే నీళ్ళ కావిడి తీనుకుని 'ఎవరుచేసిన ఖర్మవారనుభవింపకా - ఎవరికైనను తప్పదన్నా' అని పాడుకుంటూ, అటుగా వెడుతున్న నారాయణ ఆగిపోయి వాళ్ళవైపు విస్మయంగా చూస్తూ ప్రశ్నించాడు.

"ఎవరు కావాలండీ?"

"వీరభద్రంగారు కావాలి!...పిలు!" అంటూనే ఠీవిగా అక్కడున్న సోఫాలో కూర్చున్నాడు విష్ణుమూర్తి.

నారాయణ ఇంకా విస్తుపోయాడు.

"అదేంటండీ?.. ఈరబద్రంగోరు ఈదరుగుమీద కూసుని - ఆరబ్బాయిగోరికి సదువు సెప్తున్నారు కదా?.., సూళ్లేదా?"

ఆ మాట విన్న విష్ణుమూర్తి తన పక్కనే టపాకాయ పేలినట్టు ఉలిక్కిపడ్డాడు. అంటే...? ఇంతకుముందు తాను, వీధి అరుగుమీద చూసింది, 'ఉగ్రనరశింహం' అని బిరుదిచ్చిందీ, 'ఫేసు దరిద్రం'గా వుందంటూ రిమార్కుచేసిందీ - వీరభద్రం గారినే నన్నమాట...!

విష్ణుమూర్తికి ముచ్చెమటలు పోశాయి. 'వచ్చిన పని వాకిట్లోనే అయిందన్న' సామెతగా ఇప్పుడు వీరభద్రం తనతో 'చెడుగుడు' ఆడతాడేమోనన్న భయంకూడా కలిగింది...

"మీరుండండి!... నేను చూసొస్తాను!" అంటూ నారాయణ బయటకు నడిచాడు.

-(ఇంకావుంది)



# సరిగపదమని ఫలితాలు 6

## డ్రాలో గెలుపొందిన వారు

| | |
|---|---|
| ఆల్ కరెక్ట్ | : సి.హెచ్.సూర్యారావు, చీపురుపల్లి |
| ఒక తప్పుతో | : పి.సుదర్శనరావు, విశాఖపట్నం |
| రెండు తప్పులతో | : పి.వి.శివప్రసాద్, నెల్లూరు |
| మూడు తప్పులతో | : డి.వెంకటగిరిప్రసాద్, అనంతపురం |

ఈ పోటీ ఫలితాలను డ్రా తీయడానికి - అడగగానే వెంటనే ఒప్పుకొని ఎంతో ఆనందంతో సహకరించిన సంగీత దర్శకులు ఆర్.పి.పట్నాయక్ గారికి, విజేతలతో పాటు పజిల్ కూపన్లను పంపిన ప్రతి ఒక్కరికీ 'హాసం' కృతజ్ఞతలు.



సరిగపదమని విజేతలైన

Ch. Surya Rao (Vijayanagaram)
P. Sudarshan Rao (Visakhapatnam)
P. V. Siva Prasad (Nellore)
D. Venkata Giri Prasad (Ananthapur)

అభినందనలతో



సరిగపదమని -6 క్విజ్‌లో ప్రథమ బహుమతి వచ్చిందని రాజాగారి నుండి ఫోన్ రావడంతో కలిగిన సంతోషాన్ని మాటల్లో చెప్పలేను.

'హాసం' నా అభిమాన ఏకైక పత్రిక అని గర్వంగా మిత్రులతో చెబుతుంటాను.

కొంతకాలం క్రితం విజయచిత్ర ఎంతో ఇష్టంగా చదివేవాడిని. తిరిగి ఇన్నాళ్ళ తర్వాత హృదయ పూర్వకంగా చదవదగ్గ పత్రిక 'హాసం'.

హాసం ఇంకా మరింత ఆకర్షణీయంగా తీర్చిదిద్దాలని కోరుకుంటూ.

**- సి.హెచ్. సూర్యరావు, చీపురుపల్లి.**



ప్రతిష్ఠాత్మకమైనటువంటి సంగీత, సాహిత్యాలకు ప్రతీకమైన 'హాసం' పత్రికలో మా యొక్క పజిల్ విజయం సాధించినందులకు చాలా ఆనందంగా ఉంది. మీకు మేము సర్వదా కృతజ్ఞులం.

**- పి. సుదర్శనరావు, విశాఖపట్నం**



నాకు 'సరిగపదమని' -6 నకు బహుమతి వచ్చిందని తెలిసి చాలా సంతోషించాను. 'డ్రా' తీసిన ఆర్పీ పట్నాయక్ గారికీ, 'హాసం' కూ మా ప్రత్యేక కృతజ్ఞతలు. 'విలువలు' తరగిపోతున్న తరుణంలో హాస్యం -పంగీతం- ల విలువ పెంచుతున్నందుకు హాసం కు ప్రత్యేక అభినందనలు. నాకు బహుమతి వచ్చిన సందర్భంగా 'వ్యక్తిగతంగా హాసం స్పందించిన తీరు అభినందనీయం.

**- పి.వి.శివ ప్రసాద్, భక్తవత్సల నగర్, నెల్లూరు.**

సరిగపదమని-6 డ్రా ఫలితాలలో 4వ విజేతగా ఎన్నికైన డి.వెంకటగిరి శివప్రసాద్ టెలిఫోన్ నెంబరును ఇవ్వలేదు. 'హాసం' నుండి టెలిగ్రాం 5-3-2004న ఇస్తే 'అడ్రసు తప్పు' అంటూ తిరిగి వచ్చేసింది. కనుక 4వ బహుమతిగా ప్రకటించిన బహుమతిని ఈ క్విజ్ వరకు రద్దు చేస్తూ, 'సరిగపదమని' క్విజ్‌లో పాల్గొనగోరే పాఠకులు సరియైన అడ్రసును, వీలైతే ఫోన్ నెంబరును పేర్కొనవలసిందిగా ఈ సందర్భంగా విజ్ఞప్తి చేస్తున్నాం.

**- ఎడిటర్**

## కొంటెకొశ్నెన్లు - తుంటరి జవాబులు



**బి. శ్రీనివాసాచార్య, హైదరాబాద్**

**ప్ర: బ్రూస్‌లీ పేరుప్రఖ్యాతులొచ్చాక ఏమయ్యాడు?**

జ: 'కాస్ట్' లీ అయ్యాడు.

**ప్ర: లవ్‌స్టోరీలన్నీ ఈ మధ్య ఏమవుతున్నాయి?**

జ: 'స్టవ్' స్టోరీలవుతున్నాయి!

**ప్ర: డాక్టరుకు 'జాలి' గుండె ఎందుకుండ కూడదు?**

జ: వుంటే తను 'జాలీగా' వుండలేడు కాబట్టి!

**వి. మంజూరాణి, హైదరాబాద్.**

**ప్ర: శుభ్రతకు ప్రాణం పెట్టేవ్యక్తి తగువుకొస్తే?**

జ: పేచీ పెట్టినా 'మడత' పేచీయే పెడతాడు.

**ప్ర: అతి తెలివి అంటే?**

జ: 'టిబెట్' అంటే 'టీ' పందెం వేసుకోవడం అనుకునేవాడు.

## ఈ రూటే వేరు



'మై'ల - నా చట్టం

'గో' దారి - పోవుదారి

'పంచ' దార - ఐదు దారుల కూడలి

**- బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం**



## చిలిపి లిపి



ప్రతిఫలం - Copy Fruit

అరికాలు - Enemy Leg

**- నన్నపనేని రవి, ఉలిచి.**

పిండి వంటలు - Flour Dishes

గోరు చిక్కుడు - Nail beans

**- మామిడి మహేంద్ర, పూణే.**

## పేరు - రిపేరు



ఆడంతే అదోటైపు- ఇంట్లో రామయ్య వీధిలో కృష్ణయ్య

**-ఏజెర్ల,సత్యనారాయణ. హైదరాబాద్.**

ఉపేంద్ర - తిక్కశంకరయ్య

**-పద్మజా ప్రభాకర్, నందిగామ**

భార్యాభర్తలు - ఒకరికి ఒకరు - తోడునీడ - కలసిఉంటే కలదు సుఖం

**-వై.ధీరజ్‌కుమార్, నందిగామ.**

## చిలిపి కవిత




కవిగారి ఇంటిపేరు 'చందస్సు'
భార్య పేరు 'తేటగీతి'
కుమారులు 'మత్తేభం, శార్దులం'
కూతుళ్ళు 'చంపకమాల, "ఉత్పలమాల'
బావమరిది చెవిలో 'సీసం'
ప్రియురాలు 'ఆటవెలది'
భుజం మీద వేసుకునే కండువా ఆయన 'కందం'

**- జయంతి వెంకటరమణ - పెందుర్తి.**

## డబుల్ రోల్



మీ గోలేంటి '(గోల్ ఏంటి)అని అడుగుతుంటే మధ్యలో 'మీ గోలేంటి'?
ఏదో రకంగా ఆ దోర కాయ తినాలని వుంది

**-బి.వి.రావు (రుద్రాపురం)**

'హాసం' వుంటే ఎవరికైనా సరే నిక్షేపంలా కాలక్షేపం అవుతుంది

**-మునిశ్రీలత రేపల్లె.**

అతను కాలు జారి కాలువలో పడ్డాడట.

**- వరదా సాయికుమార్, పర్లాకిమిడి, ఒరిస్సా**

## షార్ట్‌కట్స్



| | | |
|---|---|---|
| తాడిపర్తి రవళి | - | తాళి |
| కోదాడ మాలతి | - | కోతి |
| అందే రాధ | - | అంధ |

**- గణేష్ పూడి, అనకాపల్లి.**

| | | |
|---|---|---|
| బాణాపురం లావణ్య | - | 'బాలా |
| రామడుగు వేమారెడ్డి | - | రావే |
| హారాల సంగీత | - | హాసం |
| తేనేపల్లి వేణు | - | తేవే' |

**- సిలువేరు పుష్పలత,దేవరకొండ.**

## పేరడీ పెరేడ్



పల్లవి : అందమైన గోతిలో అంత బురద ఎందుకో..?
ఎందుకో...?ఎందుకో.....?ఎందుకో....?
కాంక్రీటు కాల్వలో కంపు నీరు ఎందుకో...?
ఎందుకో...?ఎందుకో.....?ఎందుకో....?
ఎందుకో... అసలెందుకో.. అడుగెందుకో ..?
మురికి పంది మునిగి తేలినందుకా..? ॥అందమైన॥

చరణం: అక్షరాలు రెండే ..మధ్య సున్న ఉంటే
పదికూడ పందౌవునులే
చెత్త గిత్తలనకా ...గడ్డీ గాబులనకా ...
పరపర నమిలేస్తుందండీ.....
రోడ్లు మీద తిరిగీ రోత పన్లు చేస్తే రాటుదేలి పోదామరి...
ఊరు మొత్తం తిరిగేదది ఊరపంది కాదా...
దానికంటే బలిసేదేది..? ॥అందమైన॥

చరణం: సంతతి కోసం... సందులు తిరిగీ
మందలు మందలుగా వెలసీ
గోల చేసుకొంటూ దారికడ్డమొస్తూ కంపుని వ్యాపింపచేస్తూ
తన్నులెంత తిన్నా మరి చిన్న బుచ్చు కోక
దున్నలాగె ఉంటూ తింటూ
బుల్లి పందులన్నీ ఆ బురదలోన పడితే దుర్వాసన
దూసుకురాదా...? ॥అందమైన॥

('జయం' చిత్రంలో 'అందమైన మనసులో అంత అలజడెందుకో...?' పాటకు పేరడీగా....)

**- బి.సోమరాజు, జిల్లా పరిషత్ హైస్కూల్,**
**వీరనారాయణం, యస్.కోటమండలం,**
**విజయనగరం జిల్లా.**

ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన బి.సోమరాజు గారికి సోహన్ మ్యూజిక్ వారు 'సత్యం' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN MUSIC



# 'యిడియట్ బాక్స్ బద్ధలయింది

- పోలాప్రగడ జనార్ధనరావు (జెన్ని

"యిడియట్ ఎప్పుడూ ఆ యిడియట్ బాక్స్ ముందే కూర్చుంటావు. ఉద్యోగం ఇంట్లో కూర్చుంటే రాదు. వెతకాలి. వెతికి వెతికి పట్టుకోవాలి." ఏ విషయమైనా ఒకేసారి చెప్పే తండ్రి ఏకనాదం మాటలకి పౌరుషం వచ్చింది అంజి అని పిలవబడే ఆంజనేయులు అనే కొడుక్కి.

"ఆ వెతికి వెతికి పట్టుకోడానికి అది పని మనిషి పారేసిన పప్పుగిన్నె కాదు. వాడు నేను యింక చదవను, వ్యాపారం పెడతాను మొర్రో అంటూంటే పెట్టుబడి పెట్టచ్చుగా" అంటూ లేక లేక ఇంక ఓపిక లేనప్పుడు పుట్టిన కొడుక్కి సపోర్టు చేసింది అంజి అమ్మ అంజమ్మ.

"వీడికి వ్యాపారంలో పెట్టుబడి పెట్టడం కంటే రోడ్డున పోయే ఏ తలమాసిన వాడికో దానం చేస్తే పుణ్యం వస్తుంది" అని ఏకనాదం అన్నాడో లేదో

"యస్క్యూజ్‌మి సార్, తలమాసిన వాడికి దానం అంటున్నారు. క్రాఫ్ కట్ చేయించుకుని ఆరు నెలలు అయ్యింది. డబ్బుల్లేవు... మీరు దానం ఇస్తే ఆ డబ్బుతో మీ పేరు చెప్పుకొని ఏకంగా గుండు చేయించుకుంటా" అన్నాడు ఓ నిరుద్యోగి.

"మావాడ్ని దానం ఇస్తా, ఒకరి గుండు ఒకళ్ళు గీక్కోండి. బుర్ర తక్కువ వెధవలు" అంటూ తిట్టి పోసాడు ఏకనాదం.

"ఎవరి అదృష్టం ఎలావుందో... పోనీ పెట్టుబడి పెట్టచ్చుగా" ఒక్కగానొక్క కొడుక్కి సపోర్టు చేసింది అంజమ్మ.

"ఒరేయ్ అంజీ వ్యాపారం చెయ్యడానికి డబ్బుకంటే బుర్ర ముఖ్యం. నీకు రెండోది వుంటే మొదటిది అదే వస్తుంది. ఎలక శ్రేష్ఠి కథ వినలేదూ- చచ్చిన ఎలకను పెట్టుబడి పెట్టి దాన్ని పిల్లి యజమానికి అమ్మి దానికి బదులు ఆయన దగ్గర దోసెడు శెనగలు పుచ్చుకొని కట్టెలు పుచ్చుకొని వాటితో వ్యాపారం చెయ్యలేదూ... ఆలోచిస్తే నువ్వు 24 గంటలూ చూసే ఆ



టీ.వి.యే నీకు అయిడియా ఇస్తుంది అన్నం పెడుతుంది" అంటూ బొజ్జ ఆడించుకుంటూ విస విసా వెళ్ళిపోయాడు ఏకనాదం.

పాతికేళ్లకే పావు బస్తా పెరిగిన బొజ్జను నిమురుకుంటూ, రాత్రి టీ.వి.లో ఆఖరి సీరియల్ అయ్యేంత వరకు ఆలోచించాడు అంజి. సూర్యుడు నడినెత్తిన వచ్చేసరికి ఆ వేడిలో ఆలోచన వేడి ఢీ కొని తళుక్కున అయిడియా రావడం తడవుగా సొంత ఇంట్లో ముందు గది బాగు చేయించాడు ఆఫీసు పెట్టడానికి.

అందరితో కబుర్లు చెప్పే అమ్మ అంజమ్మను పబ్లిసిటీ ఇన్‌చార్జి చేసాడు. చదువు మానేసి అరేబియా గుర్రంలా పెరిగి, ఇంటింటికి తిరిగే ఇండియా గాడిదలాంటి మేనమామ కూతుర్ని మార్కెటింగ్ హెడ్ చేసాడు. టీ.వి. సీరియల్స్ చూడ్డంలో తనకి మల్లే అపారమైన అనుభవం వుండి బేవార్సుగా తిరిగే వేనల్లుడు బుద్ధేశ్వరావును బిజినెస్ పార్టనర్ చేసుకున్నాడు. 'చెత్తనుండి విద్యుత్ తియ్యవచ్చు' అనే ఆలోచన బుర్రలో బల్బులా వెలిగి తన వీధిలో వున్న 'చెత్తగ్యాంగు'ని రెప్రజెంటేటివ్స్ కమ్ ఓరల్ యడ్వటైజర్స్‌గా కమీషన్ బేసిస్ మీద అపాయింట్ చేసాడు. ఎవరికి ఏం చెయ్యాలో చెప్పాడు.

ఒక శుభ ముహూర్తాన అరుగుమీద గది ముందు అరువు పెట్టి రాయించిన "టీ.వి.క్లినిక్" అన్న బోర్డు ఉరేసుకొని వేళ్ళాడింది.



ప్రథమోధ్యాయం సమాప్తః కొబ్బరి కాయ కొట్టి ప్రథమ గణంతో పని ప్రారంభించాడు మన హీరో ఆంజనేయులు.

సైకిల్‌కి టీ.వి కట్టారో టీ.వి.కే సైకిల్ కట్టాడో తెలియనంత అయోమయంలో బరువుగా భారంగా సైకిల్ లాక్కొచ్చాడు ఓ ఆసామి అంజి "టీ.వి.క్లినిక్" ముందుకు.

ప్రథమ గణంలో ఓ గణం గంట కొట్టింది ప్రథమ బేరం వచ్చిందని ఆనందంగా.

"బాబూ ఇంట్లో వాళ్ళందరూ వారం రోజుల్నించి విలవిల్లాడిపోతున్నారు. పచ్చి మంచి నీళ్ళు ముట్టడం లేదు. కనీసం కాచినవి తాగమన్నా తాగడం లేదు. నువ్వే బాగు చేయాలి" అంటూ అన్నం తిని వారం రోజులు అయ్యింది అన్నంత దీనంగా వున్న ఆ సైకిల్ ఆసామీ విలాపం తన ఆఫీసు బోర్డు విషయంలో ఆలోచనలో పడేసింది అంజిని.

"ఎవర్ని బాగు చెయ్యాలి? ఇంట్లో వాళ్ళనా?? నా వల్లకాదు"

"ఇంట్లో వాళ్లను కాదు నాయనా. టీ.వి.కి..."

"చూడండి అంకుల్"

"చూడలేకే కదూ నీ దగ్గరకు తీసుకొచ్చాను"

"ఇది టీ.వి. రిపేర్ షాపు కాదు"

"మరి బోర్డు అలా ఎందుకు పెట్టారు?"

"అలా పెట్టకపోతే కనబడదు కాబట్టి"

"అసలేమనుకుంటున్నావు నాగురించి?"

"నేను యింకా ఏం అనుకోలేదండి... అనుకోగానే తెలియ పరుస్తా... రేపే పేరు మారుస్తా"

"నా పేరు మార్చడానికి నువ్వు ఎవరివి? పుట్టినప్పటినుంచి చచ్చే వరకు నా పేరు కోటేశ్వర్రావే"

"అబ్బా మీ పేరు కాదండి.."

"టీ.వి. పేరు మార్చితే నేనస్సలు ఒప్పుకోను. నాది సోనీ టీ.వి. దీన్ని మా కార్యం రోజున మా మామగారు మా ఆవిడకి అమాంబాపతు అన్ని కార్యక్రమాలు చూడమని యిచ్చారు" అంటూ పెళ్ళాన్ని పట్టుకున్నంత ఆప్యాయంగా టీ.వి.ని పట్టుకువెళ్ళాడు ఆ ఆసామి.

అత్యవసర సమావేశంలో బోర్డు మెంబర్లు అందరూ ఏకగ్రీవంగా బోర్డు మార్చాలని ఆమోదం తెలుపుతూ ఆఫీసు పేరుని "టీ.వి.ప్రేక్షకులకి సలహాలు సంప్రదింపులు" అంటూ నూతన నామకరణం చేసారు.

ద్వితీయోధ్యాయం అయింది కాబట్టి చచ్చినట్టు తృతీయం ప్రారంభం.

* * *

అనసూయమ్మగారు ఆరునెలల క్రితం అమెరికా వెళ్ళి కోడలు పురుడుపోసి కూతురి



కొన్ని పరిచయాలు జీవితాంతం వుంటాయి. కొన్ని పరిచయాలు జీవితం అంతం అవుతోంటే ఏర్పడతాయి... మరికొన్ని పరిచయాలు జీవితాల్ని అంతం చేస్తూ వుంటాయి... ఇవన్నీ అందరికీ సుపరిచితాలే...

ఏమిటీ ఈ ధోరణి యిలా పోతోంది అనుకుంటే, తప్పు నాది కాదు... ఎవరి పరిచయం గురించి రాద్దాం అనుకుంటున్నారో ఆ అంత్యప్రాసల దిట్ట 'రాజా'ది.

మా ఇద్దరి పరిచయం ఈనాటిది కాదు. రమారమీ పాతికేళ్ళ క్రిందట, ఒకే వేదిక మీద జేసీస్ అవుట్‌స్టాండింగ్ ఎంగ్ పెర్సన్స్ ఎవార్డులు నేను మూకాభినయ కళాకారుడిగా, రాజా ఉత్తమ జర్నలిస్టుగా అందుకున్నాం. అప్పుడు మేం ఇద్దరం ఇప్పటికంటే యంగే!

నేను నాటకాలు మైమ్, టీవీ సీరియల్స్, సినిమాల్లో తంటాలు పడుతూ, అప్పుడప్పుడు కథలు రాస్తుంటే, 'రాజా' ఇంతై, ఇంతింతై ఎంతో ఎదిగిపోయాడు... రచయితగా, ఎడిటర్‌గా.

పాత పరిచయాన్ని పురస్కరించుకొని కొంచెం చనువుగా 'రాజా కథ రాసానోయ్' అన్నా... 'పంపించు బాగుంటే వేస్తా' అన్నాడు నిర్మొహమాటంగా... సూటిగా మాట్లాడ్డమే అతన్ని ఇంతవాడ్ని చేసింది... అలా విపులంగా మాట్లాడ్డం విపరీత ధోరణి అనిపించింది... "బావుంది కథ బాగానే వచ్చింది" అన్నా. "నీకు బాగుంటే సరిపోదు నాకు, పాఠకులకి బాగుండేలా వుండాలి" అన్నాడు రాజా. కొంచెం పౌరుషం వచ్చి వెంటనే పంపా... వారం రోజుల్లో కబురొచ్చింది. కథ బావుంది. ప్రచురిస్తున్నాం అని... ఇంత ఫాస్ట్‌గా నిర్ణయాలు తీసుకోబట్టే 'హాసం' టైమ్ ప్రకారం మనల్ని నవ్విస్తోంది... పౌర్ణమి నెలకోసారి వస్తే 'హాసం' పదిహేను రోజులకి మనల్ని ఆనందంలో ముంచుతోంది... మరో పదిహేను రోజులు హాయిగా వుండేలా చేస్తోంది... ఇంతకంటే ఇంటిల్లిపాదికి యింకేం కావాలి...

వుంటా మరి

భవదీయుడు

**పోలాప్రగడ జనార్ధనరావు (జెన్ని)**

పురిటి కోసం ఇండియా తిరిగివచ్చారు. ఆ కేసు తెచ్చింది అంజి అమ్మ అంజమ్మ.

102 నెంబరు గల టోకన్ యిచ్చాడు ఆవిడకి బుద్దేశ్వర్రావు. అసలు అంజి ప్రింట్ చేసినవి 100 నెంబరు నుంచే ప్రారంభం.

"నాకు పిలుపు ఎప్పుడు వస్తుందో" అంది టోకన్ చూసుకుంటూ అనసూయమ్మగారు.

"వాడు పిలవగానే వస్తుంది" అంటూ ఆవిడ చూడకుండా పైనున్న దేవుడికి దణ్ణం పెట్టాడు బుద్దేశ్వర్రావు. "ఇప్పటికే మావాడు వందమందిని చూసాడు" అంటూ బిల్డప్ యిచ్చాడు.

అంజి రంగంలోకి దిగాడు.

"మీ అమ్మాయికి ఏ టైమ్‌లో పురిటి నొప్పులు ప్రారంభమయ్యాయో వివరంగా చెప్పండి బామ్మగారు"

"సరిగ్గా మూడు రోజుల క్రితం రాత్రి టీ.వి.లో 'నిధి' సీరియల్ చూస్తూంటే నొప్పులు వచ్చాయి. అమ్మాయేమో సీరియల్ అయితే గాని హాస్పిటల్‌కి రానంటుంది. నాకేమో కాళ్ళూ చేతులూ ఆడ్డం మానేసాయి. బలవంతంగా హాస్పటల్‌లో జేర్పించాము. నెప్పులు వస్తాయి ఆగిపోతాయి. మళ్ళీ కాస్సేపటికి అందుకుంటాయి. వెంటనే అందకుండా పోతాయి. ప్రథమకాన్పు. అర్భకురాలు. డాక్టర్లు సిజేరియన్ చెయ్యడానికి భయపడుతున్నారు. కేసు పూర్వాపరాలు తెలుసుకొని మీ దగ్గరకి పంపారు నన్ను. మా కంగారేకాని భగవంతుడికేం తొందరలేదు" అంటూ ఆయాసపడుతూ చెప్పింది అనసూయమ్మ.

"యురేకా యురేకా" అంటూ గట్టిగా అరిచాడు అంజి.

"అమ్మాయి పేరు యు.రేఖ కాదు ఐ.శశిరేఖ




నాయనా"

"కంగారు పడకండి. ఏ పేరైనా ఒకటే. మా వాడికి హడివిడిలో అయిడియా వస్తే అల్లాగే అరుస్తాడు" అంటూ బుద్దేశ్వర్రావు మేధావిలా ఆవిడ్ని స్థిమిత పరిచాడు.

"నో టైమ్... నో టైమ్... కమాన్ హర్రీ అప్" అంటూ అందర్నీ హాస్పిటల్‌కి ప్రయాణం కట్టించాడు అంజి. అంటే ఏదో యాక్సిడెంట్ చేశాడని కాదు. అందరూ ప్రసూతి హాస్పిటల్‌కి బయలుదేరారు. ఏం చెయ్యాలో అన్నీ వివరంగా పెద్ద సర్జన్‌కి హౌస్‌సర్జన్‌కి చెప్పినట్టు చెప్పాడు




బుద్దేశ్వర్రావుకి. హాస్పిటల్‌లో వీళ్ళ కంగారు చూడగానే సినిమా క్లైమాక్స్‌లో విలన్ హాస్పిటల్‌లో దాక్కుంటే పోలీసు వాళ్ళు చేసే హడావిడి గుర్తొచ్చింది అక్కడ స్టాఫ్‌కి.... అంజి డాక్టర్‌తో మాట్లాడాడు... ఎందుకైనా మంచిదని డాక్టర్ని పేషంటు పక్కనే వుండమన్నాడు.

మూడు రోజుల్నించి 'నిధి' సీరియల్‌లో ఏం జరిగిందో సీను ప్రకారం డైలాగ్ టు డైలాగ్ పేషంటు చెవిలో ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు కళ్ళకు కట్టినట్లు చెప్పడం మొదలెట్టారు అంజి బుద్దేశ్వర్రావు. కథ వింటున్న పేషంటు ముఖంలో మార్పులు గమనించసాగారు డాక్టర్లు. "నిన్నరాత్రి విలను హీరోను కసకసా పొడిచాడు" అంటూ భయంకరంగా చెప్పాడు అంజి. అంతే! కెవ్వున కేక, తరువాత క్యార్ క్యార్ మంటూ ఏడుపు అందరూ హమ్మయ్య అనుకుంటూ బయటకు వచ్చారు డాక్టర్లు తప్ప.

"నాయనా నా కేసు కూడా"

"బామ్మగారు మీకూ నెప్పులా" అంటూ నాలిక కరుచుకున్నాడు బుద్దేశ్వర్రావు.

"అవును నాయనా ఇదో రకం నెప్పి. నేను అమెరికా వెళ్ళేంతవరకు 'అయినవాళ్ళు' సీరియల్ చూసేదాన్ని ఆరు నెలలు అక్కడ వుండటంతో కథ ఏం జరిగిందో అని ఆందోళన. దేశం కాని దేశంలో మన భాష రాని వాళ్ళు మిగతా కథ ఎలా చెబుతారు చెప్పు?"

"ఒక్క అంగుళం కూడా ముందరకి కదల్లేదు కథ, కంగారు పడకండి" అంటూ ఫీజు తీసుకున్నాడు అంజి.

"వాట్ ఎ మిరికల్ యిటీజ్" అనుకుంటూ డాక్టర్లు ప్రెస్ కాన్ఫరన్స్ పెట్టారు. అంజి ఫోటో పేపర్లో పడింది. విలేఖర్లు పొగిడారు. అంజి టీ.వి సీరియల్స్ చూసే ప్రేక్షకులకి చేస్తున్న సేవ గురించి పేపర్లు మోతెక్కించాయి.

చతుర్థాధ్యాయానికి చతురంగ బలాలు కదిలాయి.

* * *

పేపరు వాళ్ళ పెన్ను వాసి బాగుంది. అంజి ఆఫీసు ప్రేక్షక పేషంట్లలో కలకలం పుట్టింది. త్వరలో గిన్నీస్ బుక్ రికార్డ్స్‌లో ఎక్కబోతోంది.

మూడు నెలలు నిండని ముక్కుపచ్చలారని పసిపిల్లాడు పేషంటుగా రావడం అంజి అండ్‌కో జీర్ణించుకో లేకపోయింది.

"పిల్లాడు ఒకటే ఏడుపండి" యింకా ఏదో చెప్పబోయిన తల్లిని వారించాడు అంజి.

"పిల్లాడు మొదటిసారి ఏ పరిస్థితుల్లో ఏడ్చాడు"

"పుట్టిన వెంటనే ఏడవలేదు. మా అమ్మ వాడి పిర్రమీద ఒక్కదెబ్బ వేసింది అదుగో అప్పుడే

మొదటిసారి ఏడ్చాడు."

"అబ్బా ఆ ఏడుపు గురించి కాదమ్మా నా ఏడుపు. ఈ రకమైన ఏడ్పు ఎప్పటినుండి?"

"నిన్న రాత్రి నుంచి"

"ఏడ్పు మాన్పించడానికి మీరేం చేసారు"

"పాలు పట్టా, గ్రైపువాటర్ పోసా, భుజాన వేసుకొని ఆడించా, చిల్డ్రన్ స్పెషలిస్టు దగ్గరకి తీసుకెళ్ళా. ఆయన వల్లకాక కుర్రాడి ఏడుపు వినలేక కళ్ళమ్మట నీళ్ళెట్టుకొని మీ దగ్గరకి తీసుకెళ్ళమన్నారు"

అన్ని ప్రశ్నలు అంజే వేస్తే తన ఉనికి ఎవరూ గమనించరని "నిన్న రాత్రి భోజనంలో ఏం పెట్టారు?" అని అడిగాడు బుద్దేశ్వర్రావు ఏదో ఒకటి అడగాలని.

"పసిపిల్లాడు అన్నప్రాశన అవ్వని వాడు అన్నం ఏం తింటాడు?" అంది ఆవిడ.

అంజి సీరియస్ చూపులకి సొంత నాలిక కరుచుకున్నాడు బుద్దేశ్వర్రావు.

"బాబు కడుపులో పడ్డానికి మీరేం చేసారు" అంజి ఐ.ఏ.ఎస్. ఆఫీసర్లా అడిగాడు.

"మా వారితో కాపురం చేసాను" సిగ్గుగా మెలికలు తిరుగుతూ చెప్పింది.

ఈసారి బుద్దేశ్వర్రావు చూపులకి అంజి నాలిక కరుచుకోబోయి అనుభవం వల్ల తమాయించుకున్నాడు.

"నా ఉద్దేశ్యం అది కాదు. బాబు కడుపులో పడ్డాక మీ అలవాట్లు.. అదే ఏం తినేవారు? ఏం చదివేవారు? ఏం చేసేవారు?" అని అడిగాడు అంజి, బుద్దేశ్వర్రావు ఒక్క ముఖంలోనే గాంధీ గారి మూడు కోతుల్ని చూసి.

"పాలల్లో కుంకుమపువ్వు తాగేదాన్ని, పుస్తకాలు చదవటం అస్సలు అలవాటు లేదు, పడుకొని టీ.వి.సీరియల్స్ చూసేదాన్ని. ఇప్పటికీ బాబుని పక్కలో వేసుకొని వాడు పక్క తడిపినా సరే ఇద్దరం సీరియల్స్ చూస్తూ వుంటాం" అంది ఆవిడ.

"నిన్న రాత్రి ఏ సీరియల్ చూసారు?"

"నా బొంద ఎక్కడ చూసాం!? మా ఏరియాలో కరెంటు లేదు. లైనుమెన్‌కి షాక్‌కొట్టి పోయాట్ట. వాడి చావుకి సానుభూతిగా 24 గంటల కరెంటు ప్రసారం నిలిపేసారు." అనడమే తడవుగా రెండోసారి యురేకా యురేకా అని అరవబోయి, అస్తమానం అల్లా అరిస్తే అది తప్ప ఇంకోటి అరవటం రాదను కుంటారని సింపుల్‌గా "ఐ గాట్ యిట్" అని ఫార్ములా "అభిమన్యు" ఉపయోగించమని బుద్దేశ్వరరావుకి చెప్పాడు. బుద్దు ఏడుస్తున్న బాబు ఎదురుగుండా టేప్ రికార్డర్ పెట్టాడు. "ఓ విధి




విచిత్రాల పెన్నిధి" అంటూ టైటిల్ సాంగ్ హోరు మంటూ వచ్చింది. అది వింటూ ఇంకా ఏడుపు లంకించుకున్నాడు.

"అబ్బే ఆ సీరియల్ మేం చూడమండీ" అంటూ సన్నాయి నొక్కులు నొక్కింది ఆవిడ.

మరోసారి టేప్ నొక్కాడు "ఆడది... ఆడది..." అంటూ పాట మొదలయ్యింది. మళ్ళీ ఇంకా గట్టిగా ఏడ్వడం మొదలెట్టాడు.

"ఈ ఛానెల్ మా కేబుల్ ఆపరేటర్ యివ్వడం లేదండి చచ్చినాడు. నెలకి 150/- రూపాయలు అప్పనంగా పుచ్చుకుంటున్నాడు" అని తిట్టింది.

ఫార్ములా 'ప్రహ్లాద్' ఉపయోగించమన్నాడు అంజి.

ఈసారి సి.డి. ఆపరేట్ చేసి, టీ.వి.కి కనెక్షన్ ఇచ్చాడు.

"కలవారి కోడలూ.... అంటూ పాట మొదలయింది.

"ఆ సీరియల్ చూస్తామండి. మావాడికి నాకూ ఈ పాట అంటే ఇష్టం. ఈ పాట వింటే కాని పడుకోం."

"ఊ ఈ ట్రీట్‌మెంటే కంటిన్యూ చెయ్యండి పేషంటుకి ఢోకాలేదు" అంటూ తరువాత పేషంటుని చూడ్డానికి వెళ్ళిపోయాడు అంజి.

పాట వినబడుతోంది. ఆ పాట వినడానికి ట్యూన్ అయిన పసివాడు ఏడుపు మాని హాయిగా నిద్దరపోయాడు.

ఆ తల్లి ఆనందం వర్ణనాతీతం. జంట నగరాల్లో తల్లులందరికి ఈ విషయం చెబుతాను అంటూ దండంపెట్టి నిద్దర కళ్ళతో బాబుని భుజాన వెసుకొని వెళ్ళింది.

ధర్మం నాలుగు పాదాల నడుస్తోంది కాబట్టి పంచోమోధ్యాయానికి పయనిద్దాం.

* * *

ఆదివారం ప్రతి వారంలాగే శనివారం అయిన తర్వాతే వచ్చింది.

రాత్రి 8 గం॥ అంజి ఒక్కడే ఆఫీసులో కూర్చొని కొత్త సీరియల్స్ పేర్లు కంప్యూటర్‌లోకి ఎక్కిస్తున్నాడు.

ఇంతలో భార్యాభర్తలు ఆఫీసులోకి వచ్చారు. సకల చరాచర జీవరాసుల్నీ నోట్లో యశోదకు చూపించిన చిన్న కృష్ణుడిలా భార్యనోరు తెరుచుకొని వుంది. ఎగిరే జీవరాసుల్ని నోట్లోకి వెళ్ళకుండా విసనకర్రతో తోలుతున్నాడు భర్త.

"ఏమిటి మీ ప్రాబ్లమ్" అడిగాడు అంజి ఆ భర్తను.

"క్రిందటి ఆదివారం 10 గం॥లకు సప్తమీ నక్షత్రయుక్త లగ్నమందు మా ఆవిడ నోరు



పడిపోయింది."

"నోరు పడిపోవడం ఏమిటండీ నిక్షేపంలా అక్కడే వుంటే"

"పడిపోవడమంటే మాట పడిపోయిందండి. ఈ వారం రోజులు నోరు తెరుచుకొని వుందండి. నేను విసురుతూనే వున్నానండి. డాక్టరు చెప్పిన టానిక్కులు, మందులు గొట్టం సాయంతో గొంతులో పోస్తూనే వున్నానండి. మీ మేనమామ కూతురు పండు మా ఆవిడ ఫ్రెండటండి. ఆవిడే చెబితే మీ దగ్గరకు వచ్చామండి."

ఆ భర్త మాట స్పీడు వింటూంటే ఆయనకి మాట పడిపోతుందేమో అనిపించింది అంజికి.

"మాట పడిపోయేముందు ఏం చేసింది మీ ఆవిడ"

"నన్ను నానా మాటలూ అందండి"

"నిన్ను తిట్టడం సరే. అది ప్రతి కొంపలో వున్నదే... నిన్ను నానా మాటలూ అనే ముందు ఆవిడ ఏం చేస్తోంది"

"నన్ను తిట్టడానికి మాటలు వెతుక్కుంటోందండి... తెలుగు డిక్షనరీ చూసిందండి"

"ఒరి నీ దొంక తిరుగుడు తగలయ్యా... ఆ టైమ్‌లో ఆదే ఆ రాత్రి ఏం చేస్తోంది"

"ఏం చేస్తుందండి.... నేను వంట చేస్తున్నానండి... అది 'నాగమ్మ' సీరియల్ చూస్తోందండి. నా వంట అయ్యిందండి. సీరియల్ అయ్యిందండి. దాని నోరు ..కాదు.. మాట పడిపోయిందండి"

"పెళ్ళాం నోరు లేనిదయితే అదృష్టం అట్లాగే వుండనియ్యండి"

"అబ్బే అది తిట్టకపోతే అదోలా వుంటుందండి నాకు... వినరలేక చచ్చిపోతున్నానండి." అంటూ కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకున్నాడు ఆ మహాపతివ్రతుడు.




కంప్యూటర్‌లో 'నాగమ్మ' తారీఖు, టైమ్ ఫీడ్ చేసి, టీ.వి.కి కనక్షన్ యిచ్చాడు అంజి క్రిందటివారం ఆ సీరియల్‌లో పాము హీరోయిన్‌ని కాటు వెయ్యబోయి ఫ్రీజ్ అయిన పాము ఈ వారం హీరోయిన్ దణ్ణం పెట్టడంతో పడగదించి పాక్కుంటూ వెళ్ళిపోయింది.

హమ్మయ్య అని నోరు మూసింది మన భార్య.... సారీ ..ఆయన భార్య.

భార్యాభర్తలిద్దరూ అంజికి దణ్ణంపెట్టి ఫీజు చేతిలో పెట్టి నాగమ్మకి నమస్కరించుకుంటూ వెళ్ళిపోయారు.

ఈ విషయం ఆనోటా ఆనోటా నాగమ్మ సీరియల్ ప్రొడ్యూసర్ చెవిని పడింది. కెమేరా తీసుకొని అంజి ఆఫీసుకు వచ్చాడు ఈ సీరియల్ డైరెక్టర్. అంజిని ఇంటర్వ్యూ చేసి 'ఈ సంఘటన మా సీరియల్‌లో ప్రసారానికి ముందు పబ్లిసిటీగా ఉపయోగించుకుంటాం' అంటూ గుడ్‌విల్‌గా డబ్బు అంజి చేతిలో పెట్టి వెళ్ళాడు.

పంచమోధ్యాయం నుంచి యింక పరమపద సోపానానికి ప్రవేశిద్దాం.

* * *

మరునాడు రీక్యాప్ అదే జరిగిన కథ మళ్లీ కొంచెం వేసిన టీ.వి సీరియల్ దృశ్యంలా యథావిధిగా యదాలాపంగా తెల్లారింది. ఆ రోజు అంజి జీవితంలో గొప్ప టర్నింగ్ పాయింట్ అవుతుందని కలలో కూడా అనుకోలేదు. కొత్త ఆఫీసు పెట్టారు బంజారాహిల్స్‌లో... పాత బ్యాంకు నుంచి సంపాదించినదంతా విత్‌డ్రా చేసి తెచ్చాడు.... ఇన్‌కమ్ టాక్స్ ఎగ్గొట్టి డబ్బు ఎక్కడ పెట్టాలా అని ఆలోచిస్తున్నాడు.

ఇంతలో సినిమాల్లో విలన్లులాంటి ఇద్దరు అన్నదమ్ములు అంజి ఆఫీసుకి గ్లిజరిన్ లేకుండానే కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుంటూ వచ్చారు.

"ఏమిటి మీ ప్రాబ్లమ్" అన్నాడు అంజి బెరుగ్గా.

"ఈడు నా తమ్ముడు. మా సవత్తల్లి కొడుకు. మా నాయన కోటీశ్వరుడు. ఆయనకి నాలుగు రోజుల్నించి సానా సీరియస్‌గా వుంది. మాట పడిపోయింది. మనిషిని లోపలెడుతున్నాం, బయట పెడుతున్నాం గాని ప్రాణం పోవటం లేదు. ఆయన పోతే గాని మాకు అనుభవించడానికి ఆస్తి చేతికి రాదు. చూస్తూ చూస్తూ ప్రాణం తియ్యలేక పోతున్నాం. ఆయన మానాన ఆయనే పోతాడులే అనుకుంటూంటే, మొండి ఘటం ఏదో మమకారం పీకుతున్నట్టుంది సావటం లేదు. డాక్టర్లు పెదవిర్చి ఎప్పుడు పోతాడన్నది మీ అదృష్టం అన్నారు. ఆయన ప్రాణాలు పోయేట్టుచేసి మా ప్రాణాలు నిలబెట్టాలి" అంటూ కాళ్ళు పట్టుకోవడం అలవాటు లేక కాలరు పట్టుకునేటట్టు చూసారు.

"మీ నాయనగారి దినచర్య ఏమిటి?" అడిగాడు అంజి భయం భయంగా.

"ఆడి దినం మా బొంద... కనబడక పోయినా యినబడకపోయినా టీ.వి.నే అంటి పెట్టుకొని కూర్చుంటాడు..... కేబుల్ ఆపరేటర్‌కి తను చూసే సీరియల్‌కింత అని మాట్లాడు కుంటాడు కాని సీరియల్ బావోలేకపోతే కాణీ యివ్వడు. ఈడి దగ్గర డబ్బు వసూలు సెయ్యలేక ఆడు సచ్చాడు కాని ఈడు మాత్రం సావడు మమ్మల్ని మాత్రం సంపుకు తింటున్నాడు."



అంజి చెవిలో ఏదో వూదాడు బుద్ధేశ్వర్రావు.... యిన్నాళ్ళు ఈ వెధవ సలహాలు సంప్రదింపులు వాళ్ళ ఆస్తిలో 10% వాటా అడిగితే పోలా అనుకొని ఆ విలన్లకి తన కండిషన్లు చెప్పాడు. వాటికి వాళ్ళు ఓ.కె. అన్నారు ఎలాగో అలాగ ఛస్తే అంతే చాలు అన్న ధోరణిలో.

అందరూ కలిసి రౌడీల ఇంటికి వెళ్ళారు. హాలులో పడుకోబెట్టారు ముసలాయన్ని. విలన్ల తల్లి ప్రమిదలో నూనెపోసి వత్తి రడీ చేస్తోంది. తల దగ్గర దీపం పెట్టగానే ఆస్తి చక్కబెట్టాలని.

"మీ ఆఖరి కోరిక ఏమిటి?" ముసలాయన చెవి దగ్గర గట్టిగా అరిచాడు అంజి.

ఆయన మూడు వేళ్ళతో ఏదో రౌండుగా చుట్టి మూకాభినయం చేసాడు.

"తొక్కుడు లడ్డూ కావాలంటున్నాడు తొందరగా తీసుకురండి" ఆయన పోయిన వెంటనే మైలలో తిందామని రడీగా పెట్టుకున్న లడ్డూలు తెచ్చారు.

ఇవి కావు అన్నట్టు ముఖం తిప్పలేక తిప్పుకున్నాడు ముసలాయన.

"మరి ఏమిటి మీ కోరిక... కోరిక...కోరిక..." అంటూ మైక్‌సెట్‌వాడు పెట్టినట్టుగా, సినిమా బావుంది... బావుంది.... బావుంది... అంటూ బావో లేకపోయినా చెప్పే కొత్త ఎడ్వర్‌టైజ్ మెంట్‌లా మరో చెవిలో అరిచాడు బుద్ధేశ్వర్రావు.

ముసలాయన కళ్ళల్లో చిరు ఆశ వీళ్ళెవరో తన కోరిక తీర్చడానికి వచ్చిన నరనారాయణులు అనుకున్నాడే తప్పితే తనపాలిట యములోళ్ళు అనుకోలేదు. ఆఖరిసారిగా ఓపిక అంతా కూడగట్టుకొని రెండు చేతులు ఎత్తి చతురస్రంలా చూపుతూ యింక నేను చేతులెత్తలేను అన్నట్టు ఠపీమని చేతులు క్రింద పడేసాడు.

ఘొల్లుమన్నారు కొడుకులు.... దీపం వెలిగించబోయింది వాళ్ళ అమ్మ.

"ఎందుకంత తొందర, ఇప్పుడేం జరిగిందని... ఆయన ఏదో స్క్వేర్‌లు... యా..ఐ గాట్ యిట్.. కమాన్ తొందరగా టీ.వి.పెట్టండి" అన్నాడు అంజి.

టీ.వి అన్నమాట నారాయణ శబ్దంలా వినిపించి.

"ఆ...ఆ...అస్పష్టంగా అనంత...అనంత" అంటూంటేనే గురక ప్రారంభమయింది. సీరియల్ పూర్తి చెయ్యలేక మధ్యలో ఆపేసిన నిర్మాతలా మూగబోయాడు ముసలాయన.

"మీ అన్నదమ్ముల్లో అనంత్ పేరు ఎవరికైనా వుందా" క్రాస్ యగ్జామ్ చేస్తున్న ప్లీడరులా అడిగాడు అంజి.

"అనంత్ పేరు ఎవరికి లేదండి. ఆయన ప్రతిరోజు ఈ టైమ్‌లో 'అనంతరంగాలు' సీరియల్ చూస్తూ వుంటారు" అంది ఆయన భార్య.

"ఈ సీరియల్ నిన్ననే సడన్‌గా ఆగిపోయిందిగా" అన్నాడు అంజి.

అంతే ముసలాయన గుండె ఆగిపోయింది. గుళ్ళో పూజారిగారు 'అకాలమృత్యుహరణం' అన్నమాట మైకులో ఆ అన్నదమ్ములకి హాస్యాస్పదంగా వినబడింది. ముసలాయన భార్య మహాసాధ్వి దీపం ఒత్తికి మంట పెట్టింది.

అనుకున్న డెత్ ఎగ్రిమెంట్ ప్రకారం విలన్లులాంటి ఆ అన్నదమ్ములు హీరోల్లా ప్రవర్తించి అనుకున్నది అనుకున్నట్టుగా బ్రీఫ్ నిండా స్వచ్ఛమైన నోట్లు యిచ్చారు. ఆనందంగా వాటిని మొయ్యలేక మొయ్యలేక ఆటోలో ఆఫీసుకుతెచ్చి, ఏ కారు కావాలి, బంగళా ఎక్కడ కట్టాలి, కమిషన్ ఏజెంట్లకి ఎట్లా ఎగ్గొట్టాలి మొదలగు ప్లాన్స్ వేస్తూ వూహాలోకాల్లో విహరిస్తున్నారు అంజి, బుద్ధీశ్వర్రావులు.

ఇంతలో ఆఫీసు ముందు రెండు టాటా సుమోలు ఆగాయి. 'సమరసింహారెడ్డి' సినిమా సీనులా రౌడీలు హాకీ స్టిక్‌లు, దుడ్డు కర్రలతో ఓ పదిమందిని వెంటబెట్టుకుని దిగారు ఆ విలన్ అన్నదమ్ములు.

"ఏమిటిసార్ ఎలక్ట్రిక్ క్రిమేషనా? అప్పుడే అయిపోయాయా అంత్యక్రియలు" అన్నాడు అంజి.

"ఆ మీ అంత్యక్రియలు చెయ్యాలనే వచ్చాం"

"ఏమయింది?" మాట రాలేదు నోటమ్మట. గ్యాసే వచ్చింది. శీతాకాలంలో కాశ్మీరులో మిలిటెంట్ల దెబ్బకి కోల్డు స్టోరేజిలో తలదాచు కున్నట్టు వణికిపోయారు అంజి, బుద్ధీశ్వర్రావు.

"మీరు అలా వెళ్ళారో లేదో టీ.వి.లో ప్రకటన వచ్చింది. అనివార్య కారణాలవల్ల ఆగిపోయింది అని దుష్ప్రచారం చేసిన 'అనంతరాగాలు' సీరియల్ కొద్దిసేపట్లో మొదలవబోతోంది అని, అంతే పాము చెవుల ముసలాయన అది విని కొనప్రాణం కూడగట్టుకొని లేచి కూర్చున్నాడు. మమ్మల్ని ఇంత మోసం చేసినవాడు ఈ మధ్య ఎవడూ లేడు. మా డబ్బు, మా ఖర్చులు మొత్తం యిస్తావా ఏసెయ్యమంటావా?" అన్నాడు విలను పెద్దాడు.

ఆ రౌడీ బ్యాచిలో కొత్తగా చేరిన ఎప్రన్‌టీస్ రౌడీ 'ఏసెయ్యమన్నారు' అనుకొని ఆవేశంగా కర్రతో అంజి బుర్ర మీద ఒకటేసాడు. వాడ్ని ఆదర్శంగా తీసుకొని అంతా ధ్వంసం చేసి వాళ్ళ క్యాష్, వీళ్ళ క్యాష్ మొత్తం అంతా పట్టుకొని వికటాట్టహాసాలు చేస్తూ వెళ్ళిపోయారు.

బుర్ర తక్కువ వెధవ అని వాళ్ళ నాన్నచేత తిట్టబడే అంజి తక్కువ బుర్రకి ఎక్కువ దెబ్బే తగిలింది. సంపాదించి అంతా పోయేసరికి దెబ్బ మరీ ఎక్కువ అయింది. మెంటల్ షాక్ తిన్నాడు.

ఎవరైనా టీ.వి. సీరియల్స్ గురించి సలహాలు అడగాలనుకుంటే ఎర్రగడ్డ మెంటల్ హాస్పటల్ రూమ్‌నెంబర్ 'ఏడు' కి వెళ్ళండి. అక్కడ గోడ మీద మసి బొగ్గుతో సీరియల్ పేర్లు ప్రసారమయ్యే టైమ్‌లు పిచ్చిపిచ్చిగా రాస్తూవుంటాడు పాపం అంజి. ■



నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



## అతిథిచేత పనిచేయించకూడదు!

ఉప్పలదడియం చిత్తూరు నాగయ్యగారు (శతజయంతి - మార్చి 28) పోతన, వేమన వంటి అజరామరమైన పాత్రలు ధరించినా, తర్వాత సినిమాల్లో రెండు,మూడు సీన్లలో వచ్చే వేషాలు, కూడా ఎక్కువగా వేశారు. 'అతిథి నటుడు' అనో, గెస్ట్ ఆరిస్టు' అనో వేసి ఆయన పేరు వేసేవారు కొందరు. అలా, ఒక సినిమాలో ఆయన్ని అతిథి పాత్ర వెయ్యమన్నారు.



నాగయ్య

ఒక్కరోజే వర్కు, ఒక్కటే సీను, జడ్జిపాత్ర. ఉషోదయ కాలంలోనే నాగయ్యగారిని తీసుకు వచ్చి మేకప్‌వేసి, డ్రెస్‌వేసి కూచోబెట్టారు. కోటు, టర్బను, మీసం వగైరా. మధ్యాహ్నం పన్నెండు దాటినా, ఆయనకు షాటు రాలేదు. సెట్టుబయట కూచునే వున్నారు. ముఖంలోని 'ఎక్స్‌ప్రెషన్' విసుగ్గా వుంది.

ఎండాకాలం కూడా గనక, ఉదయమే 'ఫస్ట్ షాట్ లో వుంటారు' అని తెచ్చికూచో బెట్టారు గనక, ఒళ్ళు మండిపోతూ వుంటే, చేసేదేంలేక కుర్చీలోనే శరీరాన్ని విసుగ్గా కదిలిస్తూ 'ఆంగికాభినయం' చేస్తున్నారు. అలాంటి మూడ్‌లో ఒకాయన సెట్లోకి వెళ్లబోతూ, బయట కూచున్న నాగయ్య గారికి నమస్కరించి, "షాట్ కోసం వెయిట్ చేస్తూన్నట్టున్నారు"అన్నాడు. ఈ డైలాగుతో, ఆయన శరీరహోమం మీద ఆజ్యం పోసినట్టయి, ఒళ్లు మరింత భగ్గుమంది.

అయితే నాగయ్యగారు 'సెన్సాఫ్ హ్యూమరు' వున్నవారు గనుక, ఒళ్లు మంటని తానే చల్లార్చుకుంటూ, వ్యంగ్యం మిళాయించి అన్నారు - "ఇందులో నేను గెస్ట్‌వేషం వేస్తున్నాను. అంటే నేను వారికి గెస్ట్‌ని. ఉదయమే మర్యాదగా కారు పంపి, తీసుకువచ్చారు. మేకప్ వేసి మీసం అతికించారు. ఇదిగో ఈ కోటూ అదీ తొడిగారు. నెత్తిమీద కిరీటం పెట్టినట్టు టర్బన్ కూడా పెట్టి, సెట్టుకి రమ్మని ఆహ్వానించి -ఇలా కూచోబెట్టారు నాయనా! నేను వారికి గెస్ట్‌ని గనక, నన్ను షాటుకి రమ్మనకుండా, నాచేత ఏ పనీ చేయించకుండా - నాకేమి శ్రమ కలిగించకుండా ఇలా కూచోపెట్టారు. గెస్ట్‌చేత ఏపని చేయించడం బాగుండదు కదా నాయనా" అని, మెత్తని వ్యంగ్యాస్త్రం సంధించారు- ముఖాన 'ఆనందం' పులుముకుని.

## ఆ ఋషులకో దండం!

గుమ్మడిగారు చెబుతూ వుంటారు. సినిమాల్లో గడ్డాలు మీసాలు వున్న పాత్రలు ఎక్కువగా ధరించి 'రికార్డు' సృష్టించినది నాగయ్యగారూ, తానూ అని. అలా ఒక పురాణ చిత్రంలో నాగయ్యగారిది ఋషిపాత్ర.

ముఖానికి సగం మేర గమ్‌పూసి గడ్డం అతికి, మీసం తగిలించి, తలపైన రెండుమూడు కిలోల బరువున్న విగ్గుపెట్టి కూచోమన్నారు. ఈ గడ్డంమీసాల పాత్రధారణ అలవాటయినా, ఆ చిరాకు ఎలాగూ తప్పదు. "పాత్రను ధరించడం కాకుండా, పాత్రను 'భరించడం' అంటే ఇదే. "అనే వారాయన. అది అవుట్‌డోరు షూటింగు, రాత్రి. స్టూడియోల్లో అయితే ఫ్యాన్లు తిరుగుతాయి. అవుడ్డోర్‌లో పురుగులు తిరుగుతాయి! గాలిదేవుడు కూడా ఋషులకి సహకరించకుండా, అలిగి కూచున్నాడు.

నాన్నగారికి (నాగయ్యగారిని అందరూ "నాన్నగారూ" అని పిలిచేవారు) చిరాకు, విసుగూ, కోపంలాంటివి పెరుగుతున్నాయి. దివ్యదృష్టితో చూసినట్టున్నారు. పైన సప్తర్షి మండలంలో ఋషులు కనిపించారు. ఆవేశంగా అన్నారు. "ఆ రోజుల్లో ఈ మునులకీ, ఋషులకీ పనిపాట్లులేవు. అడవులకి పారిపోయి, చెట్లకింద కూచుని, గాలి భోజనం చేస్తూ గడ్డాలు, మీసాలు పెంచేసుకున్నారు. అలా పెంచేసుకుని,ఇవాళ నాలాంటి వాళ్ళ ప్రాణాలు తీస్తున్నారు! మహర్షులారా! మీకు శతకోట నమస్కారాలు!!"

## నిజమైన గాత్రదానం!

"గూఢచారి 116" అని సినిమా వచ్చింది. ప్రసిద్ధ మిమిక్రీ కళాకారుడు వేణుమాధవ్‌గారు వేషం వేశారు. వేషం అంటే తనవేషమే. తనుగానే వేశారు. - మిమిక్రీ చేసే పాత్ర. నాగయ్యగారిని కూడా ఆయన ఇమిటేట్ చేశారు. ఆ విషయం వేణుమాధవ్ గారు నాగయ్యగారితో చెప్పారు. "మిమ్మల్ని కూడా అనుకరించ వలసివచ్చింది" అని.



వేణుమాధవ్

అప్పుడు నాగయ్యగారు అన్నారుట- "వేణుమాధవ్‌గారూ! మీ ద్వారా, నా కంఠం సినిమాలో వినిపిస్తూందన్నమాట. మీ నిర్మాతలు నా కంఠాన్ని వాడుకుంటున్నారు కాబట్టి - నాకేమైనా చెల్లిస్తారా!" అని చమత్కారంగా అడిగారుట.

"నాకూ ఇవ్వరూ, మీకు ఇవ్వరూ" అన్నారుట వేణుమాధవ్‌గారూ, పకాపకా నవ్వుతూ. అయితే, ఇంతకీ ఆ నాగయ్యగారి కంఠమూ చిత్రంలో లేదు, భానుమతిగారిని ఇమిటేట్ చేస్తే ఆ కంఠమూ లేదు! "ఎడిటింగ్‌లో పోయాయి" అని చెప్పారు వేణుమాధవ్.

## ఫోటోకి పారితోషికం!

ఇలాంటిదే ఇంకో జోకు. పి.పుల్లయ్య గారు"సిరిసంపదలు" తీశాడు. అందులో నాగయ్యగారు వేశారు. తర్వాత పుల్లయ్యగారు "ప్రాణమిత్రులు" తీశారు. అందులో జగ్గయ్య గారి కుటుంబం జమీందారీ కుటుంబం. ఆయన తండ్రి జమీందారు - కీర్తి శేషుడు. చిత్రంలో ఆ పాత్రరాదు. అయినా ఆ భవనంలో పెద్ద పెయింటింగ్ వుండాలని, ఎవరిదో పెయింటింగ్ అని కాకుండా, అలాంటి గెటప్‌లో అంతకు ముందొచ్చిన సినిమాలోని నాగయ్య గారి ఫోటోనే తీసుకుని, నిలువెత్తు పెయింటింగ్



పి.పుల్లయ్య

చేయించి, సెట్లో ప్రముఖంగా పెట్టారు. ఆ విషయం నాగయ్యగారికి తెలిసి, పుల్లయ్యగారికి ఫోన్‌చేశారుట.

"పుల్లయ్యా !నేను నీ సినిమాలో లేకపోయినా నా ఫోటో పెద్దసైజులో పెట్టావుట. మీరు నన్ను ఈవిధంగా ఉపయోగించు కుంటున్నావు కదా, మరి నాకు ఎంత ఇస్తావు?' అని అడిగారు.

దానికి పుల్లయ్య గారు పకపకా నవ్వి "ఓరి నీ అసాధ్యం కూలా! ఎంత పెద్దజోక్ పేల్చావయ్యా పొద్దున్నే" అన్నారుట. నవ్వుతూనే ఆ విషయం అందకికీ చెప్పేవారు పుల్లయ్యగారు.

## దొంగ కొంగ!

"ప్రాణమిత్రులు" తీస్తున్నప్పుడు ఒక తమాషా జరిగింది. హైదరాబాదు సారథి స్టూడియోలో షూటింగ్. ఒక ఫ్లోర్‌లో సెట్టు వేశారు. అప్పటి పరిస్థితేమిటంటే, క్రేన్ కావాలంటే మద్రాసునుంచి రావాలి. ప్రొడక్షన్ వాళ్లు ఏర్పాటుచేశారు. అది, మద్రాసులో బయలుదేరింది ట్రక్కుమీద.

షూటింగ్ కి ముందు రోజే అది హైదరాబాదు చేరుకోవాలి. షూటింగ్ లో నాగేశ్వరరావుగారు, జగ్గయ్యగారు, గుమ్మడిగారు, శాంతకుమారి గారూ- ఇంకా కొంత మంది వున్నాం. క్రేన్ వచ్చేస్తుందన్న ధీమాతోనే షూటింగ్ ఏర్పాట్లు జరిగాయి. ఉదయమే అంతా స్టూడియో చేరుకుని, మేకప్ వేసుకుని సిద్ధమైపోయారు.

ఫ్లోర్ లోపల - క్రేన్ షాట్‌కి తగ్గట్టుగా లైటింగ్ చేశారు ఛాయాగ్రాహకుడు శ్రీ సెల్వరాజ్. క్రేన్ రాలేదు! ఫోన్లమీద ఫోన్లు వెళ్తున్నాయి. అక్కడ ట్రక్కు బయల్దేరింది- మూడు రోజులయింది. ఇక్కడకు రాలేదు! పుల్లయ్యగారు చిందులు తొక్కుతున్నారు. పోనీ, క్రేన్ షాట్స్ వదిలేసి, తక్కినవి తీసుకోవచ్చుగదాని పుల్లయ్యగారికి చెప్పే సాహసం ఎవరికీ లేదు. పైగా పుల్లయ్యగారు ఆ షాటులో సీను మొదలు పెట్టాలని ప్రిపేర్ అయికూచున్నారు. మధ్యాహ్నం వరకూ చూసిచూసి 'పాకప్' చేశారు.

జరిగినదేమిటంటే విజయవాడ దాటిన తర్వాత ట్రక్కుకి రోగం వచ్చి మంచాన పడింది! మందులు,మాకులు అయిన తర్వాత, తెరిపిన పడింది- రాత్రి బయల్దేరుతుంది. తెల్లవారేలోగా సారథి స్టూడియోకి చేరుకోగలదు. ఆ ట్రక్కు డ్రైవర్ తెలివిగా వ్యవహరించి, సాయంకాలానికి సారథి స్టూడియోకి ఓ ఫోన్ కొట్టాడు. ఈ శుభవార్తకి, అందరికీ-ముఖ్యంగా పుల్లయ్యగారికి, ఒకరోజు పోయిందేనన్న బాధవున్నా కొంత ఉపశమనం కలిగింది.

మర్నాడు షూటింగ్ ఏర్పాట్లు జరిగాయి. మళ్ళీ అందరూ సిద్ధమై కూచున్నారు. తెల్లవారేసరికి వస్తుందనుకున్న "కొంగ" అనబడే క్రేన్ ఉదయం పదిగంటలయినా గూడు చేరుకుని వాలలేదు! మళ్ళీ అందరికీ టెన్షన్! పుల్లయ్య గారికయితే మరీనూ. ఆయన ఏకంగా సారథి గేటు దగ్గరికే వెళ్లి రోడ్డుపైన తిరుగుతున్న ట్రక్కుల్ని చూస్తూ నించున్నారు.చూసి చూసి పుల్లయ్య గారికి బీపీ పెరిగిపోయినట్టుంది స్టూడియో దద్దరిల్లేలా అందరిమీద అరుస్తున్నారు. ఆ అరుపుతో ఆ టెన్షన్‌లో మొత్తానికి శబ్దంచేస్తూ ట్రక్కు వచ్చిచేరింది! అందరూ ఊపిరి పీల్చుకున్నారు. భాగాలు భాగాలుగా విడగొట్టిన క్రేన్‌ని వచ్చినవాళ్లూ లైట్‌మెన్స్ అంతా కలిసి గబగబా దింపారు. బిగించారు.

క్రేన్ లేచి నిటారుగా నిలబడింది....అందరూ కలిసి నెట్టుకుంటూ ఫ్లోర్ సింహద్వారం దగ్గరికి వచ్చేసరికి ఏముంది? క్రేన్ లోపలికి వెళ్ళలేదు! ద్వారం క్రేన్ సైజుకంటే చిన్నది!.... అంతే! మళ్లీ పుల్లయ్యగారు తలపట్టుకుని నేలమీద కూలబడ్డారు.- "ఓరి క్రేనో" అంటూ.

అయిన ఆలస్యం అయిందని, ఏం పర్వాలేదని - మళ్లా క్రేన్ భాగాలు విడగొట్టి, ఒక్కొక్కటీ ఫ్లోర్ లోపలికి తీసుకెళ్ళి- మళ్ళీ బిగించేసరికి 'లంచ్ బ్రేక్'కి గంట కొట్టారు! "సీరియస్‌నెస్‌లో కూడా కామెడీ" అని అందరూ నవ్వేసుకున్నారు.

## గోరు చుట్టుమీద రోకలిపోటు!

నవతా కృష్ణంరాజుగారు"రాజు రాణి జాకి" అని సినిమా తీశారు.



సింగీతం శ్రీనివాసరావు



గొల్లపూడి మారుతీరావు

సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు. గొల్లపూడి మారుతీరావు రచయిత. సినిమా పూర్తయింది. లక్ష్మీ ఫిలింస్ వారు డిస్ట్రిబ్యూటర్లే అయినా ఏరియాలు నిదానంగా అమ్ముడవుతున్నాయి. కృష్ణంరాజుగారు రచయిత, దర్శకులిద్దర్నీ కూచోబెట్టి - "సినిమాకి దర్శకుడు, రచయితా అంటే కృష్ణార్జునుల్లాంటివాళ్లు. మీరిద్దరూ కలిసి, మీ పారితోషికాలకు బదులు- కొంత తీసుకున్నారనుకోండి - ఒక ఏరియా తీసుకోండి. 'కృష్ణార్జునా ఫిలింస్' అని పేరు పెట్టండి." అని సలహా ఇస్తే 'బిజినెస్సూ అవీ మాకేం తెలీదే' అంటూనే - ఉభయలూ కలిసి తీసుకున్నారు.

సినిమా విడుదలయి పేలని టపాసులా అయిపోయింది. "ఇద్దరం నష్టపోయాం. పోన్లే పోతే పోయిందనుకుని పూరుకుంటే, కొన్నాళ్లకు లక్ష్మీ ఫిలింస్ వారి దగ్గర్నుంచి లేఖ వచ్చింది. "పబ్లిసిటి మెటీరియల్‌కీ, పోస్టర్లకీ, ఇతర ఖర్చులకీ మీరు మాకు ఇంత చెల్లించాలి" అని "అసలే సినిమాపోయిందని మొర్రోమంటూ వుంటే - ఇదొకటా, దీని సంగతే మాకు తెలియదే!' అని తలలు పట్టుకున్నాం" అని, ఒక సందర్భంలో సింగీతంగారు చెప్పారు.

## ఉభయ కుశలోపరి!

"ఒక దశలో బి.నాగిరెడ్డిగారు, విజయ ప్రొడక్షన్స్‌కీ, వాహినీ ప్రొడక్షన్‌కీ రెండింటికీ ఆయనే మేనేజింగ్ డైరెక్టరు.



బి.నాగిరెడ్డి

విజయ ప్రొడక్షన్స్, వాహిని స్టూడియోను నిర్వహించింది. వాహినీ కంపెనీకి చెందిన షూటింగులకీ, సెట్స్ నిర్మాణానికీ, లాబ్ ఖర్చులూ ఇలాంటి వాటికి విజయప్రొడక్షన్స్‌కి డబ్బు బాకీ వుంటుంది. అప్పుడు నాగిరెడ్డిగారే మేనేజింగ్ డైరెక్టరు హోదాలో, వాహినికి"మీరు ఇంత డబ్బు ఇవ్వాలి- ఎప్పుడు ఇస్తారో తెలియజేయండి" అంటూ లేఖ రాసేవారు.

వాహినికీ ఆయనే ఎమ్.డి. గనక, "వచ్చేనెల్లో డబ్బు చెల్లిస్తాం" అని "ఇప్పుడు కొంత ఇస్తున్నాం" అనో విజయవారికి రాసేవారు. విశేషం,వింతా ఏమిటంటే రెండూ లేఖల్లోనూ ఆయన సంతకాలే వుండడం! ■



గత పక్షం మార్చి 5న కాలధర్మం చెందిన జగ్గయ్య గారి పేరు చెప్పగానే కంచుకంఠం, గంభీరమైన పాత్రలు, రవీంద్ర సంగీతం గుర్తుకువచ్చి 'మూర్తీభవించిన గంభీరత్వం' అనే మాట స్ఫురిస్తుంది. కానీ 'అప్పుచేసి పప్పుకూడు', 'జల్సారాయుడు', 'అత్తా ఒకింటి కోడలే' వంటి అనేక సినిమాలలో హాస్యపాత్రలు పోషించారాయన. వాల్ట్‌డిస్నీ 'బ్లాక్ బియర్డ్స్ ఘోస్ట్' అనే కామెడీ ఆధారంగా 'శభాష్ పాపన్న' సినిమా నిర్మించారు. హాస్యప్రియునిగా కీ.శే. జగ్గయ్యను స్మరిస్తూ పాండితీ ప్రకర్ష, హాస్య చతురత రంగరిస్తూ చాలా ఏళ్ల క్రితం ఆయన రాసిన 'వెధవగారు' వ్యాసంలో కొన్ని భాగాలు -

# వెధవగారు

## రచన : జగ్గయ్య

సంస్కృతంలో 'విధవా' శబ్దానికి తెలుగు వాడుక భాషలో అపభ్రంశ రూపమే 'వెధవ' అని చాలా మంది పండితుల అభిప్రాయం. అది తప్పు. తప్పు అనడానికి ఆధారాలున్నా ముఖ్యమైన ఆధారం 'విధవా' శబ్దం స్త్రీ లింగం. కానీ తెలుగులో 'వెధవ' శబ్దం కేవలం పుంలింగం. స్త్రీ పరంగా వాడవలసి వచ్చినప్పుడు 'వెధవావిడ', 'వెధవకూతురు' అనడం వల్ల ఇది ఋజువౌవుతోంది. కాబట్టి సంస్కృతానికీ దీనికీ సంబంధం లేదనీ, అచ్చ తెనుగు మాట అనీ తేలిపోయింది. అందుకే పదబంధం చేయవలసి వచ్చినప్పుడు కూడా "పిచ్చి వెధవ ", "టక్కరి వెధవ", "వెధవ కూతలు", "వెధవనిక్కు" మొదలైన పదాలే వాడతాం కాని అంటే, అన్నీ తెలుగుపదాలే మార్చి వాడతాం కాని, "వెధవ మానవుడు", "వెధవ భాషణము" అని మిశ్రమ సమాసాలు చెయ్యం. దీని వలన కూడా "వెధవ", అనే మాట అచ్చతెనుగేనని, సంస్కృతానికీ దీనికీ పొత్తు కలవదనీ, సంస్కృత జన్యం కానే కాదనీ స్పష్టమౌతోంది.

ఈ "వెధవ" పదం తెనుగుభాషలో ఎప్పుడు పుట్టిందో, ఎలా పుట్టిందో, చెప్పడం కష్టం. ఈ విషయమై తగిన పరిశోధనలు కూడా జరగలేదు. పూర్వ కవుల గ్రంథాలలోగానీ, కనీసం అచ్చ తెనుగు కావ్యాలలోకూడా ఈ పదం ఎక్కడా కనిపించకపోవడంవల్ల సుమారు రెండు శతాబ్దాల లోపలా, ఒక శతాబ్దం పైగా, దీని పుట్టుక జరిగి ఉండవచ్చునని ఊహించడం హేతుబద్ధంగా వుంటుంది.

వాడుకలో ఈ పదం విరివిగా "సర్వనామం" గానే చలామణి అవుతోంది. ఉదాహరణకు "దొంగ వెధవ" (దొంగ అయిన వెధవ),"రౌడీ వెధవ" (రౌడీ అయిన వెధవ) మొదలైనవి. విశేషణంగా కూడా మంచి ప్రచారంలోనే ఉంది. ఉదాహరణకు :"వెధవ చేష్టలు" "వెధవ పోకిళ్ళు" ఇత్యాదులు. అయితే ఇలాంటి సందర్భాలలో షష్ఠీతత్పురుషంగా కూడా అర్థం చెప్పుకోవచ్చు: 'వెధవ చేష్టలు' అనగా 'వెధవగారి యొక్క చేష్టలు' వగైరా... పోతే, ఇదే పదాన్ని కొంచెం స్వరూపం మార్చి "వెధవది" అని కూడా తరచు వాడుతూంటాం. ఇక్కడ ఇది అవ్యయం అని చెప్పుకోవాలి.

ఇంత చక్కని పద ప్రయోగానికి అర్హత కలిగినవాళ్ళు, తెలుగు దేశంలో ఈనాడు కొల్లలుగా కనిపిస్తారు. అది మన వైజ్ఞానికోన్నతికీ, సాధించిన ప్రగతికీ స్పష్టమైన నిదర్శనం. ప్రతి పట్టణంలో, ప్రతి పల్లెలో, ప్రతి ఇంట్లో, ప్రతి మారుమూలనా ఇలాంటి అపురూప వ్యక్తులు మనకు తారసపడతారు. వీడు వాణ్ణి "వెధవ" అనీ, వాడు వీణ్ణి "వెధవ" అనీ పిలుచుకోవడం నిత్యమూ మనం చూస్తూనే ఉంటాం. ఈ విధంగా ఒకరి గొప్పతనాన్ని మరొకరు అర్థం చేసుకుని, పరస్పరం గౌరవించుకునే ఘట్టాలు మరెక్కడా, మనకు కనిపించవు. అందుకే అలాంటి వారిని ఏకవచన ప్రయోగం చేయకుండా, మర్యాదగా "వెధవగారు" అనాలని నా అభిలాష.

ఈ "వెధవగారికి" చిన్నా, పెద్దా తారతమ్యం లేదు: అంటే వయస్సుతో ప్రమేయంలేదు, "పసి వెధవ" మొదలుకొని, "ముసలి వెధవ" వరకూ

అన్ని ఏజ్ గ్రూప్స్‌లోనూ ఇతగాడు కనిపిస్తాడు. వయస్సు మొదలైన కేవలం భౌతిక విషయాలతో పట్టింపులేకుండా, గుణగణాలు, వృత్తి, వర్గమూ మొదలైన శాస్త్రీయాంశాలు ఆధారంగానే ఇతడు తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తాడు. అదే ఇతనిలో ప్రత్యేకత.

పసిబిడ్డల రూపం ధరించినప్పుడు, వెధవగారు అందరికీ ముద్దొస్తూంటారు. అందుకే మనం, 'బుజ్జి వెధవ', 'బుల్లి వెధవ','చంటి వెధవ' అనే మాటలతో మనకున్న అప్యాయతనూ, గారాబాన్ని వెల్లడించుకుంటాం.

వారి నీ దశలో "వెధవాయి" అని కూడా సంబోధిస్తాం. బుజ్జి-బుజ్జిగాడు, అబ్బి-అబ్బిగాడు అయినట్లు వెధవ- వెధవాయి అవుతున్నాడు. అయితే ఈ రూపాంతరం ఈ దశకే పరిమితం.

ఇక, గుణగణాలనుబట్టి 'వెధవగారు' అనేక రూపాలలో అవతరించడం కద్దు. "పిచ్చి వెధవ" అనగా అమాయకుడైన వ్యక్తి అని అర్థం. అలాగే "వెఱ్ఱి వెధవ"అంటే "బోళా" గుణం కలిగిన మనిషి అని. మాములుగా "పిచ్చి"వాడు అనగానే మంచీ, చెడూ, బాగూ, ఓగూ, ఏమీ తెలియనివాడని అర్థం వస్తుంది. కాని అతగాడు "వెధవ" కూడా కావడంతో,ఒక ప్రత్యేకత ఏర్పడుతుంది.

అంటే ఈ గుణగణాలన్నీ మామూలు వ్యక్తులలోఉన్నప్పుడు ఒక స్థాయిలో ఉంటే అవే గుణాలు "వెధవగారి'లో ఉండగానే వాటి స్వభావమే మారిపోతున్న దన్నమాట. ఇది క్వాలిటేటివ్ ఛేంజ్ అని చెప్పుకోవాలి. ఇదొక ధర్మసూక్ష్మం. అలాగే "దొంగవెధవ" అన్నప్పుడు ఇది గుణ సూచకంగా తీసుకోవచ్చు; వృత్తిపరంగానూ తీసుకోవచ్చు. గుణ సూచకంగా తీసుకున్నప్పుడు "తెలివైనవాడు" అని అర్థం చెప్పాలి. అంటే,పైకి తెలియనట్టు కనిపిస్తూ, లోపల అన్ని విషయాలనూ కనిపెట్టి తెలుసుకుని ఆకళింపు చేసుకోగలిగిన లౌకిక పరిజ్ఞానం కలిగినవాడే "దొంగ వెధవ"! సామాన్య భాషలో ఇలాంటి వాళ్ళనే "లౌకికు"లనీ, "వ్యవహర్త"లనీ అంటూంటాం.

"రౌడీ వెధవ" అనగా, వీరరస ప్రధానమైన స్వభావం కలవాడు అని. ఇతగాడికి ఆత్మాభి మానం హెచ్చు అనీ, తలవంచని వీరుడనీ మనం గ్రహించాలి. ఇదే విధంగా "పోకిరీ వెధవ" లేక "పొగరుబోతు వెధవ" అన్నప్పుడు ధైర్యసాహసాలు అధికమైన మోతాదులో కలిగినవాడు అని అర్థం చెప్పుకోవాలి."తిండిపోతు వెధవ" అన్నప్పుడు పరబ్రహ్మ స్వరూపాన్ని (అన్నమ్ పరబ్రహ్మమ్ గనుక) ఆరాధించేవాడనీ, "జులాయి వెధవ" అన్నప్పుడు ప్రాపంచిక వాసనలలో తలదూర్చి కూడా తామరాకుమీద నీటిబొట్టులాగా అంటీ అంటనట్టు సంచరించగల సంయమశక్తి కలవాడనీ, "కూచీ వెధవ"అంటే మంచి నటనాశక్తి కలవాడనీ, "పోసుకోలు వెధవ" అంటే సంభాషణా చాతుర్యం కలవాడనీ,"జూదరి వెధవ" అనగా ఫ్రీ ఎంటర్‌ప్రైస్‌లో నమ్మకం కలవాడనీ, "తాగుబోతు వెధవ" అనగా సాంఖ్య సిద్ధాంతానుసారం ఈశ్వరతత్వాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించేవాడనీ, "చచ్చు వెధవ"అనగా ఇతరులు తనను కొట్టినా శాంతిసహనాలు ప్రదర్శించి ఓర్చుకునే సత్యాగ్రహి అనీ, మనం తెలుసుకోవాల్సి ఉంటుంది. ఇదేవిధంగా, "వెధవగారి"అనేక ఇతరరూపాలను గుణాత్మకంగా మనం అవగాహన చేసుకోవాలి.

ఇక "వెధవది" అనే మాటను కూడా మనం, ఏ విషయంలోనైనా ఒక ప్రత్యేకత స్థితిని సూచించడానికే వాడతాం. అంటే, ఈ పదం ద్వారా వెధవగారియొక్క ప్రత్యేకత, గొప్పతనం ఒక రూఢ్యర్థంలో నిలిచిపోయిందన్నమాట.

ఇంతటి గొప్ప వెధవగారు పురుషుడు కావడం తెలుగు మగవాళ్ళ అదృష్టమేనని చెప్పాలి. వీరికి పురుష పక్షపాతం పూర్తిగా ఉందని అనుకోవాలి. ఆఖరికి భగవంతుడయినా అవసరం వచ్చినప్పుడు ఆడదానిగా అవతరించాడుగాని, విపరీతమయిన ఆత్మాభిమానం కల వెధవగారు మాత్రం అలాంటిపనికి పాలుపడలేదు.

తమ్ముతాము గౌరవించుకోవడం చేతగాని తెలుగుజాతి, ఇకనైనా మేలుకొని, ఇటువంటి మహావ్యక్తికి మన సమాజంలో సముచితమైన గౌరవస్థానాన్ని కల్పించుకోవడం చాలా అవసరం.

ఇలా చేయాలంటే వెధవగార్ని గురించి చెయ్యవలసింది చాలా ఉంది. కాని, తెలుగువాళ్ళం,... వెధవది.

■




మాటల పాటల రచయిత సముద్రాల జూనియర్ తన సినీ జీవితానికి ఫుల్‌స్టాప్ పెట్టేసి హైదరాబాద్‌కు వచ్చి ఫిల్మ్‌డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌లో ఉద్యోగం చేస్తున్న రోజుల్లో ఇంచుమించు తన మనసు పంచుకున్న ప్రతీవారితోనూ అనేవారు -'మాట కన్నా పాట చాలా శక్తివంతమైంది. పాటకుండే ఆయుఃప్రమాణం మాటకు లేదు. నేను పూర్తిగా పాటల రచయితనే అయివుంటే నా సినీ జీవితం మరికొన్నాళ్ళ పాటు సాగేదేమో !? అని. ఆ మాటల్లో అనుభవపూర్వకమైన సత్యం ఉంది. మాటను పాటగా మలిచి దానికి శాశ్వతత్వాన్ని కట్టబెట్టే గుణం స్వరానికుంది. పాటకు అంత శక్తి ఉంది గనుకనే మరుగునపడ్డ ఎన్నో సినిమాలలో కేవలం పాటలు ఇవాళ్టికీ గుర్తుండే సంఘటనలు కూడా ఉన్నాయి. అటువంటి సినిమాలలో ఒకటి... రిపబ్లిక్ ప్రొడక్షన్ వారి




1959లో విడుదలైన ఈ చిత్రానికి పాటలను జూనియర్ సముద్రాల రాశారు. ఘంటసాల సంగీత దర్శకత్వంలో వచ్చిన ఈ చిత్రంలో గల ఎన్నో మంచి పాటలలో అధికశాతం జనం గుర్తుంచుకున్న నాలుగు పాటలు ఈ సంచికలో...

అప్పటికీ ఇప్పటికీ ఎంతో తేడా
అది తెలిసీ మసలుకో బస్తీ చిన్నోడా ॥అప్పటికీ॥
బాల వయసు పెళ్ళిళ్ళ బాధలు పోయాయోయ్
బాల వయసు పెళ్ళిళ్ళ బాధలు పోయాయోయ్
ప్రేమించి పెళ్ళాడే రోజులోయి వోయి ॥అప్పటికీ॥
చెప్పినట్లు పడి ఉండే కాలం పోయిందోయ్
చెప్పినట్లు పడి ఉండే కాలం పోయిందోయ్
తిప్పలు పెట్టారా తప్పవోయి విడాకులు ॥అప్పటికీ॥
ఒకరి మీద ఇంకొకరు అదుపులు మానేసి
ఒకరి మీద ఇంకొకరు అదుపులు మానేసి
కలసి మెలసి సాగించే సంసారం స్వర్గమోయ్ ॥కలసి॥
అప్పటికీ ఇప్పటికీ ఎంతో తేడా
అది తెలిసీ మసలుకో బస్తీ చిన్నోడా
అది తెలిసీ మసలుకో బస్తీ చిన్నోడా



ఈ పాటను పి.లీల పాడగా అక్కినేని,అంజలీదేవి పై చిత్రీకరించారు. ఈ పాటలో రాగ ప్రాధాన్యత అంత బలంగా లేకున్నా వినసొంపైన గీతంగా తీర్చిదిద్దారు ఘంటసాల . 1930 నుంచి 1950కి,ఆ తరువాత 1950 నుంచి 1960కి మధ్య గల పరిస్థితులను గమనిస్తే పెళ్ళిళ్ళ విషయంలో గాని ప్రేమ వ్యవహారాల్లోగాని కనిపించిన సాంఘిక చైతన్య ప్రభావమే ఈ పాట సాహిత్యంపై కూడా పడిందని ఆ మూడు దశాబ్దాల్ని తమ అనుభవంలో పండించుకున్న పరిశీలకులు ఒప్పుకుంటారు. ఆ రకంగా చూడగలిగితే సినిమా పాటలు కూడా అధ్యయనం చేయడానికి ఎంతగా ఉపకరిస్తాయో తెలుస్తాయి.

చూపుల తీపితో కొసరుచున్ దరిజేరి మనోజ్ఞ గీతికా
లాపన సేయు కూర్మి జవరాలొకవైపు, మరొక్క వైపునన్
ఈ పసి కమ్మ తెమ్మరలు ఈ పూవు దోటల శోభలున్నచో
రేపటి ఆశ నిన్న వెత లేటికి నేటి సుఖాల తేలుమా



అతడు: రావే ప్రేమలతా
నీవే నా కవితా
కిన్నెర మీటుల కిలకిలవే
పలు వన్నెల మెరపుల మిలమిలవే
ఆమె: ఓహో కవిరాజా
నేడే నెలరాజా
ఎందులకోయీ పరవశము
నీ కెందునకో ఈ కలవరము
అతడు: పూవులలో నును తీవెలలో
ఏ తావున నీవే వనరాణీ
పూవులలో నును తీవెలలో
ఏ తావున నీవే వనరాణీ
ఆమె: అందవతి కనుపించినచో
కవులందరి చందమిదేలే ॥రావే॥
అతడు: పరువులిడే సెలయేరువలె
నిను చేరగ కోరును నామనసు
పరువులిడే సెలయేరువలె
నిను చేరగ కోరును నామనసు
ఆమె: ఊహలతో ఉలికించకుమా
నవమోహన ఈ చెలి మదినే ॥రావే॥
ఆమె: ముచ్చటగా మనముండినచో
మన మచ్చికకు జగమేమనునో
అతడు: లోకముతో మనకేమిపని
మనసేకమయి మనముంటే
ఆమె: నేనే నీ కవితా
అతడు: రావే ప్రేమలతా

ఈ పాటను ఘంటసాల, రావుబాలసరస్వతీదేవి పాడారు. అక్కినేని, అంజలీదేవి అభినయించారు. మాండ్ రాగం ఆధారంగా మలచబడ్డ ఈ పాట సంగీత ప్రియుల హృదయాల్లో ఈ నాటికీ సజీవంగా ఉన్నదంటే అందుకు కారణం స్వరరచన మాత్రమేకాక, పాడిన ఆర్.బాలసరస్వతి-కంఠంలోని విలక్షణత కూడానని విన్న ప్రతీవారు ఒప్పుకుంటారు. మాండ్ రాగంలో ఘంటసాల సంగీత దర్శకత్వంలో వచ్చిన మంచి ప్రయోగాలలో ఈ పాటతో పాటు 'రహస్యం' చిత్రంలో 'సాధించనౌనా జగానా' పాటను, 'మర్మయోగి' సినిమాలో 'మధువు మనకేల సఖియరో' అన్న పద్యాన్ని చెప్పుకోవాలి. అలాగే 'రావే ప్రేమలతా' పాటకు ముందు వచ్చే పద్యం కూడా (చివర్న వచ్చే ఆలాపనలో పంతువరాళి రాగచ్ఛాయలు కొంత కలిసినా) మాండ్ రాగంలోనే ఉంటుంది. అప్పట్లో ఈ పద్యం రికార్డులలో గాని తర్వాత వచ్చిన కొన్ని క్యాసెట్లలో గాని లేదు. ప్రేమగీతానికి ముందు ఓమంచి పద్యాన్ని జత చేయడం విషయంలో నిర్మాత సీతారామ్- ఈ చిత్రానికి సముద్రాల జూనియర్ సమకూర్చిన మూల కథను సినిమాకు కావల్సిన రీతిలో మలుచుకోవడంలో దర్శకుడు డి.యోగానంద్‌తో పాటు పాలు పంచుకున్నారు. కొన్నాళ్ళ తరువాత ఎన్టీఆర్, భానుమతి, యస్వీ. రంగారావుతో 'బొబ్బిలి యుద్ధం' చిత్రం నిర్మించి అందులో వెంగళ రాయుడు పాత్రను స్వయంగా పోషించి జమునకు భర్తగా దీటైన నటనను కూడా ప్రదర్శించారు. ఆ చిత్రంలో గల 'మురిపించే అందాలే' పాటకు ముందు శ్రీ శ్రీ చేత 'సొగసు కీల్జడదాన' అనే సాకీని పద్యంలాగ రాయించిన ఆయన అభిరుచి ఈ సందర్భంగా సంస్మరణీయం.

కాకపోతే ఈ పాటలో జూనియర్ సముద్రాల ఉపయోగించిన 'అందవతి' అనే పదం పంటి కింద పలుకులా గుండెను కలుక్కుమనిపిస్తుంది. కేవలం-'కవులందరి చందమిదేలే' అనే మాటకు ప్రాస సరిపోతుందని 'అందవతి' అని వాడేరే గాని 'సౌందర్యవతి' అనిగాని 'అందగత్తె' అని గాని వాడాలని- పాటకు ముందు ఉత్పలమాలలో ఛందోబద్ధంగా అంత చక్కటి పద్యాన్ని అందించిన సముద్రాల జూనియర్‌కి తెలియదని అనుకోలేం కదా!

ఆమె: ఝుమకు ఝుమకు తారా
ఝుణకు ఝుణక్ సితారా
ఈ తారను విడిచి పోతారా?
అతడు: ఛమకు ఛమకు తారా
ఝుణక్ ఝుణక్ సితారా
నా తారను విడిచి పోతానా?
ఆమె: కలల మైకములో
కనుమూసి నేనుంటే ॥కలల॥
సెలవు గైకొనకుండా
తరలిపోతారా ॥ఝుమకు॥
అతడు: కాలికి బంధాలై
నీ అందచందాలు ॥కాలికి॥
కలకాలం నన్ను నీ ఖైదీ చేసెనే ॥ఝుమకు॥
ఆమె: రాగాలు సరాగాలు ఏనాటికి
ఇలా సాగిపోయేన ముమ్మాటికి
అతడు: ఏ చోటనున్న ఏ నాటికైనా
నా చెలివి నీవే అను ఔనౌనను ॥ఝుమకు॥



ఈ పాటను ఘంటసాల,లీల పాడగా అక్కినేని, అంజలి అభినయించారు. పాటలను స్వరపరచడానికి ఘంటసాల అత్యంత ఆప్యాయంగా ఎన్నుకునే రాగేశ్వరి రాగం ఈ పాటకు ఆధారం. ఘంటసాల స్వర రచనలో వచ్చిన - ఇది నా చెలి(చంద్రహారం,) తాళలేరా మదనా (పాండవవనవాసం) మగరాయ వలరాయ (రహస్యం) బుద్ధ దేవుని భూమిలో పుట్టినావు (పుష్పవిలాపం పద్యాలలో ఒకటి) -ఇవన్నీ ఈ 'ఝుమకు ఝుమకు తారా' పాటతో కూడా కలుపుకుంటూ ఒక క్యాసెట్‌లో రికార్డు చేయించి వరుసగా విని చూడండి. ఒకే రక్తం పంచుకు పుట్టిన అక్కచెల్లెళ్ళలా ఉంటాయి. ఈ పాటలో జూనియర్ సముద్రాల ఉపయోగించిన 'బంధాలై' అనే పదం తెలుగు భాష మీద మక్కువ ఉన్నవారికి ఆనందం కలిగిస్తుంది. వ్యస్తపదంగా 'బందం' గాను సమానంగా 'బంధం' గాను ఉపయోగించదగ్గ ఈ పదం యొక్క లక్షణం తెలియకుండానే ఇవాళ ఎవరికి తోచిన రీతిలో వారు వ్యవహరించడం జరిగిపోతోంది. మనుచరిత్రలో 'కచ్చడాల్ కట్టుకొనిన ముని ముచ్చులైన తామరసనేత్రలిండ్ల బందాలు కారె,' అన్న అల్లసాని పెద్దన వారి ప్రయోగం ఈ సందర్భంగా ఒకసారి గుర్తు తెచ్చుకుంటే సముద్రాల జూనియర్ మీదా. అలాగే ఉచ్చరిస్తూ పాడిన ఘంటసాల మీద గౌరవం ఎంతగా పెరిగిపోతుందో చెప్పలేం. ఈ పాటలో స్వరరచనా పరంగా ఒకటి రెండు చరణాలు ఒక ఎత్తు. మూడవ చరణం ఒక్కటీ ఒక ఎత్తు. వాటిమధ్య తేడాలను గమనిస్తూ పాడుకోగలిగితే సంగీతదర్శకుడిగా ఘంటసాల సృజనాత్మక సామర్థ్యం ఆరాధనాత్మకమైన అభిమానం ఇంకా ఎక్కువైపోతుంది.

ఆమె: బైరో బైరో పెళ్ళి కొడకా
అతడు: ఆల్ రైరో రైరో నా పెళ్ళి కూతురా ॥బైరో॥
అతడు: అడ్రస్ తెలియక అల్లాడిపోతి అందాల పూబంతి ॥అడ్రస్॥
నిను చూచి నా దినం మొదలు నే మజ్నూ నైపోతినే
హాయ్...మజ్నూనై పోతినే ॥బైరో॥
ఆమె: అయ్యో పాపమీ అవస్థ చూస్తే గుండె నీరుకాదా ॥అయ్యో॥
వెళ్ళి వెదకు నీ చెలీ లైలను ఎడారీ దారులా ॥వెళ్ళి॥
అతడు: హాయ్ ఎడారీ దారులా ॥బైరో॥
అతడు: వలచి నన్ను దయ తలచకున్న
నా తలను కోసుకుంటా ॥వలచి॥
ఆమె: తలా తీసుకొను పనే లేదురా
నిన్నే చేసుకుంటా ॥తలా॥
అతడు: హాయ్ అదే కావాలంటా ॥బైరో॥



ఈ పాటను బి. సరోజాదేవి, చలంపై చిత్రీకరించారు. జిక్కి, రాఘవులు పాడారు. ఈ రాఘవులు మరెవ్వరో కాదు. ఘంటసాల వారికి అన్నిటా చేదోడు వాదోడుగా ఉంటూ, తర్వాత రోజుల్లో స్వతంత్ర ప్రతిపత్తి గల సంగీత దర్శకుడిగా నిలదొక్కుకుని ఘంటసాల స్వర జీవితంలో చెప్పుకోదగ్గ పాటలలో ఒకటిగా నిలిచిపోయిన 'ఈ జీవన తరంగాలలో ఆ దేవుని చదరంగంలో' వంటి పాటను స్వరపరచిన జె.వి.రాఘవులే. ఓ వైపు వెస్ట్రన్ కంపోజిషన్‌లా అనిపించినా- శోకరసానికి ఉపయోగించే శివరంజని రాగాన్ని అంతర్లీనంగా అవహింప చేసుకుంటూ ఎంతో హుషారుగా నడిచిన ఈ 'బైరో బైరో ' పాట స్వర రచనను మెచ్చుకోకుండా ఉండలేం. కాకపోతే శివరంజని రాగంలో పడకూడని అంతర్గాంధారం, ప్రతి మధ్యమం, కైశిక కాకలి నిషాద స్వరాలను వాడుకోవడం జరిగింది గనుక దీనిని మిశ్ర శివరంజనిగా పేర్కొనవచ్చు. వినోదా వారి దేవదాసులోని 'అంతా భ్రాంతి యేనా', సంగమ్‌లోని 'ఓ మేరే సనమ్ ఓమేరే సనమ్', సూరజ్ లోని 'బహారో ఫూల్ బర్ సావో' పాటలను గుర్తుచేసుకుంటే ఈ మిశ్ర శివరంజని రాగం ఎంత జనరంజకంగా ఉంటుందో కూడా తెలుస్తుంది.

తరచి చూస్తే తెలుసుకోదగ్గ విషయాలెన్నో ఆనాటి పాటల్లో ఉండేవనిపిస్తే -ఆ గొప్పదనమంతా - తెలిసి చేసినా తెలియక చేసినా వాటికో చరిత్ర కలిగేలా సృష్టిచేసిన ఆయా కళాకారుల తపనా సంస్కారాలదే. ◆

**ధ్యానమ్** — **గానం : ఘంటసాల**

శ్లో॥ శ్రీవిద్యాం జగతాం ధాత్రీం సర్గ స్థితి లయేశ్వరీం
నమామి లలితాం నిత్యాం మహాత్రిపుర సున్దరీమ్॥

**రచన:సదాశివబ్రహ్మం** — **పాడినవారు : ఘంటసాల**

మ॥ నవరత్నోజ్వల కాంతివంతమిది ధన్యంబైన సూర్యాన్వయో
ద్భవ రాజన్యులు మున్ను దాల్చి గరిమన్ పాలించి రీ భూమి సం
స్తవనీయంబగు ఈ కిరీటము శిరోధార్యంబు నీకీ యెడన్
భువి పాలింపు ప్రజానురంజకముగా మోదంబుతో రాఘవా!

**రచన:సదాశివబ్రహ్మం** — **పాడినవారు: రాఘవులు, సరోజనిబృందం**

జయ జయ రామా శ్రీరామా
దశరథ తనయా జై జయహో ॥జయ॥
సుందర నామా సూనృత కామా
సుగుణధామ సూర్యాన్వయ సోమా ॥సుందరం॥
అహల్యా సతీ శాప విరామా
శివకార్ముకహర జానకీవరా ॥జయ॥

**రచన : కొసరాజు** — **గానం : పి.సుశీల, రాణి**

రామన్న రాముడు కోదండ రాముడు
శ్రీరామ చంద్రుడూ వచ్చాడురా
హోయ్...సీతమ్మ తల్లితో వచ్చాడురా ॥రామన్న॥
నెలమూడు వానలూ కురిసేనురా
బంగారు పంటలూ పండేనురా ॥నెల॥
కష్ట జీవుల వెతలూ తీరేనురా
బీదా సాదా బ్రతుకు మారేనురా ॥రామన్న॥
రామయ్య వంటి కొడుకు రావాలనే
సీతమ్మ వంటి బిడ్డ కావాలనే ॥రామయ్య॥
ఇల్లు వాకిలి పరువు నిలపాలనే
చల్లంగ నూరేళ్ళు వెలగాలనే ॥రామన్న॥
పేదతనము భూమిమీద ఉండబోదురా
భేదాలకిక మీద తావులేదురా ॥పేద॥
దొంగ తాగుబోతు బాధ తొలగిపోవురా
రామరాజ్యమాయె మనకు లోటురాదురా ॥రామన్న॥
న్యాయమ్ము పాలించి నడుపు వాడురా
ధర్మమ్ము గిరిగీసి నిలుపుతాడురా ॥న్యాయమ్ము॥
మునులందరిని గాచు మొనగాడురా
ముందుగా చెయ్యెత్తి మొక్కుదాము రా ॥రామన్న॥

**సూర్యస్తుతి** — **గానం : ఘంటసాల**

శ్లో॥ సప్తాశ్వరథ మారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్
శ్వేతపద్మధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

**రచన : సముద్రాల** — **గానం: జానకి,బృందం**

విరిసె చల్లనీ వెన్నెలా విరిసె చల్లనీ వెన్నెలా
మరల ఈనాడు మా కన్నులా ॥విరిసె॥
చెన్నుమీర జానకమ్మ అంకమ్మున - వామాంకమ్మున
మా కన్నుదోయి - విందుచేసే మా రాముడు -కరుణాధాముడు॥ చెన్ను॥
మదినెన్నో వింత - సంబరాలు మీరగా ॥విరిసె॥
మరువగరానీ పండుగ నేడు మా పాలికీ - సర్వ జీవాళికీ
మా ఊరూనాడూ వెల్లి విరిసె ఉల్లాసము - మధురోల్లాసము ॥మరువగ॥
ధర పొంగి పోయీ ఆటలాడే హాయిగా ॥విరిసె॥

**రచన:సదాశివబ్రహ్మం** — **పాడినవారు : ఘంటసాల**

ఉ॥ రావణు సంహరించి, రఘురాముడు దుర్భర కీలి కీలలన్
పావనియైన సీత, అసమాన పతివ్రత లోకమాత సం
భావన జేసి గైకొని, సుపర్వులు మెచ్చగా, లక్ష్మణుండు,సు
గ్రీవుడు, వాయునందనుడు, ప్రీతిని గొల్వ అయోధ్య జేరినన్॥

**రచన:సదాశివబ్రహ్మం.** — **గానం: ఘంటసాల,జిక్కి, బృందం**

బృందం: వెయ్యరదెబ్బ దరువెయ్యర దిబ్బ
బల్లమీద దబాదిబా బాదర అందాల సుబ్బ ॥వెయ్యర॥
వీరిగాడు: ముద్దుమోము యిటు తిప్పే పిల్లా
మురిపిత్తా వెందుకే మోకరిస్తా వెందుకే
ముద్దూ ముచ్చట లేదంటే
మన మిద్దరం మొకటే కాదంటే ॥వెయ్యర॥
లచ్చి: అద్దిర వవ్వా అలాగే మామా ఆలూ మగలం కామా
ఆలూ మగలం కామా
పొద్దత్తమానం ముచ్చటలైతే బువ్వెటులొత్తది మామా
మనకి బువ్వెటులొత్తది మామా ॥ముద్దుమోము॥॥వెయ్యర॥
వీరిగాడు: అటేపు సూత్తావ్ సిటికెలు ఏత్తావ్
అటెవ్వరున్నరే పిల్లా అటెవ్వరున్నరే ॥అటేపు॥
మిటకరించి నను మిర్రున చూసి మెటిక లిరుస్తా వెందుకే
నీ మెటికలిరుస్తావెందుకే
లచ్చి: అదేటి మామా అలాటి మాటలు
అగ్గిలాంటి యిల్లాలిని
పదేపదే నన్నునుమానిస్తే పలకను నీతో పోపోదు ॥వెయ్యర॥

**రచన:సదాశివబ్రహ్మం.** — **గానం: ఘంటసాల,జిక్కి , రాఘవులు**

వీరిగాడు: ఒల్లనోరి మావా నీ పిల్లనీ నేనొల్లనోరి మావా నీ పిల్లని
అబ్బా నీ పిల్లా దీనిమాటలెల్ల కల్ల
సంసారమంత గుల్ల ॥నే నొల్ల॥
లచ్చి: నన్నొల్లనంట వెందుకు మామయ్యా
నా వల్ల నేర మేమిర అయ్యయ్యో
దెయ్యాన్ని కొడుదునా దేవతనీ కొడుదునా
నూతిలో పడుదునా గోతిలో పడుదునా
వీరిగాడు: చెయ్! చెమతకారి నాయాలా వూరుకో
సూరిగాడి యింటికాడ సూడలేదటే నిన్ను ॥సూ॥
మారుమాట లాడుతావా మాయదారి గుంట
నిను సూస్తే వళ్ళుమంట ॥నేనొల్ల॥
పేరిగాడు: అయిందాని కల్లరెందు కల్లుడా
ఓరల్లుడా మేనల్లుడా మా అప్పగోరి పిల్లడా
మీ అప్పమొగం చూడరా మా యమ్మిని కాపాడరా ॥నేనొల్ల॥
చిన్నమ్మ: తప్పేమి జేసింది తమ్ముడా ఇప్పుడు
ముప్పేమి వచ్చింది తమ్ముడా
తప్పతాగి వున్నావు చెప్పుడు మాటిన్నావు ॥తప్ప॥
అప్పుడగ బోయింది అదీ ఒక తప్పా..ఏరా... ॥అప్పుడగ॥
వీరిగాడు: అప్పా ఓ లప్పా నీ మాటలు నేనొప్పా యిక చాలును మీ గొప్పా
నా ఆలి గుణము ఎరుగన నే నేలుకోను తీసుకుపో ॥నే నొల్ల॥
లచ్చి: నీ తాగుబోతు మాటలింక మానరా
నే సత్తెమైన యిల్లాలిని చూడరా
నే నగ్గి ముట్టుకుంటా అరిచేత పట్టుకుంటా తలమీద పెట్టుకుంటా
వీరిగాడు: చెయ్! ఎర్రిరాముడంటి వోణ్ణి కాదాలే
గొప్ప శౌర్యమైన యింటబుట్టి నానాలె
అగ్గిలోన బడ్డా నువు బుగ్గిలోన బడ్డా
పరాయింట వున్న దాన్ని పంచజేరనిస్తానా
ఒల్ల నొలె పిల్లా యింకెల్లిపో

రచన : సదాశివబ్రహ్మం		పాడినవారు : ఘంటసాల

ఉ॥ ఏ మహనీయ సాధ్వి జగదేక పవిత్రత బ్రహ్మ రుద్ర సు
త్రాములు హవ్యవాహనుడు ప్రస్తుతి చేసిరో, అట్టి తల్లి సీ
తా మహిళా శిరోమణిని, దారుణ కాననవీధి కంపగా
నీ మది మెట్టు లొప్పె? ఎట నేర్చితివీ కఠినత్వ మగ్రజా॥

రచన : కొసరాజు		గానం: ఘంటసాల

ఏ నిమిషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరూ
ఏ నిమిషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరూ
విధి విధానమును తప్పించుటకై
ఎవరు సాహసించెదరూ ॥ఏ నిమి॥
కంచెయె నిజముగ చేను మేసినా కాదను వారెవరూ
రాజే యిది శాసనమని పల్కిన
ప్రతిఘటించు వారెవరూ ॥ఏ నిమి॥
కరుణామయులిది కాదనలేరా కఠిన కార్యమనబోరా
సాధ్వుల కెపుడూ వెతలేనా
తీరని దుఃఖపు కథలేనా ॥ఏ నిమి॥
ఇనకులమున జనియించిన నృపతులు యీ దారుణము సహించెదరా
వినువీధిని శ్రేణులుగా నిలిచీ
విడ్డూరముగా చూచెదరా ॥ఏ నిమి॥
ఎండ కన్ను ఎరుగని యిల్లాలికి ఎందుకో యీ వనవాసాలూ
తరచి చూచినా బోధపడవులే దైవ చిద్విలాసాలూ ॥ఏ నిమి॥
అగ్ని పరీక్షకే నిల్చిన సాధ్విని అనుమానించుట న్యాయమా
అల్పుని మాటయె జనవాక్యమ్మని ॥అల్పుని॥
అనుసరించుటే ధర్మమా ॥ఏ నిమి॥

రచన : సదాశివబ్రహ్మం		గానం: ఘంటసాల

ఉ॥ ఇంతకు బూనివచ్చి వచియింపక పోదునె, నిన్ను తల్లి, దు
శ్చింతులు, దైత్యు చేబడిన సీతను గ్రమ్మఱ నేలుచున్నవా
డెంత విమోహి రాముడని, యెగ్గులు వల్కిన నాలకించి, భూ
కాంతుడు నిందజెంది నిను గానల లోపల దించి రమ్మనెన్

రచన : కవికోకిల దువ్వూరి రామిరెడ్డి		గానం: పి.సుశీల

సీ॥ అపవాద దూషితయైన కాంతను బాసి
పతి కీర్తి బొందుట భావ్య మనుము
కౌసల్యాదిగా గల్గు అత్తల కేను
గడు భక్తితో మ్రొక్కులిడితి ననుము
తోడికోడండ్రు నా తోడి నేస్తము నెంచి
కడసారి సేమంబు నడిగె ననుము
చెలికత్తియలు నన్ను పలుమారు దలపోసి
యుమ్మలింప నిరుపయోగ మనుము
ప్రజల నికమీద మోదంబు బడయు డనుము
పతిని నెడబాసి యిక సీత బ్రతుక దనుము
జన్మ జన్మంబులకు రామ సార్వభౌము
పరమపావను భర్తగా బడతు ననుము

రచన : సదాశివబ్రహ్మం		గానం: ఘంటసాల

చ॥ ప్రతిదిన మేను తొల్దొలుత పాదములంటి నమస్కరించి,నీ
యతులితమైన దీవెనల నంది చరింతు, తదీయ భాగ్య మీ
గతి యెడమాయె, నింకెపుడు గాంతు భవత్పద పద్మముల్ నమ
శ్శతములు సేతునమ్మ కడసారి గ్రహింపుము జానకీ సతీ.

రచన : సదాశివబ్రహ్మం		గానం: ఎస్.వరలక్ష్మి

ఉ॥ రాజట, రాజధర్మమట, రాముడు, గర్భిణియైన భార్య రు
ద్రాజ సురాసురుల్ పొగడ నగ్నిపరీక్షకు నిల్చినట్టి వి
భ్రాజిత పుణ్యశీల, నొక బాలిశు మాటకు వీడినా, డయో
ధ్యాజన నాథు డెంత కఠినాత్ముడొ, నేను క్షమింపజాల, నా
రాజును, రాజ్యమున్ ప్రజల, రండు ప్రతిక్రియసేయ నుగ్రులై.

రచన : సదాశివబ్రహ్మం		గానం: పి.సుశీల

గీ॥ కన్నులారగ తుదిసారి కరువుతీర
వీర శృంగార రామావతార మేను
దర్శన మొనర్చి పరవశత్వంబు చెంది
నిన్ను జేరెద, మన్నింపు మమ్మ

రచన : సదాశివబ్రహ్మం		గానం: ఘంటసాల

చ॥ ఇదె మన యాశ్రమం బిచట నీవు వసింపుము, లోకపావనీ
సదమలవృత్తి నీకు పరిచర్యలు సేయుదు రీ తపస్వినుల్
ముదముగ రామనామము తపోవనమెల్ల ప్రతిధ్వనించు
నీ పదములుసోకి మా యునికి పావనమై చెలువొందు నమ్మరో

రచన : సదాశివబ్రహ్మం		గానం: పిఠాపురం,కోమల

సదానందుడు: ఎందుకే నా మీద కోపంఏమిటే నీ పరితాపం
శార్వరి : కోపమెందుకు తాప మెందుకుచేసుకున్న పాపం
ఇదంతా - చేసుకున్న కర్మం
సదానందుడు: పిల్లా పాపా కలగాలంటే చల్లగ దైవం చూడాలి
కావాలంటే వస్తారా వద్దంటే మానేస్తారా॥ఎందుకే॥
శార్వరి : గాలిలో దీపం పెట్టి దేముడా భారము నీదే అంటే సరా
మానవయత్నం జపమో తపమో
పూనికతో చేయాలిగాని ॥కోప॥
సదానందుడు: పూజా వ్రతమూ చేదామే పుణ్యక్షేత్రాల్ చూదామే
శార్వరి : పూజావద్దు పుణ్యం వద్దు పోండీ, నాతో మాటాడకండీ

రచన : సముద్రాల		గానం: ఘంటసాల,సుశీల, లీల,మల్లిక్,వైదేహి

జయ జయరామ్ జయ రఘురామ్ ॥2॥
వాల్మీకి : జగదభిరాముడు శ్రీరాముడే
రఘుకుల సోముడు ఆ రాముడే
జనకుని మాటల తలపై నిలిపీ
తన సుఖముల విడి వనితామణితో
వనముల కేగిన ధర్మావతారుడు ॥జగదభి॥
లవకుశులు : కరమున ధనువు శరములు దాల్చి
కరమున ధనువు శరములు దాల్చి
కరమున ధనువు శరములు దాల్చి
ఇరువది చేతుల దొరనే కూలిచి
సురలను గాచిన వీరాధివీరుడు ॥జగదభి॥
జంట : ఆలూ మగలా అనురాగాలకు
ఆలూ మగలా అనురాగాలకు
పోలిక సీతారాములె యనగా
పోలిక సీతారాములె యనగా
వెలసిన ఆదర్శ ప్రేమావతారుడు ॥జగదభి॥
సీత : నిరతము ధర్మము నెరపీ నిలిపీ
నిరతము ధర్మము నెరపీ నిలిపీ
నరులకు సురులకు తరతరాలకూ
వరవడియైన వర యుగపురుషుడు ॥జగదభి॥
బృందము : ఇనకులమణి సరితూగే తనయుడు
అన్నయు ప్రభువు లేనే లేడని ॥ఇన॥
జనులు భజించే పురుషోత్తముడు ॥జగదభి॥
జయ జయరామ్ జయ రఘురామ్

రచన : సముద్రాల గానం: పి.లీల, పి.సుశీల

రామ కథను వినరయ్యా
రామ కథను వినరయ్యా
ఇహపర సుఖములనొసగే సీతా
రామ కథను వినరయ్యా

సాకీ : అయోధ్యా నగరానికి రాజు దశరథ మహరాజు
ఆ రాజుకు రాణులు ముప్వురు కౌసల్య, సుమిత్ర, కైకేయి
నోము ఫలములై వారికి కలిగిరి కొమరులు నల్వురూ
రామ లక్ష్మణ భరత శతృఘ్నులు
రామ కథను వినరయ్యా
ఇహపర సుఖములనొసగే సీతా
రామ కథను వినరయ్యా
గడియయేని రఘురాముని విడిచి గడుపలేని ఆ భూజాని
కౌశిక యాగము కాచి రమ్మనీ
కౌశిక యాగము కాచి రమ్మనీ
పనిచెను నీరద శ్యామునీ
రామ కథను వినరయ్యా
తాటకి దునిమి జన్మముగాచి తపసుల దీవన తలదాల్చి
జనకుని యాగము చూచు నెపమ్మున
జనకుని యాగము చూచు నెపమ్మున
చనియెను మిథిలకు దాశరథీ
రామ కథను వినరయ్యా
మదనకోటి సుకుమారుని కనుగొని
మిథిలకు మిథిలయే మురిసినదీ
ధరణిజ మదిలో మెరిసిన మోదము
ధరణిజ మదిలో మెరిసిన మోదము
కన్నుల వెన్నెల విరిసినదీ రామ కథను వినరయ్యా
హరుని విల్లు రఘునాధుడు చేకొని
ఎక్కిడ ఫెళ ఫెళ విరిగినదీ
కళ కళలాడే సీతారాముల
కళ కళలాడే సీతారాముల
కళ కళలాడే సీతారాముల
కళ కళలాడే సీతారాముల
కన్నులు కరములు కలసినవీ ॥రామ॥

రచన : సముద్రాల గానం: పి.లీల, పి.సుశీల

వినుడు వినుడు రామాయణగాథ వినుడీ మనసార
వినుడు వినుడు రామాయణగాథ వినుడీ మనసార
ఆలపించినా ఆలకించినా
ఆనంద మొలికించే గాథ ॥వినుడు వినుడు॥
శ్రీరాముని రారాజు సేయగా కోరెను దశరథ భూజాని
పౌరులెల్ల ఉప్పొంగిపోయిరా మంగళవార్త విని ॥పౌరు॥
కారు చిచ్చుగా మారెను కైక
మందర మాట విని మందర మాట విని ॥వినుడు వినుడు॥
అలుక తెలిసి ఏతెంచిన భూపతి
నడిగెను వరములు ఆ తన్వీ
సలుపవలయు పట్టాభిషేకమూ
భరతునికీ పృథివీ
మెలగవలయు పదునాలుగేడులూ
రాముడు కారడవీ
చెలియ మాటకు ఔను కాదనీ
పలుకడు భూజానీ
కూలే భువిపైని ॥వినుడు॥
కౌసలేయు రావించి మహీపతి
ఆనతి తెలిపెను పినతల్లీ
మోస మెరిగి సౌమిత్రి కటారీ
దూసెను రోసిల్లీ
దోసమని వెనుదీసె తమ్మునీ
రాముడు నయ శాలి
వనవాస దీక్షకు సెలవు కోరె
పినతల్లి పదాల(వ్రా)లి.... ఓ.....
వెడలినాడు రాఘవుడు అడవికేగగా
పడతి సీత సౌమిత్రి తోడు నీడగా ॥వెడలి॥
ఘొడు ఘొడునా అయోధ్య గొల్లుమన్నదీ
వీడకుమా మనలేమని వేడుకున్నదీ
అడుగులబడి రాఘవా
అడుగులబడి రాఘవా
ఆగమన్నదీ ఆగమన్నదీ ఆగమన్నదీ
అడలి అడలి కన్నీరై అరయుచున్నదీ

రచన : సదాశివబ్రహ్మం గానం: పి.లీల, పి.సుశీల

లవ కుశులు : ఊరకే కన్నీరు నింప కారణ మేమమ్మా
ఊరకే కన్నీరు నింప కారణ మేమమ్మా
మారాడ విదేమమ్మా
ఊరకే కన్నీరు నింప కారణ మేమమ్మా

కుశుడు : శ్రీరాముని మించిన నీ వీరకుమారులము మేము
శ్రీరాముని మించిన నీ వీరకుమారులము మేము
కోరితే బంగారుకొండ కొని తేగలమమ్మా
ఊరకే కన్నీరు నింప కారణ మేమమ్మా

లవుడు : తల్లిచింత తీర్పలేని తనయుల బ్రతుకెందుకమ్మా
తల్లిచింత తీర్పలేని తనయుల బ్రతుకెందుకమ్మా
వల్లకాదు చెప్పకున్న వదలము నీపాదములా
ఊరకే కన్నీరు నింప కారణ మేమమ్మా
మారాడ విదేమమ్మా
ఊరకే కన్నీరు నింప కారణ మేమమ్మా



**రచన : సముద్రాల** — **గానం: పి.లీల, పి.సుశీల**

శ్రీరాముని చరితమునూ తెలిపెదమమ్మా
ఘన శీలవతి సీత కథ వినుడోయమ్మా ॥శ్రీరాముని॥
చెలువు మీర పంచవటీ సీమలో
తమ కొలువు సేయ సౌమిత్రి ప్రేమతో
తన కొలువు తీరె రాఘవుడు భామతో ॥శ్రీరాముని॥
రాముగనీ ప్రేమగొనే రావణు చెల్లీ
ముకు చెవులు గోసె సౌమిత్రి రోసిల్లీ
రావణుడా మాటవినీ పంతము పూనీ
మైథిలినీ కొనిపోయె మాయలు పన్నీ ॥శ్రీరాముని॥
రఘుపతినీ రవిసుతునీ కలిపెను హనుమా
నృపు జేసెను సుగ్రీవుని రామ వచన మహిమా
ప్రతి ఉపకృతి చేయుమనీ పనిచెను కపులా
హనుమంతుడు లంకజేరి వెదకెను నలుదెసలా ॥శ్రీరాముని॥
హా.. నాథా రఘునాథా.. పాహి పాహి
పాహియని అశోకవనిని శోకించే సీతా
పాహియని అశోకవనిని శోకించే సీతా
దరికి జని ముద్రికనిడి తెలిపె విభునివార్త
ఆ జనని శిరోమణి అందుకొని పావనీ ॥2॥
లంక కాల్చి రాముని కడకేగెను రివ్వు రివ్వుమనీ ॥శ్రీరాముని॥
దశరథ సూనుడు లంకను డాసీ దశకంఠు తలలు కోసి ॥దశరథ॥
అతని తమ్ముని రాజును జేసి సీతను తెమ్మని పనిచె
చేరవచ్చు యిల్లాలిని చూసీ శీల పరీక్షను కోరె రఘుపతీ
అయోనిజపైనే అనుమానమా
ధర్మమూర్తి రామచంద్రుని యిల్లాలికా యీ పరీక్షా
పతి ఆనతి తల దాలిచి అగ్ని దూకె సీతా
పతియానతి తల దాలిచి అగ్ని దూకె సీతా
హుతవాహుడు చల్లబడీ శ్లాఘించెను మాతా
హుతవాహుడు చల్లబడీ శ్లాఘించెను మాతా
సురలు పొగడ ధరణిజతో పురికి తరలె రఘునేతా ॥శ్రీరాముని॥

**గానం: పి.లీల, పి.సుశీల**

శ్లో॥ శ్రీ రాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం
అజానుబాహుం అరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి॥

**రచన : సదాశివబ్రహ్మం** — **గానం: పి.లీల, పి.సుశీల**

రామ సుగుణధామ రఘువంశ జలధి సోమ
రామ సుగుణధామ రఘువంశ జలధి సోమ
సీతా మనోభిరామ సాకేత సార్వభౌమ ॥శ్రీరామ సుగుణధామ॥
మందస్మిత సుందర వదనారవింద రామ
ఇందీవర శ్యామలాంగ వందిత సుత్రామ
మందార మరందోపమ మధుర మధుర నామ ॥శ్రీరామ॥
అవతారపురుష రావణాది దైత్య విరామా
నవనీత హృదయ ధర్మనిరత రాజలలామా
పవమాన తనయ సన్నుత పరమాత్మ పరంధామా
పవమాన తనయ సన్నుత పరమాత్మ పరంధామా ॥శ్రీరామ॥

**రచన : కంకంటి పాపరాజు** — **గానం: ఘంటసాల**

సీ॥ రంగారు బంగారు చెంగావులు ధరించు
శృంగారవతి నారచీర లూనె
భూజనంబులు మెచ్చు భోజనంబు లొనర్చు
కమలాక్షి కందమూలములు నమలె
చంద్రకాంత విశాల చంద్రశాలల నుండు
జవ్వని ముని పర్ణశాల నుండె
మరులుతో శ్రీరాము నురముపైఁ బవళించు
బాలికామణి యొంటి పవ్వళించె
గీ॥ కన్ను సన్నల శుద్ధాంతకాంత లాచ
రించు సేవలు మెచ్చని కాంచనాంగి
యొగ్గె మునిముగ్ధ కాంతాకృతోపచార
విధికి, నెంచ నసాధ్యంబు విధికి గలదె

**రచన : సముద్రాల** — **గానం: ఘంటసాల**

సందేహించకు మమ్మా
రఘురాము ప్రేమను సీతమ్మా
సందేహించకు మమ్మా
రఘురాము ప్రేమను సీతమ్మా
ఒకే బాణము ఒకటే మాట ఒక్క భామకే రాముని ప్రేమ
ఒకే బాణము ఒకటే మాట ఒక్క భామకే రాముని ప్రేమ
మిన్నే విరిగి పడినా మిన్నే విరిగి పడినా
వ్రతభంగమ్ము కానీడమ్మా ॥సందేహించకు॥
రఘుకులేశుడే ధర్మము వీడి మరో భామతో కూడిననాడూ
రఘుకులేశుడే ధర్మము వీడి మరో భామతో కూడిననాడూ
నాదు జపము తపము నా కావ్యమ్మే వృథయగునమ్మ
నాదు జపము తపము నా కావ్యమ్మే వృథయగునమ్మ
సందేహించకు మమ్మా
రఘురాము ప్రేమను సీతమ్మా
సందేహించకు మమ్మా

**రచన : కొసరాజు** — **గానం: ఘంటసాల, మాధవపెద్ది, రాఘవులు, రాణి, సరోజని**

స్త్రీ పురుషులు: అశ్వమేధ యాగానికి జయము జయము జయము
రామయ్య తండ్రి రాజ్యానికి శుభము శుభము శుభము ॥అశ్వ॥
స్త్రీలు : మధురమైన సమయమిదీ మరపురాని సమయమిదీ
మధురమైన సమయమిదీ మరపురాని సమయమిదీ
మనోవాంఛలన్నీ దీర్చు బలేమంచి సమయమిదీ ॥అశ్వ॥
ఋషులు : ఓం... సర్వేజనాస్సుఖినో భవంతు!
ఓం... సర్వేజనాస్సుఖినో భవంతు!
వశిష్ఠుడు : ప్రజా క్షేమమునకు క్రతువు జరుగుచున్నదీ ఓం..హరి ఓం...
సర్వపాపములు నేటితో సమయుచున్నవి ఓం... హరి ఓం...
దిక్పాలకులారా ఓ దేవ దేవులారా
దివ్యమైన మీ వాక్కుల దీవించండీ ॥అశ్వ॥
భరతుడు : పాడి పంటలతో దేశం వర్ధిల్లాలీ
లక్ష్మణుడు సౌభాగ్యంతో ప్రజలంతా తులతూగాలీ
భరతుడు : రఘువంశము కీర్తి దిశల రాణకెక్కాలీ
లక్ష్మణుడు : రాజలోక మెల్ల తలలువంచి మ్రొక్కాలీ ॥అశ్వ॥
స్త్రీలు : మంగళమగు మంగళమగు మహాయోధులారా
విభుని ఋణము దీర్చుకోండి వీరపుత్రులారా
అవమానము రాకుండా అపజయమ్ము లేకుండా
విజయమైన మరణమైన వెనుదీయక గెల్చిరండి ॥అశ్వ॥
భటులు : అశ్వమునకు వెన్నుగాచి తిరుగుచుందుము
హరి హరాదు లడ్డమైన లెక్క చెయ్యము
మేము లెక్క చెయ్యము
శతృఘ్నుడు: మిన్ను విరిగి పైబడినా మేరువు తలక్రిందైనా
ధైర్యము విడనాడము శౌర్యము గోల్పోవము॥అశ్వ॥

**రచన : సదాశివబ్రహ్మం** — **గానం: పి.సుశీల**

మ॥ సవనాశ్వం బిది, వీరమాతయగు కౌసల్యా సుతుండైన యా
భువనాధీశుడు ధర్మమూర్తి రఘురాముం డశ్వమేధంబు సం
స్తవనీయంబుగ సేయ రక్షకుడుగా శత్రుఘ్ను డేతెంచె, వీ
ర వరుల్ గల్గిన పట్టు డీ హయము, లే భక్తి కేల్మోడ్పుడీ

**గానం: పి.సుశీల**

శ్లో॥ హ్రీం కారాసన గర్భితానల శిఖాం సౌఃక్లీం కళాం బిభ్రతీం
సౌవర్ణాంబర ధారిణీం వరసుధాధౌతాం త్రినేత్రోజ్జ్వలామ్
వందే పుస్తక పాశమంకుశ ధరాం స్రగ్భూషితా ముజ్జ్వలాం
త్వాం గౌరీం త్రిపురాం పరాత్పరకళాం శ్రీచక్ర సంచారిణీమ్॥

**గానం: పి.లీల**

మ॥ ఇను డస్తాద్రికి జేరకుండ, రిపు రాజేంద్రున్ని రోధించి, నే
ఘన దోర్దండ పరాక్రముక్రమమునన్ గర్వాంధునిన్ ద్రుంచి, నా
యనుజన్మున్ విడిపించి తెచ్చెద, త్వదీయాంఘ్రిద్వయంబాన, నీ
వనుమానింపక సత్వరంబనుపుమమ్మా, నన్ను దీవింపుమా

**గానం: పి.సుశీల**

గీ॥ కడగి నే మనోవాక్కాయ కర్మలందు
పతి పదాంబుజ భక్తి తత్పరత తప్ప
అన్యమెరుగని యిల్లాలి నౌదునేని
మించి విజయంబు నీకు సిద్ధించుగాక.

**గానం: పి.లీల**

ఉ॥ దక్కెను బాలకుండని రథంబున నెత్తుకపోవ జూతువా,
ఎక్కడి కెందుపోగల వహీన పరాక్రముడీ కుశుండు, నీ
టక్కరి సాగనిత్తునే, హుటాహుటి నీవిక పోవచ్చునే,
చిక్కితి వింక చిత్రవధ చేసెద రమ్ము నృపాలకాధమా!

**రచన : సదాశివబ్రహ్మం గానం: ఘంటసాల, లీల, పి. సుశీల**

లక్ష్మణుడు: తండ్రి పంపుననేగి తాటక బరిమార్చి
తపసి యాగము గాచె ధర్మమూర్తి
లవుడు : ఆడుదాని జంపెనదియేటి ధర్మంబు
చెప్పుకొనుటకైన సిగ్గులేదే
లక్ష్మణుడు : శివధనుః ఖండన మవలీల గావించె
భుజబలశాలియా పుణ్యమూర్తి
కుశుడు : పుచ్చిన విలుద్రుంప భుజబలంబగునయ్య
దంభంబులిక చాలు తగ్గవయ్య
లక్ష్మణుడు : వర పరాక్రముడైన వాలిని తెగటార్చి
సూర్యనందను బ్రోచె శౌర్యధనుడు
లవుడు : చాటు మాటున దాగి శాఖాచరుని ద్రుంచె
శౌర్య లక్షణమిదా చాలునయ్య
లక్ష్మణుడు : దశకంఠు దునుమాడి తమ్ముని గాపాడె
కారుణ్యమూర్తి రాఘవ విభుండు
కుశుడు : గర్భవతిని సతిని కానల బోద్రోలె
కఠినాత్ముడతనికి కరుణ గలదె
లక్ష్మణుడు : బాలురకు ధర్మసూక్ష్మమే పగిది తెలియు
బాలురకు ధర్మసూక్ష్మమే పగిది తెలియు
తప్పు.. తప్పు.. శ్రీరాము నెదిరింప తగదు మీకు
లవుడు : ఎర్ర గురివింద తన నలు పెరుగనట్లు
చెప్పుచున్నావు మీ రాము గొప్పలెల్ల
కుశలవులు : చాలు చాలింక ధర్మ పన్నాలు మాని
చేవగలదేని యుద్ధంబు సేయవయ్య

**రచన : సముద్రాల గానం: పి.లీల, పి. సుశీల,**

లేరు కుశలవుల సాటి
సరి వీరులు ధారుణిలో ॥లేరు॥
తల్లి దీవెనా తాతయ కరుణా
వెన్ను కాయగా వెరువగనేల ॥తల్లి॥
హయమును విడువముగా ॥లేరు॥
బీరము లాడీ రాముని తమ్ములు
దురమున మాతో నిలువగలేక ॥బీరము॥
పరువము మాసిరిగా
పరువము మాసిరిగా ॥లేరు॥
పరాజయమ్మే ఎరుగని రాముని
రణమున మేమే గెలిచితిమేనీ ॥పరా॥
యశమిక మాదేగా
యశమిక మాదేగా
యశమిక మాదేగా ॥లేరు॥

**రచన : సదాశివబ్రహ్మం గానం: ఘంటసాల, లీల, పి. సుశీల**

రాముడు : స్త్రీబాలవృద్ధుల తెగవేయబూనుట
పాడిగాదని వెనుకాడుచుంటి
లవుడు : తాటక చంపుచో యేటికీ ధర్మంబు
తలపలేదో చెప్పగలవటయ్యా
రాముడు : ముక్కు పచ్చారని ముని కుమారుల చంప
కూడదటంచు నే గొంకుచుంటి
కుశుడు : రిపులపై నెవరైన కృపవహింతు రటయ్య
కొంకు కాదది మీకు జంకుగాని
రాముడు : చిన్నిపాపలు కడసారి చెప్పుచుంటి
తురగమును వీడి రణభూమి తొలగి పొండి
లవ కుశులు: వారువమెకాదు మిము కూడా వదలమయ్య
రణమొ శరణమొ చెప్పుమా రామచంద్రా॥

**రచన : సదాశివబ్రహ్మం గానం: రాఘవులు,వైదేహి,కోమల,సౌమిత్రి**

జయ జయ రామా జయ జయ రామా
శ్రీరామ పరంధామా జయరామ పరంధామా
శ్రీరామ పరంధామా జయరామ పరంధామా
రఘురామరామ రణరంగ భీమ జగదేక సార్వభౌమా ॥శ్రీరామ॥
సూర్యాన్వయాబ్ధి సోమా
సుగుణాభిరామ శుభనామా
సూర్యాన్వయాబ్ధి సోమా
సుగుణాభిరామ శుభనామా
కారుణ్యధామ దశకంఠ విరామా రాఘవ రాజలలామా ॥శ్రీరామ॥
సాకేత పురాధిప రామా
సీతా మనోహర శ్రీరామా
సాకేత పురాధిప రామా
సీతా మనోహర శ్రీరామా
అరవింద లోచనా సుందర సురచిర యిందీవర శ్యామా
జయ జయ రామా జయ జయ రాఘురామా ॥శ్రీరామ॥

**రచన : కంకటి పాపరాజు గానం: పి.సుశీల**

శ్లో॥ రామస్వామి పదాంబుజంబు లెద నారాధింతునేనిన్ సదా
రామాజ్ఞన్ జరియింతునేని దగ జాగ్రత్స్వప్న సుప్త్యాదులన్
రామున్ దప్పని దాననౌటయు యథార్థంబేని నా తల్లి యో
భూమీ, యీ యెడ ద్రోవజూపి నను గ్రొంపోవమ్మ నీలోనికిన్॥

## కథాసంగ్రహం

సుధామధుర సమన్వితమైన శ్రీరామకథ ఆ సేతుశీతాచల పర్యంతము అందరికీ తెలిసినదే! శ్రీమద్రామాయణము నందలి తుది ఘట్టమే లవకుశుల చరిత్రము.

సీతారాముల పట్టాభిషేకము- ప్రజావాక్య పాలనమునకు శ్రీరామచంద్రుడు గర్భవతియైన సీతాదేవిని పరిత్యజించుట- మహారణ్యంలో క్రుమ్మరుతూన్న సీతాదేవిని వాల్మీకి మహర్షి రక్షించి తన ఆశ్రమానికి జేర్చుట-సంతత రామనామ సంకీర్తనంతో విలసిల్లే వాల్మీకి ఆశ్రమంలో సీతాదేవి కలతదేరి కవల పిల్లలను కనుట - లవ,కుశులనే ఆ కుమారులు దినదిన ప్రవర్ధమానులగుచు వాల్మీకి మహర్షి చెంత రామాయణం నేర్చుకొనుట-ప్రజాశ్రేయస్సు కొరకు శ్రీరామచంద్రుడు అశ్వమేధ యాగము అరంభించుట-ఆ యజ్ఞాశ్వమును లవకుశులు పట్టుకొనుట - తత్ఫలితముగా తండ్రి కుమారులకు ఘోర యుద్ధము జరుగుట-మొదలైన రసవత్తర ఘట్టములను, పర్యవసానమున్ను, రమణీయమైన రంగురంగుల చిత్రములో నేత్రానందకరముగా వెండి తెరపై చూచి మహదానంద మందుదురు గాక!

## నటీ నటులు

ఎన్.టి. రామారావు, అంజలీదేవి, వి.నాగయ్య, కన్నాంబ, కాంతారావు,రమణారెడ్డి,సంధ్య,ధూళిపాళ, సూర్యకాంతం, కె.వి.యస్. శర్మ, లక్ష్మీప్రభ, శోభన్‌బాబు,లక్ష్మి కోటేశ్వరరావు, రాజేశ్వరి, ఎ.వి. సుబ్బారావు, భారతి, శివరామకృష్ణయ్య, విజయరావు , శాండో కృష్ణ.

మరియు
లవకుశులుగా
**నాగరాజు, సుబ్రహ్మణ్యం**

గెస్ట్ ఆర్టిస్టులు
రేలంగి, గిరిజ, యస్.వరలక్ష్మి, వాసంతి,బి.ఎ.,

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : సదాశివబ్రహ్మం |
| పాటలు | : సదాశివబ్రహ్మం, సముద్రాల, కొసరాజు |
| డాన్స్ | : వెంపటి సత్యం |
| కళ | : టి.వి.ఎస్.శర్మ |
| అసిస్టెంట్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : పి.ఎల్.రాయ్ |
| కెమెరామన్ | : పి. విశ్వనాథరామ్ |
| డైరెక్టర్ ఆఫ్ ఆడియోగ్రఫీ | : ఎ. కృష్ణన్ |
| రికార్డిస్టు | : జి.వి. రమణన్ |
| సాంగ్స్ అండ్ రీరికార్డింగ్ | : వి. శివరాం. బి.ఎ., బి.ఎస్. సి. |
| ఎడిటింగ్ | : సంజీవి |
| సెట్టింగ్స్ | : సి. కుప్పస్వామి నాయుడు, ఆర్. శ్రీనివాస్, టి. నీలకంఠం |
| మేకప్ | : హరిబాబు, పీతాంబరం |
| | : భక్తవత్సలం, కృష్ణ |
| దుస్తులు | : నారాయణమూర్తి, బి. అప్పారావు |
| | : శ్రీరామమూర్తి, రాజు |
| మౌల్డింగ్ | : గోవిందస్వామి, ఆర్ముగం, గోపాల పిళ్ళై |
| స్టంట్స్ | : శ్యామసుందర్ |
| చీఫ్ ఎలెక్ట్రీషియన్ | : యం. శంకరనారాయణ |
| స్టూడియో ప్రోగ్రామ్స్ | : సి.ఎన్. ప్రకాశరావు |
| | : బాలు, రామదాసు |
| యారో ట్రిక్స్ అండ్ టైటిల్స్ | : రవికాంత్‌నగాయిచ్ |
| కలర్ స్పెషలిస్టు | : కె.ఎస్. ఎన్. మూర్తి |
| పబ్లిసిటీ | : స్టూడియో శర్మ, టి.వి.ఎస్. |
| స్టిల్స్ | : ఆర్.ఎన్.నగరాజరావు |
| అసోసియేట్ డైరెక్టర్ | : జి.వి.ఆర్.శేషగిరిరావు |
| ప్రొడక్షన్ | : బి.చెంచురామయ్య |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : ఎం.కె.ఆర్.నాయర్ |
| నేపథ్య గాయకులు | : ఘంటసాల, మాధవపెద్ది, పిఠాపురం, మల్లిక్, రాఘవులు, లీల, సుశీల, జిక్కి, జానకి, రాణి, కోమల, వైదేహి, సరోజిని, సావిత్రి |
| గేవాకలర్ ప్రింటింగ్ అండ్ ప్రాసెసింగ్ | : ఫిలిం సెంటర్, బొంబాయి |
| స్టూడియోస్ | : విజయ -వాహిని, మద్రాసు |
| నృత్యములు | : విజయలక్ష్మి, రీటా, సుకుమారి |
| దర్శకత్వం | : సి. పుల్లయ్య, సి.ఎస్.రావు |
| నిర్మాత | : ఎ.శంకరరెడ్డి, ఎం.ఏ.,బి.ఎల్., |


సి.పుల్లయ్య


సి.ఎస్.రావు


ఘంటసాల


మాధవపెద్ది


పిఠాపురం


మల్లిక్


రాఘవులు


లీల


సుశీల


జానకి


రాణి


కోమల


సావిత్రి


సరోజిని


సముద్రాల


కొసరాజు

## 'సరిగపదమని-13'

**జవాబులు:-**

**అడ్డం:** 1. చందన 3. ఓలమ్మి 6. వాలు 7.మరచి 10.సుందరి 11.తరమా12. ఎద 13. రైక 15. రాగాలు 17.మాసం 18. నువ్వేం 19.సీత 22.బాబూ 23.నిన్నలేని

**నిలువు:** 1. చంటి 2. నడుమ 4.లక్ష్మి 5. నలుగురి 8.చిన్ని 9. భారతమాత 10.సుందరా 14.కనులు 16.గాజు 19. సీతా 20.కన్న 21.రాని

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

వై.రఘురామరావు- హైదరాబాద్, నాగేశ్వరరావు అల్లంశెట్టి- తెనాలి, కె.వి.సత్యవతి- సరూర్‌నగర్, ఎస్.వసుంధరా రాణి- అనకాపల్లి, వేముల శేఖర్- నిజామాబాద్, తాడి రంగారావు- రాజమండ్రి, అల్లూరి రామరాజు- విజయవాడ, దారెల్లి జయ శంకర్- పాల్వంచ (ఖమ్మం), పెద్దోజు విజయలక్ష్మి- కొత్తగూడెం (ఖమ్మం), రఘు.వి- నూపాల్వంచ (ఖమ్మం), కె.కళ్యాణ్‌కుమార్- రామసముద్రం (చిత్తూరు), ఎస్.ఎన్.ఎస్.బి.ఆర్.చైతన్య- విశాఖపట్నం, అయ్యగారి రాజశేఖర్- రాజోలు, యన్.శ్యామల- నెల్లూరు, రావుల వేణుగోపాల్- కాజీపేట (వరంగల్), సి.ఆర్.సుమతీనగర్- హైదరాబాద్, గుండాన జోగారావు- రాయగడ (ఒరిస్సా), నెల్లుట్ల రమాదేవి- వరంగల్, ఎ.పద్మిని- విశాఖపట్నం, సి.హెచ్.రాధిక- హైదరాబాద్, పి.కళ్యాణ్ కళాధర్- నెల్లూరు, ఎమ్.మౌళి- విశాఖపట్నం, టి.చంచలరావు- హైదరాబాద్, ఎల్.ఎ.వి.ఎస్.భగవాన్ శాస్త్రి- గండిపాళెం (నెల్లూరు), సి.వి.ఎస్.నాగమణి- నెల్లూరు, కె.సతీష్‌బాబు- కొత్తపేట (ప॥గో॥జిల్లా), శ్రీపాద శారదాదేవి- రాజమండ్రి, ఎన్.మంజులదేవి- హైదరాబాద్, హెచ్.నితిన్- హైదరాబాద్, కళ్యాణి- తిరుపతి, సి.రెడ్డినమ్మ- ఉరుటూరు (కడప), గోసాల నాగలక్ష్మి- రాజమండ్రి, కే.భాస్కరరావు- హైదరాబాద్, పోతల రమణమూర్తి- కోర్లాం (శ్రీకాకుళం), విజయ & ఉదయ భాస్కరరావు- రాజమండ్రి, బి.ఎ.ఎస్.ప్రసాద్- పుల్లలపాడు (ప॥గో॥జిల్లా), పింగళి శ్యామసుందర్- బెంగుళూరు, కె.హేమలత- నల్గొండ, పి.స్వాతిలక్ష్మి- విజయవాడ, బంకురు శ్రీనివాస్- బొబ్బిలి (విజయనగరం), గుత్తా మాధవి- కంచికచర్ల (కృష్ణా జిల్లా), టి.సత్యనారాయణ -గుడూరు, ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), చివుకుల చిరంజీవి- ఒంగోలు, పురుషోత్తపట్నం నాగరాజు- గుంటూరు, వి.శ్రీనివాస్- మచిలీపట్నం, జోశ్యుల భానుమూర్తి- భీమవరం (ప॥గో॥జిల్లా), పప్పు అప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), యు.ఇందునీహారిక- నెల్లూరు, వి.విజయలక్ష్మి- అమలాపురం (తూ॥గో॥జిల్లా), జె.కృష్ణప్రియ- తిరుపతి, పాణ్యం ప్రణతి- హైదరాబాద్, తిరుమల్ ప్రసాద్.పి- హైదరాబాద్, వి.రాంబాబు- హైదరాబాద్, డి.ఎస్.డి.కుమార్- హైదరాబాద్, ఎమ్.రామలక్ష్మి- విజయవాడ, పి.వేణుగోపాల్ రావు- అచ్చంపేట్ (మహబూబ్‌నగర్), బచ్చు విజయ్‌కుమార్- విశాఖపట్నం, ఎస్.శివనారాయణ- కొత్తపేట (ప్రకాశం), కొడూరు సందీప్- కడ్తల్ (ఆదిలాబాద్), టి.ఎస్.హిమబిందు- కాకినాడ, శ్రీలలిత.ఎస్- పార్లాపల్లి (నెల్లూరు), సి.విజయసారధి - కర్నూలు, ఫణికిరణ్- కొడాలి (కృష్ణా).

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

డి.ప్రసాద్- హైదరాబాద్, భార్గవి.వై- నూజివీడు, కె.ప్రజ్వాల్ బాబు- కర్నూలు, కె.వీనుస్‌రాణి- ఒంగోలు, పి.యస్.ఆర్.కృష్ణమూర్తి- హైదరాబాద్, మోచెర్ల రమాజ్యోతి- రాజమండ్రి, ఎమ్.మధూరి రంగారావు- నల్గొండ, ఎ.లక్ష్మికీర్తి- బిక్కవోలు, పి.గురుభాస్కర్- ప్రొద్దుటూరు, యర్రా వెంకటలక్ష్మి- కాకినాడ, ఎం.లక్ష్మినారాయణ- సికింద్రాబాద్, ఎన్.ఫణి- హైదరాబాద్, యం.లక్ష్మికాంత్- హైదరాబాద్, సరస్వతుల రామనరసింహం- హైదరాబాద్, వడ్లమన్నాటి శ్వేత- విజయవాడ, కనుపర్తి జగదీశ్- విజయవాడ, ఎ.శివకుమార్- తిరుపతి, జి.దేవంద్రనాథరెడ్డి- పత్తికొండ (కర్నూలు), ఇ.రాధిక- హైదరాబాద్, జి.పాండురంగ శర్మ- హైదరాబాద్, గంటి రమ్య- అమలాపురం, గంటి వినయ్- అమలాపురం, సపారె ఈరణ్ణ- ఆదోని, మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, కె.పి.ఆర్.శర్మ- కర్నూలు, కె.జగదీష్‌బాబు- పార్వతీపురం (విజయనగరం), మాదాబత్తుల లక్ష్మి- విజయనగరం, ఆసియాబేగం- నాచారం, అమృత.ఎమ్- హైదరాబాద్, జి.పంపాద్రి యాదవ్- సికింద్రాబాద్, వి.సత్యవతి- హైదరాబాద్, అవధానుళ శారద- ఖమ్మం, ముసలె అంబాజిరావు- వడ్డగేరి (కర్నూలు), ఎస్.శివశ్వేత- దేశపాత్రుని పాలేం (విశాఖజిల్లా), జాగిర్దార్ శ్రీహర్ష- సామర్లకోట, సాలా రవికుమార్- విశాఖపట్నం, రచ్చ నవీన్‌కుమార్- సికింద్రాబాద్, జి.ఎస్.రమేష్- తెర్నెకల్ (కర్నూలు), బోడపాటి దీవ- మంగళగిరి, వి.ఆదిత్యమణిధర్- భీమవరపుకోట (తూ॥గో॥జిల్లా), బి.వి.మల్లిఖార్జునం- హైదరాబాద్, ఎమ్.ఎస్.జయలక్ష్మి- టాటానగర్ (జార్ఖండ్), జి.జయచంద్ర- కర్నూలు, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ (కృష్ణా), పి.సత్యనారాయణరావు- విజయవాడ, కర్రాభాస్కర్- కర్నూలు, కొణిదెన ఆదిత్య- గుంటూరు, జి.గాయత్రిజ్ఞానేషన్- హైదరాబాద్, గంగారపు కళ్యాణి- సత్తెనపల్లి (గుంటూరు), టి.శేషగిరి- తుని (తూ॥గో॥జిల్లా), కె.మహేష్‌బాబు- భీమవరం, వై.రోశిరెడ్డి- సత్తెనపల్లి, మన్నవ మాధవి- సత్తెనపల్లి, ఎన్.నీలిమ- కాకినాడ, యు.సంగీత- తిరుపతి, సి.హెచ్.సుర్యారావు- చీపురుపల్లి (విజయనగరం), అవసరాల ప్రసన్నకుమార్- విశాఖపట్నం, హర్షకాంత్ సాహు- నర్సిపురం (శ్రీకాకుళం), అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), బి.బి.ఆర్. ప్రసాద్- రామచంద్రపురం (తూ॥గో॥జిల్లా).

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

పి.సాయిఅనురాధ-నెల్లూరు, ఆర్.శ్రీనివాస్-బెంగుళూరు, మండలిక.అన్నేశ్వర శర్మ -హైదరాబాద్, యం.అనూష-కాకినాడ, ఏ.బి.వి.ఎన్.రమేష్- వేలూరు (తమిళనాడు), కె. వాణి-విజయనగరం, గానుగపాటి.సరోజినీదేవి-సికింద్రాబాద్, కుంచె.అనంతలక్ష్మి- పల్లపు వీధి-(తూ.గో), ద్రోణంరాజు అనఘలక్ష్మి- హనుమకొండ(వరంగల్), డి.నాగరాజు- ఖైరతాబాద్, ఆత్రూరి. వెంకట శరత్‌కృష్ణ-హైదరాబాద్, యస్.వి.వి.యన్.రవికుమార్ -ఖమ్మం,యల్. రాహుల్ రెడ్డి-హైదరాబాద్, ఆమంచి.వెంకటలక్ష్మికామేశ్వరి -రాజోలు(తూ.గో), తాళ్ళూరి. రాధ- హైదరాబాద్, కె.వి. దుర్గామోహన్‌రావు -నల్గొండ, సి.హెచ్. ఇందిర- విశాఖపట్నం, నిర్మల కృష్ణ-తిరుపతి, శ్రీరామకవచం నరసింహ మూర్తి- ఒంగోలు, యం.వి.చలపతిరావు -తిమ్మసముద్రం (రావూరు), ఎన్.సి. సంపత్‌కుమార్- అనంతపురం, కె.వి.సుబ్బయ్య -గుంటూరు, యం. మీనా ప్రభాకర్-పాలెం, ఆర్.ఫణిబాల-చిత్తూరు, కె.వి. సరస్వతి- హైదరాబాద్, కేతవరపు సాయి మేఖల-విజయవాడ, శ్రీమతి డి.రాధ-రాయపూర్, బిల్లూరి ఉమాదేవి-ఆదోని, పి.వి.యస్.రమేష్‌బాబు-కురిచేడు(ప.జి), వి. శ్రీధర్‌రావు-సికింద్రాబాద్, వై.మంజీర-విశాఖపట్నం, శ్రీనివాస్ పవార్-ఆర్మూర్ (నిజామాబాద్) యన్.మాధవీలత-దర్శి(ప.జి), యం.విజయభాస్కర్‌రావు - జగ్గంపేట(తూ.గో), మహేష్ సాంసాలే-కోడుమూరు (కర్నూల్), సి.హెచ్. సత్యనారాయణ -మల్లేపల్లి(తూ.గో), బి.మురళీధర్‌రావు- దుండిగల్(రంగారెడ్డి), పడాల.రాము- పాతపట్నం (శ్రీకాకుళం), కె.సంతోష్‌కుమార్ -సికింద్రాబాద్, కె.రాజ్యలక్ష్మి - పాతపట్నం(శ్రీకాకుళం), విస్సా వెంకట సత్యవరప్రసాదరావు- పినపళ్ళ(తూ.గో) ,పి.రాణి- నరసాపురం (ప.గో), పోలా.రమణ -హైదరాబాద్, కె.చెన్నకృష్ణారెడ్డి- హైదరాబాద్, కాకటూరు.సుజాతనాగరాజారావు- యూసఫ్‌గూడ, ఇప్పగుంట. వెంకట శ్రీనివాసరావు -మీర్‌పేట, ఎ.మల్లికార్జునరావు-వనస్థలిపురం, పి.లక్ష్మిదేవి -దోర్నిపాడు(కర్నూలు), సింహాద్రి పద్మజ-శ్రీకాకుళం, కె. చంద్రశేఖర్- యూసఫ్‌గూడ, శ్రీమతి సామంచి రాధ- సీతారామపురం (విజయవాడ) యు.విజయశేఖర్‌రెడ్డి-కూకట్‌పల్లి, జి.కళ్యాణి- కర్నూలు, కె.వెంకటరాజం- సనత్‌నగర్, యం.లక్ష్మి, శ్రావణి శ్వేత- హాజీమాబాద్(గాజువాక), యన్.రవీంద్రబాబు- చింతల పాలెం(నెల్లూరు), సపారే ఇందిర- కళ్యాణ్, యమ్. శ్రీఅనుదీప్- రామారావు పేట(కాకినాడ), జి.విద్యారాజేశ్వరరావు- బల్కంపేట, కాటేపల్లి కృష్ణమోహన్- మిర్యాలగూడ(నల్గొండ), కర్రి ఝాన్సీ-మెహదీపట్నం.

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

వి. ఉదయశంకర్-జీవకోణ(తిరుపతి), కె.పి. చైతన్యరాం-బురదపేట(గద్వాల), యన్. శంకరాచార్యులు-చిలుకానగర్, తమిరిశ జానకి-హబ్సీగూడ, పెండ్యాల మురళీధర రావు -మోత్కూరు(నల్గొండ), అయితా మనోజ్‌కుమార్- సూళ్ళూర్‌పేట (నెల్లూరు), పి.జ్ఞాన ప్రసూన-కస్తూర్బానగర్(చెన్నై), పి.పార్థసారథి-ఆకుతోటపల్లి, వనం జానకీదేవి- ఒల్డ్‌పాల్వంచ(ఖమ్మం), సి.యస్.సుజాత-చంద్రాపూర్(మహరాష్ట్ర), చిలుకూరి శ్రీనివాస శర్మ-బాపనయ్యనగర్(విజయవాడ), ఎ.ఆదినారాయణ-చిలకలూరిపేట (గుంటూరు), బి.జాకీర్‌హుసేన్-కర్నూలు, మద్దాలిసువర్చలశ్రీనివాస్-కంచన్‌బాగ్, మేడా పద్మావతి-అక్కయపాలెం(వైజాగ్), యన్.ప్రసాద్-యన్.ఐ.టి(వరంగల్), కోక్కొండ. పర్శీ-పోతిరెడ్డిపల్లి(వరంగల్.జి), యస్.సుప్రీయకృష్ణ-సనత్‌నగర్, యల్లాపంతుల.చందు-శ్రీకాకుళం, కిషోర్‌కుమార్-గోదావరి(కరీంనగర్), యన్.గాయత్రిదేవి- చైతన్యపురి, ఓగిరాల అంజన-నెల్లూరు, యం.ఆర్. శేషగిరిగారు- తణుకు (ప.గో), అబయ్ ఈగోర్- మహబూబ్‌నగర్, కె.యస్.వి.వి. ప్రియ-తణుకు, జి.వి.రమణామూరి -మద్దిలపాలెం (వైజాగ్), బి.కవిత-ప్రొద్దుటూరు(కడప), పి. శిరిష్‌కుమార్-దానవాయుపేట (రాజమండ్రి), యం.వి.యస్.లక్ష్మి- గాంధీనగరం(కాకినాడ), రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- న్యూమిర్జాలగూడ (మల్కాజ్‌గిరి), జి.ఇందిరాకుమారి-వనస్థలిపురం, తాళ్ళూరి రేణుకాదేవి -బాగ్‌లింగంపల్లి, సి.హెచ్.సూర్యనారాయణమూర్తి-రాజమండ్రి, పి.ఫణిభూషణాచారి-మౌలాలి, ఇ.తేజశ్విని-కాజూర్‌గ్రీమ్స్‌పేట(చిత్తూర్), ఎ.కాశింఖాన్-చిత్తూరు, యం.శ్రీరామ చంద్రమూర్తి- జి.యస్.ఐ., సౌమిత్రి రమణా చార్యులు-మౌలాలి, యం.అంజిరెడ్డి-హరిహరనగర్(ఒంగోలు).

# ఈ జీవనజ్యోతి శాంతాకు స్ఫూర్తి



## చిన్న జ్యోతి సైతం మరొక జ్యోతిని వెలిగిస్తుంది
## చిన్న ప్రాణి సైతం మరొక ప్రాణికి ఊతమిస్తుంది

నిర్జీవ రసాయనాల జోలికి పోకుండా జెనటిక్ ఇంజనీరింగ్ ద్వారా సూక్ష్మజీవుల కణాలలో తగిన మార్పు చేసి అద్భుత ఫలితాలను సాధించే అత్యాధునిక జీవనవేదం - జీవ సాంకేతిక శాస్త్రం. అదే బయో టెక్నాలజీ. మన శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవ ప్రక్రియ ద్వారా తయారయిన ఈ తరహా ఉత్పాదనలు మానవాళికి అనువైనవి; ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి. బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కల్పించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్.

బయోటెక్నాలజీకే జీవం పోసిన శాంతా బయోటెక్నిక్స్ స్వదేశీ టెక్నాలజీతో, అందుబాటు ధరలో ప్రాణ రక్షక ఔషధాల తయారీకే పరిమితం కాలేదు. స్వంత ఉత్పాదనల పరిశోధన, తయారీ, మార్కెటింగ్‌లతో బాటు దేశ విదేశ ఫార్మాస్యూటికల్ సంస్థల తరపున పరిశోధనలు నిర్వహించడం, ఔషధాలు తయారుచేసి పెట్టడం, ఇతర శాస్త్రీయ సేవలందించడం, మానవాళికి ఉపయోగపడే టీకాలు, ఔషధాల తయారీలో వారికి సహకరించడం వంటి అనేక కార్యకలాపాల ద్వారా సామాన్య ప్రజలకు బహుముఖాలుగా సేవ చేస్తున్నది.

హెపటైటిస్-బి రోగాన్ని నిరోధించే టీకా Shanvac™-B, క్యాన్సర్ చికిత్సలో ఉపయోగపడే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా-2బి Shanferon తయారీల ద్వారా అశేష ఖ్యాతిని, అసంఖ్యాక అవార్డులను పొందిన శాంతా బయోటెక్నిక్స్ తన అనుబంధ సంస్థయైన శాంతా మెరైన్ ద్వారా మెరైన్ బయోటెక్నాలజీ, న్యూట్రాస్యూటికల్స్ రంగానికి సేవలందిస్తోంది. మరొక అనుబంధ సంస్థ శాంతా వెస్ట్ ద్వారా క్యాన్సర్ చికిత్సకు అవసరమైన పరిశోధనలు కొనసాగిస్తోంది.

**మనిషి ప్రాణానికి అత్యంత విలువనిచ్చే శాంతా, జీవ చైతన్యానికి ప్రతీకయైన జ్యోతినుండి స్ఫూర్తి పొందుతోంది.**

---

- Pioneers in r-DNA Based Human Healthcare Products in India
- Customised Monoclonal & Polyclonal Antibodies
- Recombinant Protein Development, Manufacturing & Formulation
- Vaccines, Therapeutic Products & Diagnostics
- cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals
- Nutraceuticals

W.H.O.(Geneva) Pre-qualified U.N.Supplier of Hepatitis-B Vaccine


SHANTHA BIOTECHNICS PVT. LTD.
www.shanthabiotech.com
3rd Floor, Serene Chambers, Road No.7, Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com



మీ అభిమానం, ప్రోత్సాహం సంగీత దర్శకుడిగా నన్ను ఈ స్థాయిలో

నిలబెట్టింది. మీరంతా నా వెనకే ఉన్నారన్న ధైర్యంతో నేను

ఓ Blind Singer గా నటిస్తూ రూపొందిన

**శ్రీను..వాసంతి..లక్ష్మి...**

చిత్రాన్ని మీ ముందుకు తీసుకొస్తున్నా.

అచ్చ తెలుగు పాటల్ని స్వచ్ఛమైన మనసుతో

తెలుగువారంతా ఆదరిస్తారనటానికి

**శ్రీను..వాసంతి..లక్ష్మి...**

ఆడియో విన్న ప్రతిఒక్కరు పాటలు చాలాబాగున్నాయని చెప్పటం గొప్ప నిదర్శనం.

ఈ ఆడియోకి అఖండవిజయం చేకూర్చిన తెలుగువారందరికీ

కృతజ్ఞతలు తెలియజేస్తూ ...

యస్.యం. సురేష్ నిర్మాతగా

ఇ. శ్రీనివాస్ దర్శకత్వంలో రూపొందిన

**శ్రీను..వాసంతి..లక్ష్మి...**

సినిమాని కూడా ఆదరిస్తారని ఆశిస్తూ ....

మీ

ఆర్పీ